# దేవాలయ రహస్యములు



రచయిత: త్రిమత ఏకైక గురువు

ఆధ్యాత్మిక సామ్రాజ్య చక్రవర్తి, శతాధిక గ్రంథకర్త

ఇందూ జ్ఞాన ధర్మప్రదాత, సంచలనాత్మక రచయిత, త్రైత సిద్ధాంత ఆదికర్త

శ్రీ శ్రీ శ్రీ ఆచార్య ప్రబోధానంద యోగీశ్వరులు

www.thraithashakam.org





# దేవాలయ రహస్యములు


రచయిత: త్రిమత ఏకైక గురువు

ఆధ్యాత్మిక సామ్రాజ్య చక్రవర్తి, శతాధిక గ్రంథకర్త

ఇందూ జ్ఞాన ధర్మప్రదాత, సంచలనాత్మక రచయిత, త్రైత సిద్ధాంత ఆదికర్త

## శ్రీ.శ్రీ.శ్రీ ఆచార్య ప్రబోధానంద యోగీశ్వరులు






ప్రచురించిన వారు

## ఇందూ జ్ఞానవేదిక

(Estd. in 1978 - Regd.No.: 168/2004)

త్రైత శకము-41    12వ ముద్రణ : జూన్-2019

ప్రతులు : 1000    **వెల : 140/-**

01) త్రైత సిద్ధాంత భగవద్గీత.
02) ఇందూ సాంప్రదాయములు.
03) ఇందుత్వమును కాపాడుదాం.
04) ఆధ్యాత్మిక ప్రశ్నలు-జవాబులు.
05) హిందూమతములో కులవివక్ష.
06) తిట్ల జ్ఞానము-దీవెనల అజ్ఞానము.
07) శ్రీకృష్ణుడు దేవుడా! భగవంతుడా!!
08) యజ్ఞములు (నిజమా-అబద్ధమా?).
09) ఏ మతములో ఎంత మతద్వేషము?
10) హిందూ మతములో సిద్ధాంతకర్తలు.
11) దైవగ్రంథములో సత్యాసత్య విచక్షణ.
12) దేవుని రాకకు ఇది సమయము కాదా!
13) మూడు గ్రంథములు, ఇద్దరు గురువులు.
14) దయ్యాల-భూతాల యదార్థ సంఘటనలు.
15) ప్రతిమ × విగ్రహ-దైవము × దెయ్యము.
16) త్రైతాకార రహస్యము (త్రైతాకార బెర్ముడా).
17) హేతువాద ప్రశ్నలు-సత్యవాద జవాబులు.
18) జ్యోతిష్యశాస్త్రము (శాస్త్రమా-అశాస్త్రమా?).
19) మంత్రము-మహిమ (నిజమా-అబద్ధమా?).
20) అంతిమ దైవగ్రంథములో జ్ఞానవాక్యములు.
21) మన పండుగలు (ఎలా చేయాలో తెలుసా?).
22) కలియుగము (ఎప్పటికీ యుగాంతము కాదు).
23) కృష్ణ మూస (శ్రీకృష్ణ మరణము తర్వాత జీవితము)
24) స్వర్గము ఇంద్రలోకమా! నరకము యమరాజ్యమా!!
25) మూడు దైవ గ్రంథములు-మూడు ప్రథమ వాక్యములు.

26) తీర్పు-దేవుని తీర్పు.
27) గుత్తా.
28) ప్రబోధ
29) సుబోధ.
30) ఆదిత్య.
31) సమాధి.
32) తల్లి తండ్రి.
33) గీటురాయి.
34) త్రైతారాధన.
35) ధర్మచక్రము
36) ప్రసిద్ధి బోధ.
37) కర్మపత్రము.
38) నీకు నా లేఖ.
39) ఒక్కడే ఇద్దరు.
40) దేవుని ముద్ర.
41) భావము-భాష.
42) కథల జ్ఞానము.
43) సత్యాన్వేషి కథ.
44) సిలువ దేవుడా?
45) ఆత్మలింగార్థము.
46) ప్రాథమిక జ్ఞానము.
47) విశ్వ విద్యాలయము.
48) జీహాద్ అంటే యుద్ధమా?
49) జనన మరణ సిద్ధాంతము.
50) మతాతీత దేవుని మార్గము.
51) దేవుని చిహ్నము.
52) మతము-పథము.
53) ద్రావిడ బ్రాహ్మణ.
54) ప్రవక్తలు ఎవరు?
55) ధర్మశాస్త్రము ఏది?
56) దేవుని గుర్తు-963.
57) ఇందువు క్రైస్తవుడా?
58) నాస్తికులు-ఆస్తికులు.
59) ప్రబోధ తరంగాలు.
60) గీతా పరిచయము.
61) త్రైత సిద్ధాంతము.
62) వార్తకుడు-వర్తకుడు.
63) ధర్మము-అధర్మము.
64) తత్త్వముల జ్ఞానము.
65) మరణ రహస్యము.
66) పునర్జన్మ రహస్యము.
67) గురు ప్రార్థనామంజరి.
68) సామెతల జ్ఞానము.
69) పొడుపు కథల జ్ఞానము.
70) ఏది నిజమైన జ్ఞానము?
71) నిగూఢ తత్త్వార్థ బోధిని.
72) దేవాలయ రహస్యములు.
73) ప్రబోధానందం నాటికలు.
74) హేతువాదము-ప్రతివాదము.
75) మత మార్పిడి దైవద్రోహము.
76) నాది లోచన-నీది ఆలోచన.

77) ద్యానము-ప్రార్థన-నమాజ్.
78) సాయిబాబా దేవుడా! కాదా?
79) లు అంటే ఏమిటి? (తెలుగు)
80) చెట్టుముందా! విత్తుముందా?
81) గీతం-గీత (పాటల జ్ఞానము).
82) మరణము తర్వాత జీవితము.
83) ప్రథమ దైవగ్రంథము భగవద్గీత.
84) దేవుని జ్ఞానము కబ్జా అయ్యింది.
85) అజ్ఞానములో ఉగ్రవాద బీజాలు.
86) ఒక మాట మూడు గ్రంథములు.
87) త్రైత సిద్ధాంత ఆధ్యాత్మిక ఘంటు.
88) ఏసు చనిపోయాడా? చంపబడ్డాడా?
89) ఏది సత్యము-ఏది అసత్యము.
90) ఒక వ్యక్తి రెండు కోణములు.
91) అంతిమ దైవగ్రంథములో వజ్ర వాక్యములు.
92) బ్రహ్మ-రావణబ్రహ్మ-భగవాన్ రావణబ్రహ్మ.
93) ద్వితీయ దైవగ్రంథములో రత్న వాక్యములు.
94) హిందూ ధర్మమునకు రక్షణ అవసరమా?
95) వేదములు మనిషికి అవసరమా?
96) ఉపనిషత్తులలో లోపాలు.
97) ఖుర్ఆన్, హదీసు ఏది ముఖ్యము?
98) భక్తిలో మీరు సంసారులా? వ్యభిచారులా?
99) ౧౦౦, శతము, 100
100) సుప్రసిద్ధి బోధ.
101) సిద్ధి బోధ.
102) సత్యార్థ ప్రకాశికలో సత్యమెంత.
103) రూపము మారిన గీత.
104) పోలీసులు-నేరస్థులు.
105) ఇప్పటి మానవుని పరిస్థితి.
106) తత్త్వార్థ బొమ్మల జ్ఞానము.

## యోగీశ్వరుల వారి సంచలనాత్మక త్రిమత ఆధ్యాత్మిక ప్రసంగములు

*(DVD'S)* 

01. గుర్తింపబడనివాడు గురువు.
02. పుట్టినరోజు ఎవ్వరికీ రాదు.
03. ద్వితీయుడు-అద్వితీయుడు.
04. ఏక్‌నిరంజన్-అలక్‌నిరంజన్.
05. మాయకుడు-అమాయకుడు.
06. తల్లి తండ్రి-గురువు దైవము.
07. గురువులేని విద్య గ్రుడ్డివిద్య.
08. మతములలో పవిత్రయుద్ధము.
09. ప్రపంచ శ్రద్ధ-పరమాత్మ శ్రద్ధ.
10. దేశం మోసం-దేహం మోహం.
11. ఎదమీదముద్ర-తల్లి తండ్రి గుర్తు.
12. మూడు పుట్టుకలు-రెండు జాగాలు.
13. యోగీశ్వరుల జన్మదిన సందేశము.
14. తెలుగులో మూడు-ఆరు-తొమ్మిది.
15. మాయ మర్మము- ఆత్మ ధర్మము.
16. బయటి సమాజం-లోపలి సమాజం.
17. దేవుని జ్ఞానము-మాయ మహత్యము.
18. మూడు నిర్మాణాలు-ఒక పరిశుభ్రత.
19. సహజ మరణం- తాత్కాలిక మరణం.
20. మేఘం ఒకభూతం- రోగం ఒకభూతం.
21. కర్మ లేని కృష్ణుడు-కర్మ ఉన్న కృష్ణుడు.
22. స్వార్థ రాజకీయం (స్వ+అర్థ రాజకీయం).
23. శ్రీకృష్ణుడు చనిపోయాడా? చంపబడ్డాడా?
24. అంతిమ గ్రంథములో ప్రథమ వాక్యములు.
25. ఇచ్ఛాధీన కార్యములు-అనిచ్ఛాధీన కార్యములు.
26. టక్కుటమారా, ఇంద్రజాల మహేంద్రజాల, గజకర్ణ, గోకర్ణ.

# యోగీశ్వరుల వారి సంచలనాత్మక త్రిమత ఆధ్యాత్మిక ప్రసంగములు



*(DVD'S)*

27. ఆత్మ.
28. తాత.
29. తల్లి.
30. భయం.
31. ఆత్మపని.
32. బట్టతల.
33. యాదవ్.
34. జ్ఞానశక్తి.
35. సమాధి.
36. 6-3=6.
37. సంతకము.
38. ప్రభు-ప్రజ.
39. త్రైతశకము.
40. తోలేవాడు.
41. తల్లి తండ్రి.
42. నటించే ఆత్మ.
43. సంచిత కర్మ.
44. గురు చిహ్నం.
45. ఆస్తి-దోస్తి.
46. వెలుగుబంటు.
47. ధర్మచక్రము.
48. దైవగ్రంథము.
49. భక్తి-శ్రద్ధలు.
50. పురుషోత్తమ.
51. మతద్వేషము.
52. గ్రాహిత శక్తి
53. ఆడించే ఆత్మ.
54. ఏది శాస్త్రము?
55. భగవంతుడు.
56. ఏది ధర్మము?
57. గురుపౌర్ణమి.
58. శ్రీకృష్ణాష్టమి.
59. గోరు-గురు.
60. దశ-దిశలు.
61. మాట-మందు.
52. సృష్ఠి-సృష్ఠికర్త.
63. కలియుగము.
64. సేవా శాతము.
65. ప్రకృతి-వికృతి.
66. పైత్యం-సైత్యం.
67. నైజం-సహజం.
68. భక్తి-భయము.
69. సాంప్రదాయము.
70. అదురు-బెదురు.
71. నీ వెనుక వాడు.
72. శవము-శివము.
73. శైవము-వైష్ణవము.
74. ధర్మము-అధర్మము.
75. ద్రావిడులు-ఆర్యులు.
76. కాయ-పండు-కాయ.
77. యుగము-యోగము.
78. దేవునికి మతమున్నదా?
79. కర్మ మర్మము.
80. పుట్టుట-గిట్టుట.
81. ఏకత-ఏకాగ్రత.
82. చమత్కార ఆత్మ.
83. నిదర్శ - నిరూప.
84. గురువు ఎవరు?
85. త్రైత సిద్ధాంతము.
86. స్త్రీ / పు - లింగము.
87. జీర్ణ+ఆశయము.

88. శ్రీకృష్ణుడు ఎవరు?
89. ఆట-దోబూచులాట.
90. ప్రజలు-మానవులు.
91. దంతము-అంతము.
92. మతము-పథము.
93. ఏడు ఆకాశములు.
94. అర్థము-అపార్థము.
95. మూడు గ్రంథములు.
96. గ్రంథము - బోధ.
97 ప్రభువు-ప్రభుత్వం.
98. జ్ఞానము-విజ్ఞానము.
99. వార-మాస-వత్సర.
100. భూతం-మహాభూతం.
101. సేకూవలి-కూలిసేవా.
102. ఆత్మకు వెంట్రుక గుర్తు.
103. కోడిపుంజు-పాదరసము.
104. ఇందూ మహాసముద్రము.
105. శ్రీకృష్ణజన్మ మధుర.
106. అధర్మ ఆరాధనలు.
107. పుస్తకము-గ్రంథము.
108. హరికాలు-హరచేయి.
109. పుట్టగోసి-మొలత్రాడు.
110. 1 2 3 గురుపౌర్ణమి.
111. క్షమించరాని పాపము.
112. మరణము-శరీరము.
113. దివ్యఖురాన్-హదీసు.
114. ఇందువు-హిందువు.
115. సుఖము-ఆనందము.
116. కాలజ్ఞాన వాక్యములు.
117. భౌతికము-అభౌతికము.
118. దేవుని ఆజ్ఞ-మరణము.
119. జ్ఞానము దగ్గర జాగ్రత్త!
120. చంద్రాకారము (బట్టతల).
121. జ్ఞానము కబ్జా అయ్యింది!
122. దేవుడు ఇద్దరా! ఒక్కరా!!
123. మత సామరస్యం.
124. మోక్షము-మోసము.
125. అక్షర జ్ఞానము. 126. లలా జలము.
127. దైవ ధర్మములు-మత సాంప్రదాయములు
128. ఆహారము నీకా! నీ ఆత్మకా!!
129. మాత్ర-మందు. 130. కాలచక్రం.
131. బ్రహ్మవిద్య. 132. శక్తి.
133. పౌర్ణమి-అమావాస్య.
134. ఈశ్వర-పరమేశ్వర.
135. పురుషోత్తమ-శ్రీరామ.
136. దేవునికి ఒక్కడే కుమారుడు-
దేవునికి అనేకమంది కుమారులు.
137. జలం. 138. అధిపతి.
139. గ్రహాంతర వాసులు.
140. దేవుడు ద్వితీయుడా? అద్వితీయుడా?
141. మనిషి చేతిలో భగవంతుడు-
దేవుని చేతిలో మనిషి.
142. శరీరములో రక్తము-
గ్రంథములో జ్ఞానము
143. గ్రంథములో జ్ఞానము-
మనిషిలో రక్తము.
144. త్రైత సిద్ధాంత చరిత్ర.
145. కుశాల్ కుశాల్ లంజమ్మ
నా నెత్తిమీద రెండు తన్నమ్మ.
146. రాజాధి రాజా - దేవాధి దేవా.
147. ఆధ్యాత్మిక ప్రశ్నలు-జవాబులు.

## ప్రబోధాశ్రమము (శ్రీకృష్ణమందిరము)

చిన్నపొడమల (గ్రా), తాడిపత్రి (మం), అనంతపురం (జిల్లా) A.P.
Cell : 98665 12667, 99516 75081, 94903 63038.

**ఇందూ జ్ఞానవేదిక శాఖ**
అనంతపురము టౌన్, A.P.
Cell : 97059 59390, 99855 80099

**కె.లక్ష్మీనారాయణాచారి** (ప్రెసిడెంట్)
ధర్మవరం, అనంతపురం (జిల్లా),
Cell : 94405 56968, 92900 12413, 94406 01136

**టి. సూర్యనారాయణ** (సూర్య మీ సేవా)
పామిడి, గుత్తిరోడ్, అనంతపురం జిల్లా
Cell : 9885250967

**ఇందూ ధరణి జనరల్ స్టోర్స్**
(పి. శివరామ్ ప్రసాద్)
పామిడి, గుత్తిరోడ్, అనంతపురం జిల్లా
Cell : 9030057963, 9063504963

**బి. ఆదిశేషయ్య** (టీచర్) (ప్రెసిడెంట్)
ప్రబోధాశ్రమము, తాడిపత్రి (మం)
Cell : 9491362448, 7382986963.

**పి. ఆదినారాయణ** (ప్ర.సభ్యుడు)
ముద్దిరెడ్డి పల్లి (గ్రా॥), అనంతపురం (జిల్లా).
Cell : 9440745800, 7259851861.

**ఎ. నాగేంద్ర** (ప్రెసిడెంట్)
క్రొత్త చెరువు (గ్రా,మం)
అనంతపురం జిల్లా. Cell:9493622669
9959316410, 9949995090.

**పి. నాగయ్య** (ప్ర.సభ్యుడు)
వీకర్ సెక్షన్ కాలనీ, కర్నూలు టౌన్
Cell : 9440244598, 9849303902

**ఇందూ జ్ఞానవేదిక** (Head Office)
చైతన్యపురి, దిల్‌సుఖ్‌నగర్,
హైదరాబాద్, తెలంగాణ రాష్ట్రం,
Cell:94910 40963, 90329 63963, 98485 90172.

**డి. గోపికృష్ణ**
హుజురాబాద్, కరీంనగర్ జిల్లా, T.S
Cell : 9989202003, 9542061601

**కె.వెంకటేశ్వర్లు** (ప్ర.సభ్యుడు)
నందికొట్కూరు, కర్నూలు జిల్లా
Cell : 9440047256, 9701956599

**కె.అశోక్‌బాబు** (టీచర్) (ప్రెసిడెంట్)
రామాపురం (గ్రా), వి.కోట (మం).
చిత్తూరు జిల్లా. Cell : 9440305700

**వి. రామక్రిష్ణన్** (వైస్ ప్రెసిడెంట్)
కుప్పం, చిత్తూరు జిల్లా. Cell : 96527 55110

**డి. బాలాజీ** (వైస్ ప్రెసిడెంట్)
బంగారు పాళ్యం (గ్రా), చిత్తూరు జిల్లా.
Cell : 9985483241, 7396077408.

**బాలం లక్ష్మీనరసింహులు** (ప్రెసిడెంట్)
మదనపల్లి, చిత్తూరు జిల్లా.
Cell : 9440825533, 8519938999.

**టి.వి. రమణ** (ప్రెసిడెంట్)
ముదిగుబ్బ (గ్రా) అనంతపురం జిల్లా
Cell : 9440980036, 07406039453.

## ఇందూ జ్ఞానవేదిక ఆధ్యాత్మిక ప్రచురణలు లభించు చిరునామా

**డి. వరుణ్ కుమార్ శ్రేష్ఠి** (ప్రెసిడెంట్)
పులివెందుల , కడప (జిల్లా).
Cell : 9293199539, 9985714382

P.M.H **నాయుడు**
కొలిమిగుండ్ల , కర్నూలు (జిల్లా).
Cell : 9440490963

P. **రామకృష్ణారెడ్డి**
కొలిమిగుండ్ల , కర్నూలు (జిల్లా)
Cell : 9666202963

**శ్రీ ప్రబోధ క్లీనిక్**
**U. జనార్ధన్** (R.M.P)
ఆటోనగర్, కోయిలకుంట్ల (మం),
కర్నూలు (జిల్లా) Cell : 9491851911

**డా॥యం. వెంకటేశ్వర రావు** (ప్రెసిడెంట్)
MD (acu)
శాంతినగర్, నెల్లూరు జిల్లా.
Cell : 7989100433, 9246770277.

**అనమల మహేశ్వర్** (ప్రెసిడెంట్)
చవటపాల్యం (గ్రా), గూడూరు, నెల్లూరు జిల్లా.
Cell : 9494631664, 9490809181, 8106065300.

**రౌతు శ్రీనివాసరావు** (ప్రెసిడెంట్)
దర్గామాన్యం, గుంటూరు (జిల్లా).
Cell : 9948014366, 9052870853

**ఘడియం. పెద్దరెడ్డి** (ప్రెసిడెంట్)
నరసరావుపేట, గుంటూరు (జిల్లా).
Cell : 9989204097, 9505904097

**నర్రా శ్రీనివాస్ రెడ్డి**
కంభం (మం), ప్రకాశం (జిల్లా).
Cell :9849883261, 8142853311, 8187084516

**తలారి గంగాధర్**
గుడిపాటి గడ్డ, నంద్యాల టౌన్
Cell: 9491846282, 7671963963

**Y. రవిశేఖర్ రెడ్డి**
పెద్దకొట్టాల (గ్రా), నంద్యాల (మం)
కర్నూలు (జిల్లా).
Cell : 9440420240, 9885385215

**టి. ఉదయకుమార్** (ప్రెసిడెంట్)
భీమవరం వన్‌టౌన్, పశ్చిమ.గో.జిల్లా
Cell : 99482 75984, 73864 33834.

**ఇందూ జ్ఞానవేదిక శాఖ**
విశాఖపట్టణము, ఆంధ్రప్రదేశ్ రాష్ట్రం.
Cell : 76749 79663, 94400 42763,
89777 13666, 92478 26253.

**ఎన్.బి. నాయక్** (ప్ర.సభ్యుడు)
పెదమడక, అగనంపూడి,
విశాఖపట్నం (జిల్లా), Cell : 73964 92239,
92483 15309, 73862 12589.

**వి.సి.వర్మ (గురూజీ) ఆనందాశ్రమము**
మజ్జివలస (గ్రా, పోస్టు),
భీమిలి (మం), విశాఖపట్నం (జిల్లా).
Cell : 94415 67394, 9502 172711.

**వి. శంకర రావు** (టీచర్) (ప్రెసిడెంట్)
అశోక్‌నగర్, విజయనగరము (జిల్లా).
Cell : 9703534224, 9491785963.

**తులసీ రావు**
Opp. T.T.D కళ్యాణమండపం,
విజయనగరము (జిల్లా).
Cell : 9441878096, 9030089206.

**యస్. అనిల్‌కుమార్**
కాకినాడ టౌన్, తూర్పు గోదావరి జిల్లా
Cell:9866195252, 9640526520, 7396038888

**బండారు సత్యనారాయణ**
మామిడి కుదురు (మం),
తూ.గోదావరి జిల్లా, Cell:95535 07141,
84669 20419, 94902 95577

**ఎన్.వి. రామకృష్ణ** (ప్ర.సభ్యుడు)
బొద్దాం (గ్రా), రాజాం (మం),
శ్రీకాకుళం (జిల్లా).
Cell : 9494248963, 9959779187.

**చెల్లారపు అప్పల నాయుడు**
చెల్లారపు వలస (గ్రా),
బొబ్బిలి (మం), విజయనగరం జిల్లా.
Cell:9494853773, 8465860706

**ఇందూ జ్ఞానవేదిక శాఖ**
మల్లిగాం (గ్రా), కొత్తపేట్ (పో),
రాయగడ (జి), ఒడిశా (రాష్ట్రం)
09437527499, 09437527470, 09437975781

**షేక్ అమీర్ అలీ** (President, K.I.S.S)
నల్గొండ జిల్లా, తెలంగాణ రాష్ట్రం.
Cell : 9505989898, 9505768181

**షఫీ షేక్** (Vice President, K.I.S.S)
చెన్నై, తమిళనాడు రాష్ట్రం.
Ph:09445554354.

**షేక్ ఇబ్రహీం** (K.I.S.S Member)
కర్నూల్ టౌన్, ఆం.ప్ర. Ph:70950 08369

**యం. అల్లీపీర్** (K.I.S.S Member)
మడకశిరా, అనంతపురం జిల్లా, ఆం.ప్ర.
Cell : 89780 58081

**ఇందూ జ్ఞానవేదిక శాఖ**
కొత్తకోట, మహబూబ్‌నగర్ (జిల్లా).
Cell : 87905 58815, 9440655409, 9701261165

**యం. మురళి** (Cell : 97057 16469)
జడ్చర్ల, మహబూబ్‌నగర్ జిల్లా.

**యం. జైరాంనాయక్**
పద్మావతి కాలనీ, మహబూబ్‌నగర్ టౌన్.
Cell :70321 74830, 90009 16419

**జి. సాయిశంకర్ శ్రేష్ఠి** (టీచర్)
అచ్చంపేట, మహబూబ్ నగర్ (జి)
Cell : 9948947630, 9640717574

**పోటు వెంకటేశ్వర్లు (గురూజీ)** (ప్రెసిడెంట్)
హుజూర్‌నగర్, నల్గొండ జిల్లా.
Cell : 9848574803, 9866423853.

**బి. దేవేందర్**
భువనగిరి టౌన్, నల్గొండ జిల్లా.
Cell:9948060838, 9704885964, 9848741703

**ఇ. శ్రీనాథ్ శ్రేష్ఠి**
గణేష్ స్ట్రీట్, జనగాం, వరంగల్ జిల్లా.
Cell : 9573552963, 8096958359.

**ఎ. రాఘవేంద్ర శ్రేష్ఠి**
శ్రీకృష్ణ మెడికల్స్ & జనరల్స్
పటేల్ నగర్, 3వ క్రాస్ హోస్పేట,
బళ్ళారి జిల్లా, కర్ణాటక రాష్ట్రం.
Cell : 097318 16452, 096111 33635.

**A.V. LAKSHMI NARAYANA**
San Antonio, TEXAS, U.S.A
+1(210) 527 3436, +1(210) 668 8963

**K.SIVA KRISHNA**
Atlanta, GEORGIA, U.S.A
+1(404) 551 3297, +1(470) 658 7635

# విషయ సూచిక

# రచయిత ముందుమాట

దేవాలయము అనగా దేవుని యొక్క ఆలయము. దేవుడు ఒక్కడే అని జ్ఞానము తెలిసినవారు అనడము వినియే ఉందుము. దేవుడు ఒక్కడయినపుడు ఒకే దేవుని ఆలయముండక అనేక రకముల దేవతల యొక్క దేవాలయములుండడము చూస్తూనే ఉన్నాము. ఇందులో ఆ ఒక్క దేవుడు ఎవరు? అను ప్రశ్న రాకమానదు. ఎన్నో రకముల దేవాలయములలో ఎవరు నిజమైన దేవుడను ప్రశ్న కూడా వచ్చును. అన్నిటిని మించిన ప్రశ్న దేవుడెవరు? అన్నది. దేవుడెవరు అన్నదానికి, ఏది దేవాలయము అన్న దానికి సమాధానము తెలియవలసి ఉన్నది. ఇంత పెద్ద ప్రశ్నలకు ఒక్క మాటతో జవాబు ఎవరూ చెప్పలేరు. మనిషికి దేవుడు తెలియాలంటే

ఎన్నో వివరములు తెలియాలి. దేవున్ని తెలుపు నిమిత్తము పూర్వపు జ్ఞానులు పెట్టినవే దేవాలయములు. దేవుడు ఒక్కడే, దేవాలయము ఒక్కటే, దేవున్ని తెలుసుకొను పద్ధతులు మాత్రము రెండు విధములుగా గలవు. దేవున్ని నిరాకారముగా మరియు సాకారముగా తెలుసుకోవడమే రెండు విధములు. నిరాకారముగ తెలుపు నిమిత్తము నిర్మించిన దేవాలయము **ముక్కు ముఖము లేని ఈశ్వర లింగ దేవాలయము.** భూమిమీద దేవాలయ సాంప్రదాయము లింగముతోనే ప్రారంభమైనది. నిరాకార, సాకార రూపములలో నిరాకార మైనది లింగముకాగా, సాకారమైన ఆలయము రూపమున్న ప్రతిమతో మొదలయినది. భూమిమీద రెండవ దేవాలయము **శంఖు, చక్రము కల్గి నొసట నామమున్న ప్రతిమగల ఆలయము.** పూర్వము ప్రపంచములోనే దేవాలయములు రెండే రకములుగా ఉండెడివి. వేలు, లక్షల సంవత్సరముల కాలగమనములో ఎన్నో లెక్కలేనన్ని దేవాలయములు సృష్టించబడినవి.

దేవున్ని తెలుపు నిమిత్తము నిరాకార, సాకారముల పద్ధతిలో మొదట రెండే రెండు దేవాలయములను పూర్వము జ్ఞానులు తయారు చేసి పెట్టగా నేటి కాలమునకు వందల సంఖ్యలో తయారైనవని చెప్పవచ్చును. పూర్వము నిర్మించిన లింగము, ప్రతిమ ఆలయములు దైవమును తెలుపు అర్థముతో కూడుకొని ఉండగా తర్వాత తయారయినవి అర్థరహితమై పోయినవి. పూర్వపు దేవాలయములు సాంప్రదాయముగా నిర్ధిష్టముగా ఇలానే కట్టాలని కట్టెడివారు. ఇప్పుడు అటువంటి నిర్ధిష్టతను ఎవరూ పాటించడము లేదు. ఎవరి ఇష్టప్రకారము వారు కట్టుచున్నారు. చివరకు చిన్న గూడు కట్టి దానిలో చిన్న పలకరాయిని పెట్టిన అది ఒక దేవాలయమై పోతావున్నది. ఈ విధముగా అనేక రక దేవాలయములు తయారుకాగా, మనుషులలో పూర్వ కాలమునకు ఇప్పటికి భక్తి ఏ విధముగా ఉన్నదో ఆలోచించి చూచెదము.

భూమిమీద దేవాలయములన్నీ ఒక భాగముకాగా, వాటి వద్దకు పోవు భక్తులందరూ ఒక భాగముగా ఉన్నారు. భక్తులలో నాలుగు రకముల భక్తులున్నారని గీతలో చెప్పినట్లు, వారివారి భక్తిని బట్టి భక్తులను విభజించి చెప్పవచ్చును. **ఒకటి ఆర్థులు, రెండు అర్థార్థులు, మూడు జిజ్ఞాసులు, నాలుగు జ్ఞానులను వారిగా భక్తులను చెప్పవచ్చును.** ఈ కాలములో ఆర్థులు, అర్థార్థులు ఎక్కువ గలరు. జిజ్ఞాసులు, జ్ఞానులు నామమాత్రము గలరు. ఆర్థులు అనగా ఆపదలయందు మాత్రము మ్రొక్కువారు. అర్థార్థులనగా డబ్బు కొరకు మ్రొక్కువారు. ప్రస్తుత కాలములో ఆపద మ్రొక్కులకు, ధనము ఆర్జించుటకు మాత్రమే దేవాలయములలో మ్రొక్కులన్నీ గలవు. వచ్చిన ఆపద తీర్చుటకు, చేయుచున్న వ్యాపారమును లాభసాటి చేసి ధనవంతుల చేయుటకే కదా, గుడిలో దేవుడున్నాడాను భావములో అందరూ ఉన్నారు. దేవాలయమనగా! దేవునితో కోర్కెలు విన్నవించుకొను కేంద్రమని అనుకుంటున్నారు. కోర్కెలుంటేనే కదా! గుడికి పోవలసింది, కోర్కెలు లేకపోతే గుడితోనేమి పని, అందులోని దేవునితోనేమి పని అంటున్నారు. అటువంటి భావముతోనే ఉద్యోగస్తులు వారి ప్రమోషన్ కొరకు, నిరుద్యోగులు ఉద్యోగముల కొరకు, విద్యార్థులు ఉత్తీర్ణత కొరకు, యువకుడు యువతి కొరకు, పోలీసు లంచము కొరకు, దొంగ దొంగతనము సులభముగా జరుగుటకు గుడిలోని దేవతలను మ్రొక్కుచునే ఉన్నారు. దేవుడు వారివారి పనులు చేసిపెట్టు హోదా కలవాడని, ఏ దేవునికయినా నైవేద్యము ఉండాలన్నట్లు, ఏ కార్యమునకయిన కొంత డబ్బు లంచమిచ్చినట్లు, దేవునికి కూడా మ్రొక్కుబడులను పేరుతో కొంత ముడుపు రూపములో లంచమిచ్చి తమ కోర్కెలు నెరవేర్చుకోవాలనుకొనువారు చాలామంది గలరు. ఇటువంటి భక్తులు గుడిలోని దేవుళ్ళను కూడా అవినీతివరులుగా చేస్తున్నారు. తమ ఇంటిలోని చిన్న పిల్లలకు కూడా దేవుని వద్ద ఇదివ్వాలని మ్రొక్కు, అది

కావాలని మ్రొక్కు అని నేర్పిస్తున్నారు. కోర్కెలు లేని పిల్లలకు ఆయి బువ్వ కావాలని దేవునికి మ్రొక్కి అడుగు అని నేర్పిస్తున్నారు. ఈ విధముగా దేవాలయముల వద్ద కోర్కెల భక్తి తారాస్థాయికి చేరిపోయినది. ప్రస్తుత ఈ కాలములో దేవుడంటే ఏమిటి? దేవాలయమంటే ఏమిటి? అను విషయము శాస్త్రబద్ధముగా, హేతుబద్ధముగా తెలుపకోరు నిమిత్తమే ఈ **"దేవాలయ రహస్యములు"** అను గ్రంథము మాచే తయారైనది. పూర్వము మొదటిదయిన ఈశ్వరలింగము, రెండవదయిన శంఖు, చక్ర, నామముల ప్రతిమ ఏ ఉద్దేశ్యముతో ఉంచబడినవో ఆ ఉద్దేశ్యమును యథాతథముగా తెలుపు చిన్న ప్రయత్నమే ఈ గ్రంథము యొక్క అంతరార్థము. దేవాలయములోని నిర్మాణములోనున్న గోపురము, ద్వజస్థంబము, గంట, ప్రతిమ, ప్రతిమ చూపు హస్తము, శంఖు, చక్రము, నొసలు మీద నామము అన్నిటిని గురించి తెల్పుచూ, మనిషి ఆరాధించ వలసిన ఆరాధన యొక్క అర్థములను గురించి చెప్పడము ఈ గ్రంథములోని మా ముఖ్య ఉద్దేశ్యము. నిజము నిష్ఠూరముతో కూడి ఉండునని పెద్దలు చెప్పినట్లు కొందరికి మా మాటలు నచ్చక పోవచ్చును. మధ్యలో వచ్చిన ఆచరణలు వారికి నచ్చి అవియే సత్యమనుకొని ఉండవచ్చును. ఆ పద్ధతిలోనే ఒక పుస్తకమును వ్రాసుకొని, కొన్ని ఫలానా పుస్తకములో ఉన్నాయని అర్థములేని ఆచారములను చెప్పుకొనుచున్నారు. ఉదాహరణకు ఆవు నెయ్యితో వత్తులు హారతి ఇవ్వాలని ఆవు నెయ్యి పవిత్రమైనదని వ్రాసుకొన్నారు. మేము చెప్పిన కర్పూర హారతికి వ్యతిరిక్తముగా చెప్పు కొన్నారు. 'హారతి' అనగా అయిపోవునదని అర్థము. కర్పూర హారతిలో కర్పూరము అయిపోవుచున్నది. కావున హారతి అనునది కర్పూరమునకే చెల్లునుగానీ, దూదివత్తులు, ఆవు నెయ్యికి ఎలా వర్తించును. ఇది ధర్మమా, అధర్మమా? అనుకోక పుస్తకములన్నిటిని శాస్త్రములనుకొని ఫలానా

శాస్త్రములో చెప్పారనడము సమ్మతమా? ఎవరు ఎన్నిటిని చెప్పుకొనినా వాస్తవము కాని విషయములను వదలి వేయడము మన కర్తవ్యముగా పెట్టు కోవాలి. అందువలన మేము ఎందరో ఆచరించుచున్న తప్పు ఆచరణలను ఖండించుచూ వాస్తవ విషయమును వివరిస్తూ పోయాము. 'ఎద్దు ఈనింది గాటికి కట్టాము' అంటే అది ఎంత పెద్దవారు చెప్పినా గ్రుడ్డిగా నమ్మక విమర్శించి 'ఎద్దు ఈనదు' అని నిరూపించి ఈనేది ఆవు మాత్రమేనని చెప్పాలి. అలాగే మాకు తెలిసినదే జ్ఞానమనుకొనువారిని ఖండిస్తూ మీకు తెలియనిది కూడా ఉందని వివరిస్తూ పోవడము జరిగినది. మాయ గురువుల చేత మాకు కొంత ఇబ్బందయినా, సత్యము ప్రకటించడములో తప్పులేదని, మీరు చేయుచున్న పూజలలో అర్థము లేదని ప్రతిమను అసలయిన భావముతో చూడలేదని తెల్పాము. ఒక విషయము తెలియనపుడే రహస్యమవుతుందని ఇప్పుడు దేవాలయ విషయములు తెలియకుండా పోవుట వలన అవి రహస్యములైనాయని ఆ విషయములన్నిటినీ కలిపి **"దేవాలయ రహస్యములు"** అని పేరు పెట్టాము. ప్రతి విషయానికి వివరణ ఇస్తూ రహస్యములనన్నిటినీ సాధ్యమున్నంత వరకు వివరించి చెప్పడము జరిగినది. మీరు చెప్పినది మా ఆగమశాస్త్రములో లేదు, మేము నమ్మమను వారు కూడా కలరు. మేము అందరిని నమ్మమని ఎక్కడా చెప్పలేదు. మీకు ఏది నిజమని అనిపిస్తే దానినే నమ్మండి. చెప్పడము వరకు మా కర్తవ్యము కావున చెప్పాము.

<u>ఇట్లు</u>

**త్రిమత ఏకైక గురువు, త్రైత సిద్ధాంత ఆదికర్త**

**శ్రీశ్రీశ్రీ ఆచార్య ప్రబోధానంద యోగీశ్వరులు**



# 1. దేవాలయ రహస్యములు

దేవాలయమనగా దేవుని యొక్క నివాస స్థలమని అందరికి అర్థమగును. దేవాలయములో దేవుని ప్రతిమ ఉన్నది. పొడవు పొట్టి రంగు రూపుగ ఉన్న ప్రతిమను మనము అందరము దేవునిగ నమ్మి పూజించి నమస్కరించుచున్నాము. బ్రహ్మవిద్యా శాస్త్రములో అందరి యందు వ్యాపించినవాడు దేవుడు, అంతట ఉన్నవాడు దేవుడు. శరీరాంతర్గమై కదలిక శక్తి నిచ్చుచున్న ఆత్మే దేవుడని ఉన్నపుడు, నాల్గు గోడల మధ్య ఉన్న ప్రతిమ దేవుడా? అను అనుమానము రాక తప్పదు. కంటికి కనిపించు రూపము లేనివాడు దేవుడను శాస్త్రవచన మున్నపుడు, కంటికి స్పష్టముగ తెలియు ప్రతిమయేనా దేవుడను అనుమానము రాకమానదు.

దేవాలయములు పూర్వకాలమందు నిర్మించినవే అయితే ఆనాటి బ్రహ్మవేత్తలు (దేవుని తెలిసినవారు) ఎందుకు దేవాలయములు నిర్మించారు? దేవునికి ఆకారము లేదని ఉద్బోధించిన వారే ఆకార సహితముగా నిర్మించడము కారణమేమిటి? సర్వ ప్రపంచమునకు సర్వ జీవరాసులకు అధిపతి (దేవుడు) ఒక్కడే అని తెలిసినవారు వివిధ దేవాలయములు సృష్టించి అందు విభూతి రేఖల దేవుడని, నామముగల దేవుడని వేరుపరచి చూపడము దేనికి? దేవుడు నిర్గునుడు, నిరాకారుడైనపుడు సాకార ప్రతిమలెందుకు? సగుణోపాసన ఎందుకు? ఈ విధముగా మానవుని బుద్ధికి ఎన్నో ప్రశ్నలు ఉద్భవించినపుడు వాటికి సరైన సమాధానము లభించడము లేదు. సమాధానము లభించనపుడు మానవుడు నాస్తికునిగా మారుటకు అవకాశమున్నది. చాలా మంది జ్ఞానమనునది ఏ మాత్రము తెలియని స్థితిలో ఉండి

ఒకరు ఏ విధముగ చేయుచు ఉంటే అదే విధముగా చేయుచుపోవు వారున్నారు. అందువలన నిరాకార సాకార వ్యత్యాసమేమో తెలియనివారు దేనిని వివరించుకొను శక్తిలేక తాము చేయుచున్నదే పూజని, తాము కొలుచు వాడే దేవుడని, కోర్కెలు కోరడమే తమ వంతని, నెరవేర్చడమే దేవుని ధ్యేయమని, అందు నిమిత్తమే దేవాలయములు నిర్మింపబడినవని, అందులో ఒక్కొక్క దేవాలయములోని దేవుడు కోర్కెలు తొందరగ నెరవేర్చునని, అందువలన ఆయా దేవుళ్లకు ఎక్కువ కానుకలు పూజలు జరుగుచున్నవని అనుకొనుచున్నారు. ఎవరేమను కొన్నను సత్యమైనది నిత్యమైనది శాస్త్రము. శాసనములతో కూడు కొన్నదే శాస్త్రమయినపుడు, సిద్ధాంత రూపమైనదే శాస్త్రమైనపుడు, అనుభవ రూపమైనదే శాస్త్రమైనపుడు, శాస్త్రానుసారము దేవుడు అందరియందున్న వాడే, శాస్త్రాను సారము దేవుడు కనిపించనివాడే, అటులైన మనకు కనిపించు దేవాలయములు నిరర్థకమా? ఎంతో శ్రమ, ధనవ్యయముతో నిర్మించిన దేవాలయములు దేనికి బ్రహ్మ వేత్తలు బుద్ధిమాంద్యముతో నిర్మించారా? అనాదిగ ఉన్న దేవాలయములకు అర్థమే లేదా? ......... ఉన్నది. అనాదిగ ఉన్న దేవాలయములకు అర్థము సంపూర్ణముగ ఉన్నది. అయిన ఇప్పటి కాలములో తెలియకుండ పోయినది. పూర్వము దేవుని తెలిసిన వారు గొప్ప బుద్ధిని ఉపయోగించి చేసిన పనియే దేవాలయములు. అయినప్పటికి కొంత కాలమునకు వాటి అర్థము తెలియకుండ పోయినది. అది సహజముగ మాయ యొక్క పని "భగవద్గీత జ్ఞాన యోగమను అధ్యాయములో"

1 శ్లో. ఇమం వివస్వతే యోగం ప్రోక్త వానహ మవ్యయమ్
వివస్వాన్ మనవే ప్రాహ మనురిక్ష్వాకవే బ్రవీత్.

2 శ్లో. ఏవం పరమ్పరా ప్రాప్త మిమం రాజర్షయో విదుః
సకాలే నేహ మహతా యోగోనష్టః పరన్తప !

"నాశనము లేని ఈ విద్యను మొదట సూర్యునికి చెప్పియుంటిని అతడది మణువునకు చెప్పెను. మణువు ఇక్ష్వాకుడను రాజుకు చెప్పెను. ఇట్లది ఒకరినుంచి ఒకరికి తెలియుచు పోయి అందరికి తెలిసినదయ్యెను. చాలా కాలము జరిగిపోగా ఈ కాలమునకు ఆ విషయము తెలియకుండ పోయినది." అని దేవుడన్నట్లు పూర్వ కాలమున్నది తెలియకుండ పోవడము సహజము. అందువలననే ధర్మములు అధర్మములుగ మారుచున్నవి, అర్థము అనర్థమగుచున్నది. ధర్మములు అధర్మములుగ మారినపుడు అవి తిరిగి ధర్మములుగ మార్చడము కర్తవ్యము. అర్థము అపార్థముగ మారినపుడు వివరించి అర్థము చెప్పడము కర్తవ్యము. అధర్మములను ధర్మములుగ మార్చడము భగవంతుని పనియైనపుడు అనర్థములుగ నున్న వాటికి అర్థములు చెప్పుకోవడము మన కర్తవ్యము. భగవద్గీత భక్తి యోగమను అధ్యాయము 10 వ శ్లోకము "మత్కర్మ పరమో భవ, మదర్థ మపి కర్మణి కుర్వన్ సిద్ధిమవాప్స్యసి." నా కొరకు పనులు చేయుము. నా పని చేయడము వలన నీకు నా సాన్నిధ్యము (మోక్షము) లభించునని భగవంతుడు చెప్పాడు. విశ్వ వ్యాపియైన పరమాత్మ, సర్వ జీవులకు అధిపతియైన పరమాత్మ అదేపనిగ మానవావతారముగ వచ్చి ధర్మములివి అని తెలియబరచినపుడు మానవులలో నేనొక మానవుడనైన ప్రబోధానందగ గురుప్రసాదము పొందిన నేను మారిపోయిన అర్థములను తిరిగి వివరించడము నా కర్తవ్యమనుకొన్నాను. జ్ఞానప్రబోధమే నా జీవిత ధ్యేయమైనపుడు దేవాలయ రహస్యముల వివరించడము నా ధ్యేయములో ఒక భాగము.

దేవుడెవరు అన్నది అన్నిటికంటే పెద్దప్రశ్న మరియు జవాబులేని ప్రశ్న అని చెప్పవచ్చును. ఎందుకనగా దేవుడు అనుపదములోని అర్థము వెదకబడేవాడు అనిగలదు. దేవుడు వెదకబడేవాడే కాని దొరికేవాడు కాడు. దేవుని విషయము దేవునికే తెలుసును కావున దేవుడే భూమి మీద పుట్టి తనను పొందుటకు కావలసిన వివరము తెలియజేయును. ఆ వివరమునే దైవజ్ఞానము అంటాము. హైదరాబాద్ నగరమును చేరాలంటే దానికి ఒక దారి ఉండును మరియు ఆ దారిలో గమ్యము యొక్క దూరమును, మార్గమును, మార్గములోని వంపులను, అడ్డమున్న నదులు వాగులను, ఎగుడు దిగుడులను, ప్రమాదములు జరుగు స్థలమును సూచించు సూచనలెన్నో ఉండును. వీటినన్నిటిని తెలిసి వాటిని దాటిపోయినపుడే హైదరాబాద్ గమ్యమును చేరగలము. అదే విధముగ దేవున్ని చేరుటకు, ముక్తి అనుగమ్యమును చేరుటకు ఎన్నో సూచనలు గలవు. అవియే జ్ఞాన సూచనలు అంటాము. గమ్యమును చేరుటకు దారిలో ఎన్నో సూచనలున్నట్లు దేవున్ని చేరుటకు దేవాలయములలో ఎన్నో సూచనలుంచి దేవుడు భగవంతునిరూపములో వచ్చి దేవాలయముల నిర్మాణము చేసాడని చెప్పవచ్చును. కృత యుగములో దేవుడు ఎవరిపేరుతో వచ్చాడో, ఏ ఆకారముతో వచ్చాడో మనకు తెలియదు. కావున జ్ఞానము తెలిసిన పెద్దలు నిర్మించిన దేవాలయములన్నాము.

దేవాలయములు దేవుని విషయమును తెలుపు సూచన కేంద్రములై, ఆలయములోని ప్రతి కట్టడము ప్రతిమలుపు పరమాత్మ ఈ విధముగనున్నాడని తెలుపు విధానమై ఉన్నది. దేవాలయములు మనిషికి దేవుని విషయము తెలుపునవై ఉండగ, అందులోని ఆరాధనలు మనిషి

తను దేవుని పట్ల కల్గిన ఉద్దేశమును తెల్పునవై ఉన్నవి. మనిషి తనకున్న విశ్వాసమును, తనకున్న ఉద్దేశమును కార్యరూపముగ బయటికి తెలియజేయడమే ఆలయములో ఆరాధనలరూపముగ ఏర్పరచబడినవి. కనిపించని దేవుని విషయములు కనిపించు గుర్తులుగ మరియు మనిషికి దేవునికి సందేశవారధిలాంటివి దేవాలయములు కాగ, తన భావమును వ్యక్తపరచు కార్యములుగ ఆరాధనలుండడము కృతయుగములోని పెద్దలు ఏర్పరచి పెట్టిన విధానములై ఉన్నవి. దైవమే మనిషి ఆకారములో వచ్చి దేవాలయనిర్మాణములు అందులోని ఆరాధనా విధానములు ఏర్పరచాడని చెప్పవచ్చును.

ఆనాడు ఏ ఉద్దేశమును దేవాలయములు తెల్పుచున్నవో, ఏ ఉద్దేశములు ఆలయములలోని పూజావిధానములు తెలియజేయున్నవో అవి నేడు ఎవరికి తెలియకుండపోయినవి. కృతయుగములో మొదలయిన విధానములు రహస్యములు కాగ, కొందరు తమ తమ స్వార్థములతో పూర్వపు విధానములకు ఏమాత్రము సంబంధములేని నియమును వ్రాసుకొని, హేతుబద్దత లేని విషయములను, ఏమాత్రము శాస్త్రము కాని విషయములను శాస్త్రమని పేరుపెట్టి, ఇవి ఋషులు చెప్పినవని వేదములో గల విషయములని చెప్పుచున్నారు. ఈ విధముగ కొందరు మనుషులు సృష్ఠించిన శాస్త్రముకాని ఆగమశాస్త్రము భగవంతుడు కృతయుగములో తెలియజేసిన విషయములకు వ్యతిరేఖమై పరమాత్మ విషయమును సంకుచితము చేసిన మాయ శాస్త్రమై ఉన్నది.

ఇపుడు ఎవరు ఏమి చెప్పుకొనిన, మానవుడు తన అజ్ఞానమును దేవాలయములలో కూడ చొప్పించి శైవము, వైష్ణవమని భేదములు కల్పించినప్పటికి, పూర్వము మొదట భగవత్ప్రోక్తమైన విషయములు

ఇప్పటికి రహస్యములై తెలియకుండ పోయినప్పటికి తిరిగి తన ధర్మములు నెలకొల్పబడునని భగవంతుడు చెప్పినట్లు అవి బయటికి రాక తప్పదు. ఆ రహస్యములే ఇపుడు "దేవాలయ రహస్యములు" అను పుస్తకరూపముతో బయటికి వచ్చి ఆగమశాస్త్రులకు పెద్దసవాలులై నిలచుచున్నవి. ఇందులోని ఆలయముల వివరములు దైవజ్ఞానమును బోధిస్తు, ఆరాధన వివరములు మానవుని విశ్వాసమును తెలుపుచున్నవి. దైవజ్ఞానమును బోధించని ఆలయములు గాని, భక్తిని తెలుపలేని ఆరాధనలు గాని వ్యర్థమైనవని, శాస్త్రబద్ధముకావని తెలుపు జ్ఞాన రూపమే **దేవాలయరహస్యములు.**

నేటి మానవులు భక్తి అను పేర నడచుకొను అజ్ఞాన మార్గమునకు ఆటంకముగ నిలువడమే ఈ చిన్ని పుస్తకము యొక్క భావము. దేవాలయములలో కోర్కెలు కోరుటయే మన విజ్ఞానము కాదని ప్రతి స్పందించడమే ఈ పుస్తకము యొక్క ఉద్దేశము. కొందరు పొరపడి జ్ఞాన మార్గమనుకొనుచున్న అజ్ఞాన మార్గము నుండి మళ్లించి స్వచ్ఛమైన జ్ఞాన మార్గమును చెప్పడమే ఈ పుస్తక రచన యొక్క లక్ష్యము.

ఆదిలో ఆత్మజ్ఞానమును తెలిసిన వారు ఏమి తెలియని మానవులకు ఆత్మ విషయము తెలుపుటకు, అజ్ఞాన అందకారములో ఉన్న వారికి పరమాత్మ విషయము తెలియజేయు నిమిత్తము ఏ రూపు కాక ఏ పేరు లేక ఉన్న వానిని గురించి తెలుపు నిమిత్తము, ఆత్మ జ్ఞానమును అణువణువున అమర్చి నిర్మింపబడినవే దేవాలయములు. దేవాలయములు బయటికి ఎట్లు కనిపించిన వాటియందు ఆత్మ ప్రబోధమే ఇమిడి ఉన్నది. రూపము చూపి రూపము లేని వానిని అర్థమగునట్లు చేయునది దేవాలయము. నాల్గుగోడల మధ్య ఉన్న ప్రతిమను చూపి ఎల్లలు లేని పరమాత్మ విషయము తెలియజేయునది దేవాలయము.

ఎంతో జ్ఞానము కలిగిన యోగులు యోచించి స్థిరస్థాయిగ పరమార్థముతో ఇమిడి ఉన్నటుల నిర్మించిన నిర్మాణములే దేవాలయములు.

పూర్వ కాలములో ఉన్న మానవులందరికి ఆత్మ జ్ఞానముండెడిది. కాల క్రమేపి మానవులలో జ్ఞానము నశించి అజ్ఞానము పెరుగజొచ్చెను. అటువంటి సమయములో జ్ఞానశక్తి కల్గిన బ్రహ్మర్షులు యోచించి కొంత కాలమునకు ఆత్మజ్ఞానము అంతరించి పోవునని తలచి, అటువంటి పరిస్థితి రాకుండ ఉండుటకు ఏ విధానమైతే సరిపోగలదని దీర్ఘముగా ఆలోచించి చివరకు దేవాలయముల నిర్మించనెంచిరి. దేవాలయ నిర్మాణములో ఎంతో తెలివిని ఉపయోగించి ప్రతిది ఆత్మజ్ఞాన అర్థముతో ఉండునటులే నిర్మాణము సాగించిరి. ఆ విధముగ సాగించిన నిర్మాణములో మొట్ట మొదటి దేవాలయము లింగ ప్రతిష్టతో ప్రారంభమైనది.



# 2. లింగ ప్రతిష్ట

ప్రపంచమే లేని సమయములో ఉన్నది ఒక పరమాత్మయే. ఆ స్థితి నుండి కొంత కాలమునకు ప్రపంచము ఉత్పత్తియైనది. ప్రపంచ ఉత్పత్తికి ఒకే ఒక శక్తి కారణము, అది పరమాత్మయే. పరమాత్మ నుండి ఉద్భవించినదే ప్రపంచము. ప్రపంచమనగా! ప్ర అంటే పుట్టుట, పంచము అనగా ఐదు. ప్రపంచమనగా! పుట్టిన 1. ఆకాశము, 2. గాలి, 3. అగ్ని, 4. నీరు, 5. భూమి అని అర్థము. ఈ ఐదు భాగములను కలిపి ప్రకృతి అనుట కూడ జరిగినది. ప్రకృతి అనిన ప్రపంచమనిన ఒకటేనని తెలియవలెను. ప్రకృతి ఐదు భాగముల

నుండి ఎన్నియో జీవరాసులు ఉద్భవించినవి. జీవరాసులు జీవించి మరణించుటకు తగిన యంత్రాంగమంతయు ప్రకృతి నుంచియే ఏర్పరచబడినది. ప్రకృతి జనితమైనదే శరీరము, ప్రకృతి జనితమైనవే గుణములు. సమస్త జీవరాసుల శరీరములు ప్రకృతిలోనే పుట్టి, ప్రకృతిలోనే పెరిగి ప్రకృతిలోనే లయించుచున్నవి. తిరిగి ప్రకృతియందే పుట్టుచున్నవి.

జీవరాసుల పుట్టించుటకు ప్రకృతికి స్వయం శక్తి ఉన్నదా? అని యోచించినపుడు ప్రకృతికి ఆ శక్తి లేదని తెలియుచున్నది. ప్రకృతి వలన జరిగే పనులకన్నిటికి ఒక శక్తి అవసరము. అదియే పరమాత్మ శక్తి. భగవద్గీత రాజవిద్యా రాజగుహ్య యోగమను అధ్యాయము

10 వ శ్లో. మయాధ్యక్షేణ ప్రకృతి స్సూయతే సచరాచరమ్,
హేతునా నేన కౌంతేయ! జగ ద్విపరివర్తతే.

"ప్రకృతి నా ఆధారము చేత జీవరాసులను పుట్టునట్లు చనిపోవునట్లు చేయుచున్నది." అందువలన నేను ఇరుసుగ ఉన్నాను. నన్ను ఆధారము చేసుకొని ప్రపంచము చక్రమువలె తిరుగుచున్నదని పరమాత్మ అన్నాడు.

బ్రహ్మవిద్య ప్రారంభములో మనమెవరము? మన పుట్టుక ఏమి? అట్లే మరణమేమి? చావు పుట్టుకలకు కారణము ఎవరు? ఏ శక్తి వలన ఇది అంతయు జరుగుచున్నదని తెలియవలయును. అట్లు వివరించుకొనిన ప్రకృతివలన మన శరీరము తయారగుచున్నదని, తయారయిన శరీరములో ఆత్మ చైతన్య స్వరూపమై కదిలిక నిచ్చుచున్నదని, అందువలన శరీరమును తయారు చేసి ఒక ఆకృతినిచ్చునది ప్రకృతియని

తెలియుచున్నది. కావున దానిని సర్వజీవులకు తల్లిగ చెప్పుచున్నాము. జడములైన శరీరములకు కదలికశక్తి నిచ్చి కదలించుచు జీవస్వరూపము ఏర్పరచుచున్నది పరమాత్మ శక్తి కావున పరమాత్మను సర్వ జీవులకు తండ్రిగ చెప్పుచున్నాము. సర్వ ప్రపంచములోని జీవరాసులకు తల్లి ప్రకృతి, తండ్రి పరమాత్మ అని బ్రహ్మవిద్యలో ప్రధమాంశముగ తెలియవలయును. మూలమైన పరమాత్మ శక్తి నుండి వెలువడి ప్రకృతి ఆధారముతో శరీరముల ధరించి పుట్టి గిట్టు చున్నామను విషయము ప్రప్రధమముగ అందరికి తెలియవలసిన జ్ఞానము.

ఈ విషయము తెలియజేయు నిమిత్తము తల్లిదండ్రుల మీద దయ లేని పుత్రుడు పుట్టనేమి గిట్టనేమి పుట్టలోని చెదలు పుట్టదా! గిట్టదా! అని వేమన యోగి అన్నాడు. అనగా పరమాత్మ ప్రకృతిని గురించి తెలియనివాడు పుట్టినప్పటికి పుట్టని వానితో సమానమే. ఎవరికి తెలియకనే పుట్టలోని చెదలు పుట్టి గిట్టినట్లు మన జన్మ కూడ వృథాయే అని ఆయన భావన. అందువలన ప్రతి జీవుడు అసలయిన తల్లిదండ్రులెవరో తెలియవలయును. సర్వ జీవులకు నిజమైన తల్లిదండ్రులను తెలుపుచు భగవద్గీత గుణత్రయ విభాగ యోగమను అధ్యాయములో

3 వ శ్లో. మమ యోని ర్మహద్బ్రహ్మ తస్మిన్ గర్భం దధామ్యహమ్
సమ్భవ సర్వభూతానాం తతో భవతి భారత!

4 వ శ్లో. సర్వయోనిషు కౌంతేయ! మూర్తయః సమ్భవన్తియాః
తాసాం బ్రహ్మ మహద్యోని రహం బీజ ప్రదః పితా.

భావము :- "ప్రకృతి అంతయు నాకు స్త్రీగ ఉన్నది. దానికి నేను బీజ దాతగ ఉన్నాను. అందువలన సమస్త జీవరాసులు మాకు పుట్టు చున్నవి. ఏ గర్భము నుండి ఏ ఆకారముతో పుట్టు జీవరాసియైన అనగ సమస్త జీవరాసులకు మాత మూల ప్రకృతి, బీజదాతనైన నేను తండ్రిననుచు తెలియవలయును." పూర్వ కాలములో శాస్త్రవచన ప్రకారము తల్లి తండ్రియైన ప్రకృతి పరమాత్మలను తెలిసిన వారు ఈ విషయము మాసి పోకుండ అందరు గ్రహించునటుల చేసిన విధానమే లింగ ప్రతిష్ట. పరమాత్మకు ఆకారము లేదు కావున ముక్కు ముఖము లేని ఒక రాయిని యుంచి దానిని దేవుడనడము మొదట జరిగినది. పరమాత్మ పురుషుడనునట్లుగ పురషాంగకారమైన లింగమును ప్రతిష్టించారు. ప్రకృతిని స్త్రీగా గుర్తించునట్లు స్త్రీ యోని ఆకారముగ పాణిమట్టమును మలచి ఉంచారు. **స్త్రీ అంగాకారమైన పాణిమట్టములో పురుష అంగాకారమైన లింగమును ప్రతిష్టించి ప్రకృతి పురుషులు కలసి ఉన్నారను అర్థమొచ్చునట్లు చేశారు. పాణిమట్టము మధ్యలో లింగమునుంచడము ప్రకృతికి పరమాత్మ ఇరుసుగ ఉన్నదని తెలియుచున్నది. పాణిమట్టము పైన లింగము నుంచడము వలన ప్రకృతినదిష్టించి పరమాత్మ ఉన్నాడను భావన కూడ తెలియుచున్నది. లింగము కొంత పాణిమట్టములోపల, కొంత పాణిమట్టము బయట కనిపించడము పరమాత్మ ప్రకృతిలోపల ప్రకృతి బయట ఉన్నాడను విషయము తెలియబడుచున్నది.** ఈ విధముగ పెద్దలు అర్థమొచ్చునట్లు ఉంచడము శృంగారము కొరకు గాదు. ప్రకృతి పురుషుల రహస్యమిది అని తెలియజేయు నిమిత్తమే గాని వేరుగాదు.

ప్రకృతి పురుషుల కలయికయే జగత్తుకు మూల కారణమని తెలుపునిమిత్తమే ఇందులోని భావనగాని వేరుగాదు. సమస్త జీవరాసులకు మాత ప్రకృతి తండ్రి పరమాత్మని తెలుపు నిమిత్తమే ఈ లింగ ప్రతిష్ట జరిగినది. సమస్త జీవరాసులు పరమాత్మ చైతన్యము చేత ప్రకృతి నుండి ఒక ఆకారముతో పుట్టుచున్నవని తెలుసుకొనునటుల లింగము మీద ఒక పాత్రనుంచి దానిలో నీరు పోసి ఒక్కొక్క చుక్క లింగము మీద పడునట్లు చేశారు. లింగము మీద పడిన నీటి బిందువు లింగము నుండి జారి ప్రకృతిగ పోల్చిన పాణిమట్టమునుచేరి అక్కడ నుండి ఒక మార్గము ద్వారా బయటపడుచున్నది. ఈ విధముగ ప్రతి నీటి బిందువు జారిపోవుచున్నది. ప్రతి జీవరాసి ప్రకృతి పురుషుల వలననే జన్మించుచున్నదనుటకు తార్కాణముగ లింగ ప్రతిష్ట మీద ధారా పాత్రనుంచారు. నీటి బిందువులను జీవులుగ పోల్చి పరమాత్మ ప్రకృతివలననే ఉద్భవించుచున్నవనునటుల నీటి బిందువును లింగము నుండి జారి పాణిమట్టము నుండి బయటికి పోవునట్లు చేశారు. క్రింది నీటినే అనగ చెరువు నుండిగాని కొలను నుండిగాని బావి నుండిగాని తెచ్చి ధారాపాత్రలో పోసి ఉంచుచు ఎల్లవేళలు ఎడతెరిపి లేకుండ లింగము మీద నీటి బిందువులు పడునట్లు చేయడము వలన ఎడతెరిపి లేకుండ జీవులు చస్తు పుట్టుచున్నవని తెలియుచున్నది. లింగము నుండి నీరు పాణిమట్టము మీదుగ పోవడమే సృష్టి అంతరార్థముగ పెద్దలు నిర్మించారు.

ఇపుడు చెప్పబోవునది ముఖ్యాంశము, సర్వజీవరాసుల అంతరార్థము ఇందులో ఇమిడి ఉన్నది. పరమాత్మ స్వరూపము మూడు భాగములుగ విభజింపబడి ప్రకృతియంతట వ్యాపించి ఉన్నది. అట్లు వ్యాపించిన విధానము ఈ విధముగ ఉన్నదని చూపడమే ఇందులోని

సారాంశము. పరమాత్మ ప్రకృతికంటే అతీతునిగ ఉండి ముగ్గురు పురుషులుగ వ్యాపించి ఉన్నాడనుటకు తార్కాణముగ ఈశ్వరలింగము మీద విభూతి రేఖలు మూడుగ చూపించడము జరిగినది. భగవద్గీత యందు పురుశోత్తమప్రాప్తి యోగము అను అధ్యాయములో చెప్పబడిన క్షర అక్షర పురుశోత్తములను ముగ్గురు పురుషులుగ ఒక్క పురుషుడే విభజింపబడి ఉన్నాడని అర్థమువచ్చునట్లు లింగము మీద మూడు తెల్లని సారలుగ (రేఖలు) చూపడము జరిగినది. అందులో క్రింద ఉన్న రేఖ జీవాత్మ అని మద్యన గల రేఖ సర్వజీవులందు కలిసి ఉన్న ఆత్మ అని, పైన ఉన్న రేఖ పరమాత్మ అని అర్థమొచ్చునటుల తీర్చిదిద్దారు. లింగము మీద మూడు రేఖలు ఉంచడమేకాక మద్యన ఉన్న రేఖకు మాత్రము చందనముతోనో కుంకుమతోనో బొట్టు పెట్టడము వలన దానికి ప్రత్యేకత ఏర్పడినది. అట్లు గుర్తించుటకు కారణమేమనగా!

ఒక్కొక్క శరీరములో ఒక్కొక్కటిగ వేరువేరుగ ఉన్నవి "జీవాత్మలు". అన్ని శరీరములలో ఒకే అంశగ ఉంటూ ఒక్కొక్క శరీరములో విడివిడిగ ఉన్నది "ఆత్మ". శరీరములలోను బయట అంతట ఒకటిగ వ్యాపించి ఉన్నది "పరమాత్మ". జీవాత్మ ఆత్మలు సజీవమైన శరీరమందు మాత్రమే ఉండును. పరమాత్మ సజీవ, నిర్జీవ శరీరములందు కూడ కలదు. జీవాత్మ ఉన్న చోటునే ఆత్మ కూడ ఉండును. అందువలన కూటస్థుడను పేరు కూడ ఆత్మకు కలదు భగవద్గీత పురుశోత్తమ ప్రాప్తి యోగములో

16 వ శ్లో. ద్వా విమౌ పురుషౌ లోకేక్షరాశ్చక్షర ఏవచ
క్షర స్సర్వాని భూతాని కూటస్థో క్షర ఉచ్యతే.

"లోకములో ఇద్దరు పురుషులున్నారు, వారే క్షరాక్షరులు.

క్షరుడు సర్వజీవ శరీరములందు కలడు. అక్షరుడు క్షరుడెక్కడ గలడో అక్కడ వానితో కూడుకొని ఉన్నాడు.”

ఈ ఇద్దరి పురుషులకంటే వేరుగ ఉత్తమమైనది ఒకటున్నదని 17వ శ్లోకములో తెలియజెప్పారు, దానినే పరమాత్మ అనుట కూడ జరుగుచున్నది. ఆత్మకంటే పరముగ (వేరుగ) ఉన్నది కావున మూడవదానిని పరమాత్మ అనడములో అర్థము గలదు. ఈ విధముగ ఉన్న ముగ్గురి పురుషులను గూర్చి తెలియజెప్పడమే లింగము మీద మూడు రేఖల గుర్తింపు. జీవాత్మ పరమాత్మను చేరినపుడు జన్మలు లేకుండా పోయి జీవభావము నశించి దైవభావమేర్పడును. అనగా జీవాత్మ అణువణువున వ్యాపించి ఉన్న పరమాత్మలో చేరి తాను కూడ శూన్యుడైపోవును. ఆ విధముగ జీవాత్మ పరమాత్మను చేరవలయునంటే రెండవదైన ఆత్మను తెలుసుకొని తీరవలయును. ఆత్మను తెలుసుకొని ఆత్మజ్ఞానశక్తి చేత జన్మలకు కారణమయిన కర్మలనన్నింటిని నిర్మూలన చేసుకొన్న తర్వాతనే జీవాత్మ పరమాత్మను చేరగలడు. జీవాత్మ శరీరముతో ఉన్నపుడు ఆత్మను తెలుసుకొనిన, శరీరము వదలిన తర్వాత పరమాత్మను సందర్శించగలడు. అందువలన శరీరముతో ఎవరు కూడ పరమాత్మను తెలియలేరు. పరమాత్మ శరీరము లేనివారికే తెలియును. ఏ జీవుడు కాని జీవితములో ఆత్మనే తెలుసుకొని ధ్యానించవలయును. పరమాత్మను ధ్యానించలేడు, పూజించ లేడు. అందువలన లింగము మీద మూడు రేఖలుగ గుర్తించిన వాటిలో మధ్యనున్న రేఖకు చందన, కుంకుమ గుర్తింపు ఇచ్చారు.

ఆత్మలు స్వచ్ఛమైనవని గుర్తించుటకు స్వచ్ఛమైన తెల్లని రంగులో రేఖలు గుర్తించారు. ముఖ్యముగా పాణి మట్టమును వదలి లింగమునే పూజింతుము. కనుక ప్రకృతి కంటే పురుషుడే ముఖ్యమని

తెలియబడుచున్నది. పైన చెప్పబడిన మూడు రేఖల గురించి చాలా మందికి వేరు అభిప్రాయము గలదు. విమర్శకు నిలబడని కట్టు కథలు జ్ఞానము కాదు. విమర్శకు నిలబడు విషయములే నిజమైన జ్ఞానమని తెలియవలయును.



ఈశ్వర లింగము

ధనేషణ, ధారేషణ, పుత్రేషణ అను ఈషణత్రయములుగ అభివర్ణించి లింగము మీది మూడు రేఖలను చెప్పుచున్నారు. ఇది అసత్యమని చాలా మందికి తెలియదు. సత్యాసత్యములు విమర్శ వలననే తెలియును. కనుక ఇపుడు విమర్శ చేయక తప్పదు. జీవునకు ఉన్న గుణములలో 1. కామ (ఆశ), 2. క్రోధ, 3, లోభ, 4. మోహ, 5. మద, 6. మాత్సర్యమనునవి ముఖ్యమైనవి. వాటిలో మొదటిది ఆశ (కామము) ఆశలు అనగ ఎన్నో రకములుగనున్నవి. తిండి మీద ఆశ, గుడ్డల మీద ఆశ, భూముల మీద ఆశ, ఇట్లు ఎన్నో రకములుండవచ్చును. ధనము మీద ఆశ, భార్య మీద ఆశ, పుత్రుల మీద ఆశను శంఖరుడు కాల్చి బూడిద చేసి ఆ బూడిదను తన నుదుట దిద్దుకున్నాడని, ఆ మూడు ఆశలను జయించినానను గుర్తుకు వాటిని నొసటి మీద ధరించి చూపి మీరు ఈ మాదిరి ఆశలు జయించండని ఆయన విభూతి రేఖలను ధరించాడని చాలామంది అనుచున్నారు. అట్లయిన శంఖరునకు ధన, భార్య, పుత్రుల మీద ఆశ మాత్రమే లేదని మిగత ఆశలన్ని ఉన్నవని తెలియుచున్నది. జ్ఞానమార్గములో ఆశలన్ని జయించండనడము సమంజసమే. కాని మూడు ఆశలను మాత్రమే జయించండి అనడము ఏమి సమంజసము? శంఖరునకు ధనము మీద ఆశ లేదు కాని భూమి బంగారు మీద ఆశ ఉండవచ్చును. అట్లే మిగత ఆశలన్ని ఉండవచ్చును. అటువంటపుడు ఆయన కామదహనుడెట్లగును? ఈ ప్రశ్నలకు సరైన సమాధానము లేదు. కనుక ధనేషణ, ధారేషణ, పుత్రేషణ అను ఈషణత్రయ భావము విభూతి రేఖలకు సరిపడదు. అసలుకు, లింగమునకు శంఖరునకు ఏ మాత్రము సంబంధము లేదు ఎట్లనగా!

పూర్వము పరమాత్మను తెలియజేయు నిమిత్తము లింగ ప్రతిష్ట చేయగ నేడు దానిని వక్రీభవించి లింగమును శంకరునిగా పోల్చడము జరుగుచున్నది. ఈశ్వరునికి శంకరునికి ఎంతో తేడా ఉన్నప్పటికయిన ఈ కాలములో ఈశ్వరుడే శంఖరుడైనాడు, శంఖరుడే ఈశ్వరుడైనాడు. కోటీశ్వరుడు అనగా కోటికి అధిపతి. లక్షాదీశ్వరుడనగా లక్షకధిపతి. అట్లే బోగేశ్వరుడనగ బోగమునకు అధిపతి. యోగీశ్వరుడనగ యోగమునకధిపతి అని అర్థమగుచున్నది. ఈశ్వరుడు అన్న పదమునకు అధిపతి అని విశదముగ తెలియుచున్నది. ప్రపంచమునకే అధిపతియైన పరమాత్మను ఒక్కడినే ఈశ్వరుడని బ్రహ్మవిద్యలో అనుట జరుగుచున్నది. ప్రకృతికే అధిపతియైన పరమాత్మ భావముతో లింగమును ఉంచగా దానిని మెడలో పాము ధరించిన శంకరునిగ పోల్చడము అర్థము లేనిపని.

ఆదికాలములో ఉన్న జ్ఞానము ప్రస్తుత కాలములో తలక్రిందులైనది. దానికి కారణము మతములో చీలికలు, స్వార్థము. ప్రాచీన కాలములో ఉన్నది ఒకే ఒక మతము. కాలము జరుగుకొద్ది ఒక్క మతము నుండియే ఎన్నో మతములు చీలినవి. మొదట మతముగ ఉన్నది ఇందూ మతము. ఆ మతము ఈనాడు హిందూమతమైనది. మొదటి ఇందూమతములో ఉన్న కొందరు ఒక తెగగ మారిపోయి మేము గొప్ప వారమనిపించుకోవలయునను ఉద్దేశముతో మాది శైవమతమని శైవమత దేవుడు శివుడని, ఆ శివుడే ఈ లింగమని, ఆ లింగమును పూజించు వారందరు మా శైవులేనని ఈశ్వర లింగమును పూజించువారందరు శైవులను అభిప్రాయము కలుగజేసి అందులకు కావలసిన మార్పులు, చేర్పులు, కూర్పులు ఎన్నెన్నో చేశారు. అట్లు చేయడములో ఈశ్వర లింగము ముందర నందీశ్వరుడు, ప్రక్కన పార్వతి నుంచడము జరిగినది.

శివునికి భార్య పార్వతి, వాహనము నంది. కావున వీరిద్దరిని ఈశ్వరలింగముతో సంబంధపరచిన ఈశ్వరలింగము శివుని క్రిందికి లెక్క కట్టవచ్చునని పార్వతిని ప్రక్కన, నందిని ముందర ఉంచారు. లింగ ప్రతిష్టముందే ఆదిలో జరిగి ఉన్నది. కావున పార్వతిని ప్రత్యేకించి ప్రక్కన పెట్టారు. కాని ఆ లింగ పీఠములో సంబంధపరచ లేక పోయారు. అందువలన ఎక్కడైనగాని పార్వతి ప్రత్యేకించి ప్రక్కన ఉంటుంది. మిగత దేవతలకు మాత్రము భర్త పీఠములోనే భార్య కూడ ఉండడము గమనించవచ్చును. అట్లే వారివారి వాహనములు కూడ ఆ పీఠములలోనే పొందుపరచడము జరిగి ఉంటుంది. కాని మొదటనే తయారయిన ఈశ్వరలింగమును ఏమి చేయలేక పార్వతిని, నందిని వేరువేరుగ పెట్టడము జరిగినది. అట్లు చేయడమేకాక దానిని సమర్థించి చెప్పుటకు పురాణములు కూడ తయారు చేయబడినవి. నందిని లింగమునకు ఎదురుగ కొంత దూరములో పెట్టి దానికి కూడ ఒక కట్టుకథ చెప్పడమైనది. ఆకారములేని దేవునిగ గుర్తించుటకు ముక్కు ముఖములేని రాయిని శంకరునిగ వర్ణించు నిమిత్తము కూడ ఒక కథ అల్లి శాపము చేత శంకరుడు గుండుగ మారిపోయాడని వర్ణించడము జరిగినది.

ఏది ఏమయిన తెలివైనవారు లింగమునకు పార్వతికి నందికి సంబంధములేదని సులభముగ గ్రహించగలరని భావించుచున్నాము. ఈ కాలమున కూడ అక్కడక్కడ ఈశ్వరప్రతిష్ట దేవాలయములలో పార్వతి లేదు. ఒక నంది మాత్రము లింగమునకెదురుగ ఉండడము గ్రహించ వచ్చును. ప్రత్యేకించి పార్వతి మందిరము తయారు చేయుటకు ఎక్కువ ఖర్చు కావున పార్వతిని వదలి వేసి మందిరముతో అవసరము లేకుండ ఉండు నందిని మాత్రము ఉంచిన ఈశ్వర దేవాలయములు అక్కడక్కడ కనిపించగలవు.

జ్ఞాన దీపము ఆరిపోదు, కావున నేడు బహిర్గతమవుచున్నదని మేము భావిస్తున్నాము. పూర్వము పెద్దలు ఎంతో కృషి చేసి జ్ఞానమును మూర్తీభవింపచేసి నిర్మించిన ఈశ్వర దేవాలయము శంకరుని దేవాలయముగ మారుట మన దురదృష్టకరము. అయిన పెద్దల కృషి ఊరక పోదు. కావున ఇప్పటికి శివుని గుడి అనడమేకాక ఈశ్వర దేవాలయమనుట కూడ ఉన్నది. శివుడు, ఈశ్వరుడు వేరువేరని ముఖ్యముగ తెలియవలయును. ఈశ్వరుడనగా అధిపతి అని ముందుగానే చెప్పి ఉన్నాము. శివుడనగా త్రిమూర్తులలో ఒకడను భావము గలదు. త్రిమూర్తులకు కూడ అధిపతి ఒక్కడే! ఆ ఒక్కడే ఈశ్వరుడు (పరమాత్మ).



## 3. ఆకార ప్రతిష్ట (భగవంతుని రూప ప్రతిష్ట)

ఆదిలోనే ఈశ్వరలింగ ప్రతిష్ట జరిగినదని తెలుసుకొన్నాము. ఇది ఆకారము లేని దేవుని గూర్చి తెలుపు వివరమైయున్నది. ఆకారములేక అణువణువున వ్యాపించియున్న దేవుని విషయము మానవులకు తెలియదు. దేవుని విషయము దేవునికే తెలుసు కావున ఆయన వివరము ఆయనే మానవులకు తెలుపవలసియున్నది. స్వయముగ మానవుడు దేవుని విషయము తెలియలేడు. అందువలన ధర్మములను దేవుడే తెలుపవలసియున్నది. మానవుడు ధర్మ ప్రతిష్ఠాపన చేయలేడు. దేవుడు తన ధర్మములను తానే తెలుపుటకు రూపములేని తాను ఒక రూపము కల్పించుకొని పుట్టవలసియున్నది. అంతట వ్యాపించి యుండియు ఒక శరీరమందు మాయతో కూడిన జన్మ తీసుకొని ఆ

శరీరము ద్వార ఆయన తెలుపవలసిన జ్ఞానమును ధర్మయుక్తముగ తెలిపిపోవును. ఆ విధముగ జన్మించిన వానిని “భగవంతుడు” అందురు. భగము నుండి పుట్టిన వానిని భగవంతుడు అందుము. సర్వ శరీరములందు, సర్వ జడ పదార్థములందు, విశ్వమంతట అణువణువున వ్యాపించినవాడు పరమాత్మ. అది అంతట వ్యాపించియుండి అదియే ఒక శరీరములో నివశించుచున్నపుడు దానిని లేక వానిని భగవంతుడు అందుము.

విశ్వమంత వ్యాపించిన రూపములేని దేవున్ని గురించి తెలుపుటకు ప్రతిరూపముగ లింగ ప్రతిష్ట చేశాము. అదే దేవుడు అపుడప్పుడు తనకు అవసరమన్నపుడు తన విషయము తెలుపు నిమిత్తము తానే ఒక శరీరమునందు పుట్టుననుటకు గుర్తుగ ఆకారమున్న దేవున్ని కూడ చూపించుట కొరకు ముక్కు ముఖము గల ప్రతిమలుండు ఆలయములను కూడ పెద్దలు తయారు చేశారు. ప్రపంచములో మొట్టమొదటిగ ఈశ్వరలింగ దేవాలయములు తయారు కాగ ఆ తర్వాత కొంత కాలమునకు పరమాత్మయే మానవ రూపముగ వచ్చునని తెలిసిన పెద్దలు ఆకారమున్న దేవున్ని తెలుపు దేవాలయములు తయారు చేశారు. ఆ కాలములో లింగము తర్వాత తయారయిన ప్రతిమగుడి శ్రీరంగ దేవాలయము. పరమాత్మ గర్భము నుండి పుట్టిన జన్మను సూచించునది శ్రీరంగ దేవాలయము కావున శ్రీరంగడు గత చరిత్ర లేనివాడు. చరిత్ర గల్గినవారి దేవాలయములు తర్వాత ఎన్నో తయారయినవి కాని శ్రీరంగనికి చరిత్ర లేదు. ఆకారములేని నిర్వికారుడు సాకారముగ వచ్చిన గుర్తుగ చూపిన ప్రతిమగ శ్రీరంగన్ని తలుచవలెను. నిర్వికార పరమాత్మను లింగాకృతిగ చూపి క్రింద

పాణిమట్టము పైన విభూతి రేఖలు ధారాపాత్రను ఏర్పరచి ఎంతో అర్థము తెల్పినవారు శ్రీరంగని మీద కూడ అనేక పరమార్థిక అర్థములు తెల్పారు. ఆయన ఆకారమే గొప్ప ఆధ్యాత్మిక సందేశమైనది.

ఇలా పూర్వము తయారయిన లింగము, శ్రీరంగ దేవాలయములలో ఈశ్వరాలయమును గూర్చి పురాణములు సృష్టించి ఇది త్రిమూర్తులలో ఒకడైన శంకరుని ఆలయమని శైవులు చెప్పుకొనగ వారికి వ్యత్యాసముగ వైష్ణవులు తయారై శ్రీరంగని ఆలయము మాదని త్రిమూర్తులలో ఒకడైన విష్ణువు ఆలయమే శ్రీరంగ ఆలయమని



భగవంతుని రూప ప్రతిష్ట

పురాణములు తయారు చేసుకొని ప్రచారము కావించుకొన్నారు. త్రిమూర్తులలో శివుడు శంకరుడని పేరు గాంచిన శివుడే గొప్పయని శైవులు చెప్పుకొనుచుండగ, అలాకానే కాదు శివుని కంటే విష్ణువే గొప్పయని వైష్ణవులు చెప్పుకొనుచున్నారు. శివుడే గొప్పవాడని శివపురాణమును శైవులు తయారుచేసుకోగ విష్ణువే గొప్పయని విష్ణుపురాణమును వైష్ణవులు తయారు చేసుకొన్నారు. లింగము మా మతమన్నట్లు లింగము మీది విభూతి రేఖలను శైవులు గుర్తుగ నుదుటి భాగములో పెట్టుకోగ వైష్ణవులు మా తెగ వేరన్నట్లు శ్రీరంగని నుదుటి మీద నామమును తమ పాల భాగములో తీర్చిదిద్దుకొన్నారు. ఈ విధముగ ఇందూ మతములో మొదట శైవులను ఒక చీలికకాగ తర్వాత వారికి కొంత వ్యతిరిక్త దిశలో వైష్ణవుల తెగ తయారైనది. ప్రజలను నామదార్లు మోడివాల్లుగ మార్చి భేదము కల్గించారు. పూర్వము పెద్దలు ప్రజలకు దైవ జ్ఞానమును కలుగజేయుటకు ఎంతో యోచించి రూపములేని దేవున్ని రూపమున్న దేవున్ని తయారు చేసి చూపించగ దైవమునకు వ్యతిరిక్తమైన మాయ ప్రజలను మరొక దారి పట్టించి సాకార నిర్వికారముగ చూపిన దైవాన్ని తెగల రూపముగ అర్థమగునట్లు చేసింది. నాటికి నేటికి లింగాకారము గల దేవాలయము ఒక్కటేకాగ ముక్కు ముఖము ఆకారముగల ఆలయములు చాలా మంది పేర్లతో తయారైనవి. వైష్ణవులు చాలా మంది నామము గల దేవుల్లను తయారు చేసుకొన్నారు. పూర్వము ఉద్దేశ పూర్వకముగ ఒక పద్ధతితో శ్రీరంగ దేవాలయమును నిర్మించగ తర్వాత మానవులు మిగత దేవతలను పేరుపెట్టి నిర్మించడము మాయ ప్రభావమేయని చెప్పవచ్చును. పూర్వము పెద్దలు ప్రజల జ్ఞానార్థమై సాకారమే నిరాకారము నిరాకారమే సాకారమగునను ఉద్దేశముతో

నిరాకార లింగమును సాకార శ్రీరంగని ఆలయములను కృత యుగములోనే నిర్మించారు. కృతయుగము మొదట అంకము కొద్ది సంవత్సరములోనే శివాలయమును శ్రీరంగాలయమును నిర్మించారు. ఆ మొదట దేవాలయములు ఎక్కడ నిర్మించినది తెలియకుండ పోయిన దానికి చింతిస్తున్నాము. లింగము అనగా పురుషుని గుర్తు, ప్రపంచమున కంతటికి భర్త అయిన పురుషుడొకడు ఉన్నాడని తెలుపుచు జగద్భర్తను తెలుపు లింగముంచి దాని మీద త్రైత పురుషుల గుర్తుగ అనగ జీవాత్మ, ఆత్మ, పరమాత్మ గుర్తుగ మూడు అడ్డ రేఖలుంచారు. ఆ విధముగనే పరమాత్మ జన్మ తీసుకొంటే పురుషునిగనే పుట్టుతాడన్నట్లు పురుషాకారమైన శ్రీరంగ ప్రతిమను నిర్మించారు. “శ్రీ” అంటే శుభకరమైన మోక్షమును సూచించగ “రం” అనునది మంత్ర బీజాక్షరమైయున్నది. “రం” నాశనము చేయునదని “గ” అనగ గతులుయని రంగ అనగ చావు పుట్టుకలను గతులను లేకుండ చేయువాడని, కర్మ గతులు లేకుండ చేయువాడని మోక్షమును కలుగ జేయువాడని అర్థమొచ్చునట్లు పేరునుంచారు. శూణ్యమైన పరమాత్మ నుండి పుట్టుకొచ్చినవాడు శ్రీరంగడు అని తెల్పునట్లు భూమి మీద పుట్టి గతించిన చరిత్ర కల్గిన వారినికాక, చరిత్రలేని ఎక్కడ పుట్టి చనిపోయినవాడు కాని శ్రీరంగనుని ప్రతిమగ పెట్టి చూపించారు. అలా చరిత్ర లేని వానిని పెట్టడములో పరమాత్మ నిరాకారమైనవాడు గత జన్మ లేనివాడు అంతట వ్యాపించిన శూణ్యుడు అని తెల్పు అర్థము గలదు. పుట్టిన సామాన్యుడు గ్రహ విగ్రహ కాగలడు పుట్టనివాడు గ్రహ కాని విగ్రహకాని కాడు. అందువలన శ్రీరంగని ప్రతిమ విగ్రహ కాదు. మిగత ప్రతిమలన్ని విగ్రహలగును. పూర్వము ఈ విధముగ రూపము లేని వానికి ఒక రూపము కల్పించి భగవంతునిగ పరమాత్మ

రాగలడని తెల్పగ కాల క్రమేపి పూర్వపు జ్ఞానులుంచిన భావము దాని జ్ఞానము అంతయు తెలియకుండ పోయినది. నేటి కాలమునకు దేవాలయములన్ని చరిత్ర కల్గిన వారివే అయినవి. పుట్టి చావని రంగని దేవాలయము నాటి గుర్తుగ ఎక్కడో ఒక చోటయుండగ నేడు అనేకముగ చచ్చి పుట్టిన వారి ఆలయములు అనేక పేర్లతో తయారైనవి. చివరకు వంద సంవత్సరముల క్రిందట చనిపోయిన మనుజులను కూడ ఆలయములలో ప్రతిష్ఠించి మ్రొక్కను మొదలు పెట్టాము. ఇదంతయు మాయ ప్రభావమేయని అర్థమగుచున్నది. పరమాత్మను తెలియకుండ పరమాత్మ జ్ఞానము ఏ మాత్రము వంటబట్టకుండ చేయడమే మాయ యొక్క పని. మాయా ప్రభావితులైన మనుషులందరు భక్తి మార్గములో ఉండినప్పటికి ఆ భక్తి పరమాత్మ మీదకాదు మాయ యొక్క భక్తియని తెలియుచున్నది.

ఇప్పటికయిన మించిపోయినది లేదు. మన సాంప్రదాయములను పెద్దల సందేశములను గౌరవిద్దాము. జన్మ రాహిత్యమును కలుగ జేయు భక్తి మార్గమును అనుసరిద్దాము. గ్రహ ఆరాధన వదలి భగవంతుని ఆరాధన చేద్దాము. ఆలయములో ఉన్న ప్రతిమలన్ని దేవుని ప్రతిబింబములుకావని తెలుసుకొందాము. సాంప్రదాయ దేవాలయములను దర్శించి అందులోని అంతరార్థము తెలుసుకొందాము. జ్ఞానాన్ని ప్రదర్శించు ఆలయములలోని చిహ్నాములను అర్థము చేసుకొందాము. ఇందూ మతములో సనాతన ధర్మములు కలవని అవి ఏ మతముకు విరుద్దముగ లేవని తెలుసుకొందాము. మన విధానము మనము తెలుసుకోలేనప్పుడు ఈ మతములో ఏమి లేదని ఇతర మతములో ఏదో గలదని మత మార్పిడులకు దారితీయు అవకాశము కలదు.

# 3. మూలపు అమ్మ పెద్దమ్మ

విశ్వమంత అణువణువున వ్యాపించి అందరిలోగల పరమాత్మను పేరు ఆకారములేని దేవునిగ తెలియజేస్తు లింగరూపమును నిర్మించారు. అదే దేవుడే తన విషయము తానే మానవులకు తెలియజేయు నిమిత్తము తనలోని భాగము (అంశ) చేత ఆకారమున్న భగవంతునిగ పుట్టునని తెలియజేయుట కొరకు ఆకారముగల ప్రతిమ రూపమును నిర్మించారు. ఈ విధముగ మొదట ఈశ్వరలింగ ఆలయము తర్వాత భగవంతుని ఆకారముగల ఆలయము తయారయినవి. ఇపుడు ఒక సంశయమొచ్చి ఆడదేవతలు ఎంతోమందిగలరుగదా! వారి దేవాలయములు ఎప్పుడు తయారయినవని కొందరడుగ వచ్చును దానికి సమాధానము సవివరముగ ఇలాగున్నది.

ఆది మద్యాంత రహితుడు అనగా మొదలు నడుమ చివర అనునది లేనివాడని అర్థము. ఇంకొక విధముగ పుట్టుక అనగా మొదలు, పెరగడము అనగా నడుమ, మరణము అనగా చివర అనునవి లేనివాడని అర్థము. దీనినే చావు పుట్టుకలు లేనివాడని ఒక్క మాటలో చెప్పవచ్చును. ఆది మద్యాంతరహిత అనునది పేరు కాదని దేవుని యొక్క గొప్పతనమును, ఆయన యొక్క స్థితిని తెలియచేయుచున్నదని అర్థమగుచున్నది. ప్రభు అనగా భు అంటె పుట్టినది, ప్ర అనగా ముఖ్యమైనది, సారాంశమైనది, గొప్పది అను అర్థము గలదు. పుట్టిన వాటికంత అతీతమైనది, సృష్టికంతటికి ముఖ్యమైనది మరియు గొప్పది, సారాంశము గలదను అర్థము కలదు కావున ప్రభు అనునది కూడ పేరు కాదు.

సృష్టికంతటికి క్షరుడు అక్షరుడను పురుషులుండగ వారిద్దరికంటే అతీతమైన, అన్యమైన, ఉత్తమమైనవాడు పరమాత్మ, కావున అదే అర్థముతో

పురుషోత్తమ అన్నారు. పురుషోత్తమ అనునది కూడ పేరుకాదని ఆయన హోదాను తెలుపు పదమని తెలియవలెను. పరమాత్మకు ఒక నివాస స్థలమంటు లేదు. ఒక ఊరంటు లేని ఆయన విశ్వమంత వెలితిలేకుండ వ్యాపించి ఉన్నాడు. ఒక స్థలము ఊరు లేనివాడు కావున నివాసమున కతీతమైనవాడు అను అర్థమొచ్చునట్లు పరందామ అన్నారు. పరందామ అన్నది కూడ ఆయన వ్యాపకమును తెలియజేయు పదముకాని ఒక పేరు కాదు. ఆత్మ జీవాత్మలు పరమాత్మ అంశతో ఉన్నవి. జీవాత్మకంటే ఆత్మ ఎంతో గొప్పదికాగ, ఆత్మ కంటే వేరైనవాడు పరమాత్మ, పర అనగ వేరని అర్థము. పరమాత్మ అనగ ఆత్మ కూడ కాక దానికంటే వేరుగనున్న వాడని అర్థము. పరమాత్మ అను ఈ పదము కూడ పేరు కాదని తెలియవలెను.

ప్రపంచములోని అందరిని ఆడించు దానిని పని చేయించు దానిని విధి లేక కర్మ అని అంటాము. ఎవడు కూడ తను స్వయముగ ఏ నిర్ణయము తీసుకోలేడు ఏ పనిని చేయలేడు. అందరు కర్మాధీనములో ఉండి దాని ప్రకారము నడువవలసి ఉన్నది. పరమాత్మ ఒక్కడు మాత్రము కర్మాధీనములో లేడు. అందరిని ఆడించునట్లు కర్మ పరమాత్మను ఆడించలేదు. పరమాత్మ ఆధీనములో కర్మ గలదు గాని దాని ఆదీనములో ఆయనలేడు. ఏమయిన చేయవలసివస్తే పరమాత్మయే స్వయముగ నిర్ణయము తీసుకొని తానే స్వయముగ చేయగలడు. దేనినయిన తానే ఖుద్‌గ చేయగలడు కావున ఇటువంటివాడని తెలుపు నిమిత్తము ఆయనను ఖుదా అన్నారు. ఖుదా అన్నది స్వయం నిర్ణయాదికారని తెలుపు పదము కాని పేరు కాదు.

పరమాత్మ కనిపించువాడు కాదు, వినిపించువాడు కాడు. ఏ ఇంద్రియమునకు తెలియని ఇంద్రియాతీతుడు. శరీరముతోనున్న వాడెవడైనగాని ఏ సాధన చేతగాని ఆయనను తెలియలేరు. యోగులకు సహితము వ్యక్తము కానివాడు. ప్రపంచమంత వ్యాపించి మనకు బయట, మనముందర, మనలోపల కూడ ఉన్న పరమాత్మ ఎవరికి ఏ విధముగ గోచరము కాని వాడు. అందువలన ఆయనను అవ్యక్తా అన్నారు. ఈ పదము కూడ ఆయన యొక్క పద్ధతిని తెలియజేయునదే కాని నిర్దిష్టమైన పేరు కాదు.

అందరిమీద ఆదిపత్యము కల్గిన వానిని రాజు అంటారు. అందరికంటే అన్నిటిలో గొప్పవానిని రాజు అనడమున్నది. కొంత రాజ్యముమీద అధికారము కల్గి తనేమనుకొంటే అది అమలుచేయు స్వయం అధికారమున్నవాడు రాజు. తన రాజ్యములోనున్న వారందరిలో గొప్పతనము కల్గి అందరిమీద అధికారము కల్గి అందరిని శాశించి తన అనుచరులచేత నడిపించువాడు రాజు. పరమాత్మకు విశ్వవే రాజ్యముగనున్నది. ఆయన అంతట వ్యాపించి అన్నిటి మీద అధికారము కల్గియున్నాడు. పరమాత్మ ప్రతి మనిషి ప్రతి జీవరాసి మీద తన ప్రకృతి ద్వార అధికారము కల్గియుండి జంత్రగాడు బొమ్మలనాడించు మాదిరి అందరిని ఆడించుచున్నాడు. ప్రపంచములో ఆయనకంటె గొప్పవాడుగాని ఆయన ఆజ్ఞను అతిక్రమించునది కాని ఏది లేదు కావున ఆయన అందరికి రాజు. రాజు అనుపదము ఆయన హోదాను తెలియజేయు పదమేకాని పేరు కాదు.

అన్నిటికంటె గొప్పది పరమాత్మ, పరమాత్మను మించినది సర్వ జగత్తులోను యావత్ ప్రపంచములోను ఏదిగాని ఎవరుగాని లేరు. కావున

అన్నిటికంటే పెద్దయిన పరమాత్మను పెద్ద అను పదముతో పిలిచేవారు. ఆ భావముతోనే ముగ్గురుగన్న అమ్మ మూలపు పెద్దమ్మ అన్నారు. ప్రకృతికి మూడు గుణములను సృష్టించినవాడు పరమాత్మ కావున ముగ్గురుగన్న అన్నారు. అన్నిటికి మూలమైనది ఆధారమైనది కావున మూలపు అన్నారు. అన్నిటికి పెద్దయిన పరమాత్మ ఆడదో మగదో ఎవరికి తెలియదు కావున పరమాత్మను ఒక చోట అది అని మరియొక చోట అతను అని పలుకుచున్నాము. అందరిని పుట్టించినదని కొందరు అమ్మ అన్నారు. అందరికి పెద్దయిన దానివలన పెద్దమ్మ అన్నారు. అట్లని ఆడదానిగ పోల్చుకుంటారేమోనని పరమాత్మ ఆడది కాదు మగది అని తెల్పుటకు పెద్దమ్మకు మీసాలు పెట్టారు. ఇప్పటికి ఎక్కడయిన పెద్దమ్మ గుడులలో ప్రతిమకు మీసాలు పెట్టు సాంప్రదాయమున్నది. పిలిచేది పెద్దమ్మని, కనిపించేది మూతి మీద మీసాల గుర్తులు. దీనితో పరమాత్మ ఆడదో మగదో ఎవరికి అర్థము కాదు. అలా ఏది కాదను విషయము తెలియజేయుటకు పూర్వపు పెద్దలు కోరలు మీసాలు ఉంచారు. మగజాతి జంతువులకు కోరలుండుట వలన మగజాతిని తెల్పుకోరలు మీసాలు పెట్టి పెద్దమ్మ అన్నారు. దీనితో ఆడదో మగదో ఏది కాదని ఏది కానివాడే పరమాత్మని తెలియబడుచున్నది. పూర్వము జ్ఞానము తెలిసిన పెద్దలు తమ జ్ఞానమును ఇతరులకు తెలియజేయుటకు పెద్ద అను పేరు ముఖ్యముగ ఉంచి, అయ్యనో అప్పనో అర్థము కానట్లు తల్లి తండ్రి అన్ని ఆయనే అన్నట్లు గుర్తుగ పెద్దమ్మను పెట్టారు. నేడు ఆ భావము ఏ మాత్రము లేకుండ పోవడమేకాక పెద్దమ్మకు కూడ ఆరుమంది చెల్లెంద్రను ఒక తమ్ముని సృష్టించి కథ అల్లి సాధారణ దేవత క్రిందికి, క్షుద్ర దేవత మాదిరి జమకట్టారు. అక్కకున్నాయి కావున చెల్లెంద్రకు

కూడ ఉండవలెనని సుంకులమ్మ, మారెమ్మ, పోలేరమ్మ, మాచమ్మ, పోచమ్మ, మైసమ్మ అనువారికి కొన్ని చోట్ల వెండి మీసాలు కోరలు పెట్టడము కూడ ఉన్న విషయమే. వీరందరు గ్రామ దేవతలు కాగ వీరిలోనికి పెద్దమ్మను కలుపడము పొరపాటు. ఏడుమంది అక్క చెల్లెండ్రుండము నిజమేకాని పెద్దమ్మ వీరిలోనిది కాదు. ఎల్లమ్మ అను గ్రామ దేవతను కలుపుకొంటే 1. సుంకులమ్మ, 2. మారెమ్మ, 3. ఎల్లమ్మ, 4. పోలేరమ్మ, 5. మాచమ్మ, 6. పోచమ్మ, 7. మైసమ్మ. వీరందరివి వాస్తవముగ పేర్లు కాగ పెద్దమ్మ అనుపదము పేరు కాదని తెలియవలెను. అందరిమీద పెద్దరికమును తెలియచేయు పరమాత్మ గుర్తుగనున్నదని అర్థమగును. పరమాత్మ ఆడ మగకు అతీతము కావున పెద్దమ్మకు కోరలు మీసాలుంచారు. అన్ని విధముల పరమాత్మకు పెద్ద అను పదము సరిపోవునని పురుషోత్తమ అను పదములోఉత్తమ అనుపదము విశేషార్థమును తెలియజేయునట్లు, పెద్దమ్మ పెద్దన్న అనుపదములో పెద్ద అనుపదము విశేషార్థమును తెలియజేయుచున్నది. కావున అన్ని లోకములకు తల్లి తండ్రి రెండు తానేయైన పరమాత్మకు పెద్ద అని సరిపోవునని చెప్పవచ్చును. తల్లి తండ్రి అన్ని ఆయనేనని తెలియజెప్పు నిమిత్తము పెద్దకు అమ్మ అని జోడించి పెద్దమ్మ అని తల్లిని సూచిస్తూ, మీసాలు పెట్టి తండ్రిని సూచిస్తు పెద్దమ్మ అను బొమ్మను చూపారు. పెద్దమ్మకు మీసాలు పెట్టవచ్చునుగాని సుంకులమ్మ మొదలగు గ్రామ దేవతలకు మీసాలు పెట్టకూడదు. ప్రాంతాలను బట్టి మిగత దేవతలకు పేర్లు మారుచుండవచ్చును గాని పెద్దమ్మ అనునది పేరుకాదు కనుక పెద్దమ్మ అనుట మారక ఎచటనయిన పెద్దమ్మగానే ఉన్నది. ప్రస్తుత కాలములో మీసాలు లేని పెద్దమ్మ ఆలయములను కూడ తయారు చేశారు. ఇది సాంప్రదాయ విరుద్దము, అర్థరహితమగును.

ఈ విధముగ ఆడదేవత పేరుతో మొదట దేవాలయములు కాగ కాలక్రములో ఎందరో ఆడదేవతలను మనుషులు తయారు చేశారు. మొదట తయారయినవి అర్థముతో కూడుకొన్నవి ముఖ్యముగ ఈశ్వరాలయము, తర్వాత రంగని ఆలయము, ఆ తర్వాత పెద్దమ్మ ఆలయములు మూడే కాగ నేటికి కొన్ని వందల దేవాలయములు అర్థరహితముగ తయారయినవి. అలా తయారయిన ఆలయములకు మనుషులే పురాణములు వ్రాసుకొన్నారు. ఏదో ఒక కట్టుకథ వ్రాసి ఇది పలానా పురాణఅంతర్గతమని అష్టాదశ పురాణములలో ఏదో ఒక పురాణమునకు అనుసందించారు. ఇలా కొందరు కట్టుకథల పురాణములు చెప్పుట వలన, మరికొందరు ఎదో ఒకటి వ్రాసి శాస్త్రమని పేరు పెట్టుట వలన దేవాలయములలో పూర్వపు ఉద్దేశములు పోయినవి. భక్తులలో కూడ పూర్వపు భావము పోయి దేవుడు ముక్తికొరకు కాదు కోర్కెలు తీర్చేదానికని తలచుచున్నారు. దేవాలయములు దైవ జ్ఞానమును తెలుపు వారదిలాంటివని తెలియలేకపోయారు. ఆనాడు త్రేతాయుగములో రాముని గుడిలో మొదలయిన ఆలయములు తర్వాత ఆంజనేయునిది, ఆతర్వాత నరశింహస్వామిది, విఘ్నేశ్వరునిది, ఇలా తాజాగా సాయిబాబా, అయ్యప్పస్వామి వరకు తయారయినవి. భవిశ్యత్తులో ఇంకా ఎన్ని తయారుకాగలవో.

దేవాలయములు కొన్ని ముఖ్యమైన ప్రదేశములలో మాత్రముండెడివి. పూర్వము ముఖ్యక్షేత్రములుగ పిలువబడు కొన్ని జాగాలలో మాత్రమే ఉండెడివి. త్రేతాయుగములో రాముని తర్వాత ఆర్యులు ప్రభావమువలన అన్ని గ్రామాలలో రాముని దేవాలయములు నిర్మించారు. త్రేతాయుగము కంటె ముందు కృతయుగములో

ఈశ్వరాలయములు, రంగని ఆలయములు మూలపుటమ్మ పెద్దమ్మ ఆలయములు బహుదూరప్రాంతములలో కనిపించెడివి. హిమాచలము నుండి కన్యాకుమారి వరకు ఐదారు ఈశ్వరాలయములకంటే ఎక్కువ ఉండెడివి కావు. అంతే సంఖ్యలో రంగని ఆలయములు ఉండెడివి. ఐదారు కంటె మించి పెద్దమ్మ ఆలయములు కూడ ఉండెడివి కావు. ఎక్కడ ఏ ఆలయముండిన అది ఊరిబయట దూరముగ కొండల మీదనో, అడవి ప్రాంతములోనో, సముద్రము ఒడ్డునో, నదుల దగ్గరో ఉండెడిది.

ఊరిలో ఏ ఆలయము ఉండెడిది కాదు. ప్రతి చిన్న ఊరిలో కూడ ఊరికి మధ్యలో "బొడ్డురాయి" అను పేరుతో ఒక గుండు ఉండెడిది. అనాటి ప్రజలకు దాని వివరమేమిటో తెలుసు, ఈనాటికి మనకు తెలియకుండ పోయినది. కావున దానిని గురించి తెలుసుకుందాము. పూర్వ కాలము ఒక ఊరును నిర్మించునపుడు మొదట ఒక బొడ్డురాయిని పాతి పెట్టి దాని చుట్టు ఊరును నిర్మించుకొనెడివారు. ఎటు చూచిన ఊరికి మద్య ఉండునట్లు బొడ్రాయిని ఉంచెడివారు. అలాగుంచడములో పూర్వికుల ఉద్దేశము ఈవిధముగ ఉండెడిది. సర్వ ప్రపంచమునకు మూలమైనవాడు మరియు ఇరుసులాంటివాడు పరమాత్మయని పరమాత్మను ఆధారము చేసుకొని ప్రకృతి పరిభ్రమించుచున్నదని వారి ఉద్దేశము. ఆ ఉద్దేశము ప్రకారమే బొడ్రాయిని మద్యలో ఉంచి, దానిని పరమాత్మగ భావించి, ఊరును ప్రపంచముగ భావించి కట్టెడివారు. మనిషికి మద్యలో బొడ్డు కలదు. బొడ్డు ఆధారముతోనే తల్లి కడుపులో శిశువు పెరుగుట జరుగుచున్నది. శరీరము మొదట తయారగుటకు బొడ్డుయే మూలాధారము. ప్రపంచమునకు మూలాధారము పరమాత్మయే. కనుక ఊరిమద్యలో

పాతి ఉంచిన రాయికి బొడ్డు రాయి అని పేరు పెట్టడము జరిగినది. బొడ్డురాయి భూమిలోనికి సగము పాతి సగము పైకి కనిపించునట్లు పెట్టబడి ఉండును. బొడ్రాయి ఈశ్వరలింగము యొక్క ఆకారము కల్గి ఉండును. గుడిలోని ఈశ్వరలింగము పాణిమట్టముతో సహా ఉండును. నడి ఊరిలోని బొడ్రాయి పాణిమట్టము లేని ఈశ్వరలింగముగ కనిపించును. పాణిమట్టము లేని దాని వలన భూమిలోనికి బూడ్చిన గుండ్రని రాయిలాగ కనిపిస్తుండును. బొడ్రాయి ప్రపంచమునకు ఆధారమైన పరమాత్మను తెలియజేయు గుర్తుగనున్నది కనుక దానిని పురుషుడని తెలియునట్లు పోతులయ్య అనడము కూడ జరిగినది పోతులయ్య అనగా పురుషోత్తముడని అర్థము. సర్వప్రపంచమునకు సృష్ఠికర్త అయిన దానివలన ఊరుకంటే ముందే బొడ్రాయినుంచి తర్వాత ఊరును నిర్మించెడివారు. ఊరికాధారమైనది, ఊరికి మూలము మరియు బొడ్డులాంటిది కావున దానిని బొడ్రాయి అనడము జరిగినది. ఊరంతయు ప్రపంచమని మద్యన గల రాయి పురుషుడైన పరమాత్మ అని తెలియునట్లు మరియు పురుషోత్తముడని తెలియునట్లు బొడ్రాయిని పోతులయ్య అనడము కూడ జరిగినది. అందువలన బొడ్రాయిలో పోతులయ్య అయిన పరమాత్మ భావము కనిపిస్తుందని చెప్పవచ్చును.



# 5. ఏడు ద్వారములు

దేవాలయములలో ఏడు ద్వారములకు ఎంతో విశిష్టత కలదు. ఆలయము ముందరనే పెద్దగ ఎత్తుగ గోపురముండును, ఆ గోపురము

మీద క్రింద నుండి పై వరకు ఏడు ద్వారములు నిర్మించి ఉందురు. అలాగే గోపురము దాటి లోపలికి పోయిన తర్వాత గర్భగుడిలోని ప్రతిమ వరకు ఏడు ద్వారములు దాట వలసియుండును. మొదటనే ఉన్న గోపురము ఏడు ద్వారములకు, అలాగే గర్భగుడి ముందరున్న ఏడు ద్వారములకు ఉన్న భావమేమిటో పూర్వము పెద్దలు ఏ ఉద్ధేశముతో గోపురము పైకి, గుడి ముందరకి ఏడు ద్వారములుంచారో తెలుసు కొందాము. మన శరీరములో గల మూడున్నర లక్షల నాడులలో 72 వేల నాడులు ముఖ్యమైనవి కాగ అందులో పది శిరోనాడులు ప్రాముఖ్యత చెందియుండగ వాటికంటే ముఖ్యమైనవి మూడు గలవు. వాటి పేర్లే ఇడ పింగళ సుషుమ్న నాడులందురు. సూర్య చంద్ర బ్రహ్మ నాడులని కూడ వాటికి పేర్లు గలవు. శరీరములోని పది శిరోనరములు ఈ మూడు నాడులనుండే బయలు దేరినవి. మరియు శరీరములోని ప్రతి చిన్న నాడి ఈ మూడు నాడులతో అనుసందానమై ఉన్నవే. శరీరములోని నాడీ వ్యవస్థకంతటికి సూర్య చంద్ర బ్రహ్మనాడులే ఆధారమైయున్నవి. సూర్య చంద్ర బ్రహ్మనాడులలో అతి ముఖ్యమైనది బ్రహ్మనాడి. బ్రహ్మనాడియందే శరీరములోని ఆత్మ నివాసము చేస్తున్నది. అనగా బ్రహ్మనాడిని ఆత్మ ఆధారము చేసుకొని అచటనుండి అనుసందానమైన నాడుల ద్వార శరీరమంత వ్యాపిస్తున్నది. బ్రహ్మనాడిలో గల ఆత్మ నాడుల ద్వార తన శక్తిని శరీరమంత వ్యాపింప చేసి శరీరమును కదలించుచున్నది. శరీరములో గల జోడు ఆత్మలయిన జీవాత్మ ఆత్మలలో ఆత్మ బ్రహ్మనాడియందున్నదని తెలియుచున్నది.

దేహమే దేవాలయము, ఆత్మే దేవుడు అను పెద్దల వాక్యము ప్రకారము శరీరములోని బ్రహ్మనాడిలో గల ఆత్మే దేవుడని తెలియుచున్నది.

నీ శరీరములో నీవు జీవుడవుకాగ నీ శరీరములోని ఆత్మ దేవుడై ఉన్నాడు. జీవోదేవో సనాతనః అన్నట్లు శరీరములో జీవుడు దేవుడు ఎల్లపుడు ఉన్నాడు. దేవ దేవుడైన పరమాత్మ కూడ ఆత్మ కంటే వేరుగ శరీరములోనే ఉన్నాడు. పరమాత్మ శరీరమును వదలి ముక్తి పొందిన తర్వాత తెలియును. ముక్తి పొందక మునుపే ఆత్మను తెలియవచ్చును. ఆత్మను దర్శించడమునే దైవ దర్శనము అంటాము. దైవ దర్శనమునకు సంబంధించిన పరిజ్ఞానమును తెలుపునదే దేవాలయము. కావున దేవాలయములోని ఏడు ద్వారములు శరీరములోని దైవ దర్శన నిమిత్తము సందేశార్థముగ నిర్మింపబడి ఉన్నవి. సూర్యుడు ఆకాశములో ఉండి తన కిరణముల చేత ప్రపంచమునంతటికి వెలుగునిచ్చినట్లు ఆత్మ బ్రహ్మనాడిలో ఉండి శరీరమంతటికి శక్తి నిచ్చుచున్నదని గీతలో భగవంతుడు కూడ తెల్పాడు. శరీరములో దైవముగ పేర్కొనబడుచున్న ఆత్మ బ్రహ్మనాడిలో కలదని చెప్పుకొన్నాము. ఆకాశములో సూర్యుడు ఎక్కడున్నాడనిన పలానా రాశిలో ఉన్నాడని చెప్పినట్లు శరీరములో ఆత్మ ఎక్కడున్నాడని అడిగిన ఎడల బ్రహ్మనాడిలో పలానా చోట ఉన్నాడని చెప్పవచ్చును. ఆకాశములో సూర్యుడు పండ్రెండు రాశులలో ఏదో ఒక రాశిలో ఉండును. అలాగే శరీరములో ఆత్మ ఎక్కడున్నదని అడిగిన బ్రహ్మనాడిలో పలానా చోటులో నున్నదని చెప్ప వలసి ఉన్నది. అలా చెప్పాలంటే ముందు బ్రహ్మనాడిని గూర్చి పూర్తి తెలిసి ఉండాలి. శరీరములో బ్రహ్మనాడియనునది తల మొదలుకొని గుద స్థానము వరకు గల వెన్నెముక మద్య భాగములో వ్యాపించి ఉన్నది. వెన్నెముకలో ఉన్న నాడి కావున దీనికి వెన్నుపాము అను పేరు కూడ కలదు. వెన్నుపాము

లేక బ్రహ్మనాడి ఏడు భాగములుగ విభజింపబడి ఉన్నదని చెప్పవచ్చును. ఒక్కొక్క భాగములో ఒక్కొక్క నాడీ కేంద్రము గలదు. అనగ బ్రహ్మనాడి ఒక్కటే అయినప్పటికి దానిలో ఏడు నాడీ కేంద్రములు కలవు. వాటినే కొందరు ఏడు పద్మములుగ చెప్పుకొనుచు ఒక్కొక్క పద్మము మీద ఒక్కొక్క దేవుడున్నాడని కూడ చెప్పుకొనుచుందురు. వాస్తవముగ బ్రహ్మనాడిలో ఏడు నాడీ కేంద్రములున్నవి కాని అక్కడ పద్మములనబడు పూలు లేవు మరియు దేవతలు లేరు. బ్రహ్మనాడిలో ఆత్మ శిరస్సులో గల ఏడవ నాడీ కేంద్రములో ఉంటు మిగత ఆరు కేంద్రములలో కూడ తన శక్తినే నింపి మొత్తము ఏడు కేంద్రముల ద్వార శరీరమును నడిపిస్తున్నది. ముఖ్యముగ మన శరీరములో మనము నివశించుటకు జరుగుచున్న శ్వాసను ఈ ఏడు నాడీ భాగములు నడిపిస్తున్నవి. పుట్టినప్పటి నుండి చనిపోవు వరకు జీవుని ఆయుస్సు శ్వాసల రూపములోనే ఉండును. జననము మొదలు మరణము వరకు ఏడు కేంద్రములే ఒక దాని తర్వాత ఒకటి శ్వాసను త్రిప్పు చున్నవి. జీవుడు శరీరములో ఉండాలంటే శ్వాస జరగాలి, శ్వాస జరగాలంటే 24 గంటలు బ్రహ్మనాడిలో కేంద్రాలు పని చేయాలి. అందువలన ప్రతి జీవరాసికి శ్వాసను నడిపించువాడు ఆ శరీరములోని దేవుడే అని తెలియాలి.

ఒక్క రోజుకు 21,600 శ్వాసలు నడువవలసియుండగ ఆ శ్వాసలు ఈ విధముగ ఏడు కేంద్రముల ద్వార జరుగుచున్నవి. క్రింద గల నాడీ కేంద్రము శరీరములో గుద స్థానమునకు సమానముగ వెన్నెముకలోని బ్రహ్మనాడిలో గలదు. ఆ నాడీ కేంద్రమునకు (1) ఆధారము అని పేరు పెట్టారు. ఆధార నాడీ కేంద్రము ద్వార



ఏడు ద్వారములు

600 శ్వాసలు జరుగును. ఆధార నాడీ కేంద్రము నుండి కొన్ని నరములు బయలు దేరి ఊపిరితిత్తుల వరకు వ్యాపించి ఉండుట వలన ఆత్మ తన శక్తిచేత ఊపిరితిత్తులను కదలిస్తు ఉచ్ఛ్వాస నిచ్ఛ్వాసలను కల్గిస్తున్నది. అలాగే లింగ స్థానమునకు సరిగ మరియొక నాడీ కేంద్రము గలదు. ఆ నాడీ కేంద్రమునకు (2) స్వాదిష్ఠాన అని పేరు పెట్టారు. స్వాదిష్ఠాన నాడీ కేంద్రము ద్వార 6000 శ్వాసలు జరుగుచున్నవి. తర్వాత కేంద్రము నాభికి సమతలముగ ఉన్నది. దానికి (3) మణిపూరకము అని పేరు పెట్టారు. ఈ కేంద్రము ద్వార 6000 శ్వాసలు జరుగును. అలాగే తర్వాత కేంద్రము గుండెకు సమానముగ ఉన్నది. దానికి (4) అనాహతము అని పేరు పెట్టారు. అనాహత నాడీ కేంద్రము ద్వార కూడ 6000 శ్వాసలు జరుగుచున్నవి. ఐదవ కేంద్రము కంఠమునకు సమానముగ ఉన్నది, (5) విశుద్ధము అని ఐదవ కేంద్రమునంటున్నాము. ఈ కేంద్రము ద్వార 1000 శ్వాసలు

జరుగుచున్నవి. తర్వాత ఆరవ కేంద్రము (6) ఆగ్నేయము అని పిలువ బడుచున్నది. దీని ద్వార కూడ 1000 శ్వాసలు జరుగుచున్నవి. ఇక అన్నిటికంటే ముఖ్యమైనది ఏడవ కేంద్రము. ఈ ఏడవ కేంద్రములోనే ఆత్మ నివాసమై ఉన్నది. ఈ కేంద్రము యొక్క పేరు సహస్రారము. సహస్రారము ద్వార కూడ 1000 శ్వాసలు జరుగుచున్నవి. తలలోని మెదడు భాగమును ఏడవ కేంద్రమని తెలియాలి. ప్రతి దినము 21,600 శ్వాసలు నడుపుచు శరీరమునకు శక్తి నిచ్చి నిద్రలోను మెలుకువలోను అనేక పనులు చేయిస్తున్నది ఆత్మేనని తెలియాలి. ఏడు నాడీ కేంద్రముల ద్వారానే పనులు శ్వాసలు జరుగుచున్నవని వాటి ద్వారనే మనిషి జీవిత నాటకమేర్పడుచున్నదని తెలుపునిమిత్తమే ఏడు ద్వారములను దేవాలయముల మీద చూపారు. శరీరము మీద ధ్యాస వదలినపుడు ఏడవ కేంద్రములో ధ్యాసనుంచినపుడు అక్కడి ఆత్మ తెలియునని పైన ఏడవ ద్వారమునుంచారు.

శరీరము దేవాలయమైతే ఆత్మే దేవుడన్నాము కదా! దేవుడైన ఆత్మ శరీరమునకు శక్తి నిచ్చి కదలించుచు బలాబలముగయుండుటేకాక ఆరోగ్య అనారోగ్యమును కూడ కల్గించుచున్నది. శరీరాంతర్గత కార్యములెన్నో చేయుచు బయటికి కనిపించు బలాబల ఆరోగ్య అనారోగ్యములను కర్మ ప్రకారము కల్గించుచున్నది. బల అబలములు ఏడు నాడీ కేంద్రములు ద్వార లభించుచుండగ ఆరోగ్య అనారోగ్యములు శరీరములోగల ఏడు గ్రంధులు ద్వార లభిస్తున్నవి. ఆత్మ బ్రహ్మనాడిలో ఏడవ కేంద్రమందు నివశిస్తు శక్తి నిచ్చుచు మరియు గ్రంధులందు కూడ నివశిస్తున్నది. గ్రంధులలో ఆరు శరీరములో వివిధ భాగములలో ఉండగ ఏడవ గ్రంధి శిరస్సులో కనుబొమలకు మధ్య పై భాగమున సమతలముగ తల మధ్యలో గలదు. ఏడవ గ్రంధిని గ్రంధిరాజమంటారు. ఈ గ్రంధిరాజములో కూడ ఆత్మ నివాసముంటు మిగత ఆరు కేంద్రములకు

తన శక్తిని కిరణముల ద్వార ప్రసరింపజేస్తు గ్రంధులను పని చేయిస్తూ గ్రంధుల రసముల ద్వార ఆరోగ్య అనారోగ్యమును కలుగ జేయుచున్నది. శరీరములో కర్మ రీత్య పనుల యొక్క అనుభవము మరియు కర్మరీత్య ఆరోగ్య అనుభవము జీవునకుండును. కావున పనులు జరుగుటకు కావలసిన శక్తి నాడీ కేంద్రముల ద్వార బ్రహ్మనాడి నుండి మరియు గ్రంధుల ద్వార గ్రంధి రాజము నుండి ఆత్మశక్తి (దైవశక్తి) ప్రసరింపజేయు చున్నది. శరీరములో దైవము రెండు విధములుగ జీవుల ఎడల తన కర్తవ్యము నెరవేర్చుచున్నది. కావున దేవాలయములలో రెండు విధములుగ పైకి ఏడు ద్వారములు, లోపలికి ఏడు ద్వారములు పెట్టి చూపించారు. ఆరు నాడీ కేంద్రములు స్థంబించి శరీర ద్యాసపోయి ఏడవ కేంద్రములో లగ్నమైనపుడు మరియు శరీరములో ఆరు గ్రంధులు స్థంబించి ఏడవ గ్రంధి మీద ద్యాసయుంచినపుడు శరీరములోని దైవము తెలియునను ఉద్దేశముతో రెండు రకములుగ ద్వారములుంచారు. రెండు విధానములు మనోనిలకడ మీద ఆధారపడియుండునను ఉద్దేశముతో ద్వారములు చూపారు. బలమునకుగాని ఆరోగ్యమునకుగాని నీలోని దేవుడే కారణమని ఆ దేవుడు నీ శరీరమును ఈ విధముగ అధిష్టించి ఉన్నాడని తెలుపు నిమిత్తమే పైకి లోపలికి రెండు విధముల ద్వారములుంచారు. తిరుపతిలో పై ఏడు ద్వారములు లోపలి ఏడు ద్వారములను చూడవచ్చును.



# 6. గోపురము

దేవాలయములో గోపురము దానికి ఏడు ద్వారములుండునని చెప్పుకొన్నాము. గోపురమునకు మద్యలో క్రింది నుండి పై వరకు ద్వారములుండి ఏడు అంతస్తులుగ కనిపిస్తుండును. అంతేకాక

గోపురమునకు క్రింది నుండి పై వరకు అనగ ఏడు అంతస్తుల పొడవున చుట్టు అనేకములయిన బొమ్మలు చిత్రించబడి యుండును. ఆ ప్రతిమలు శృంగారము మొదలుకొని భక్తి వరకు, స్నేహము మొదలుకొని శత్రుత్వము వరకు, పెళ్లి మొదలుకొని సంతానము కోరడము వరకు, వాయిద్యములు ప్రయోగించడము నాట్యమాడడము గుఱ్ఱముల నెక్కి తిరగడము యుద్ధము చేయడము భార్యాభర్తలు భక్తిగయుండడము శృంగారములో ఎన్నో భంగిమలు మొదలగు మరెన్నో మానవ జీవితములో సంభవించు సంఘటనలన్నిటిని చూపించునట్లుయుండును. ఇలా ఎన్నో జీవిత సంఘటనల దృశ్యములను చిత్రించడములో పూర్వపు పెద్దల ఉద్దేశమేమిటోయని యోచించిన ఎడల కొంత వివరము తెలియగలదు.

బొమ్మల రూపములో గోపురము మీద చిత్రించిన దృశ్యములన్ని మానవ జీవితములో జరిగెడివేయై ఉన్నవి. పుట్టింది మొదలు శిశువు దశ నుండి చివరి మరణము వరకు జరుగు పనులన్ని శరీరములోని బ్రహ్మనాడియందు నాడీ కేంద్రముల ద్వార ఆత్మే చేయిస్తున్నది. శరీరములో పై నుండి క్రింది వరకు వ్యాపించి ఉన్న బ్రహ్మనాడి ద్వారానే ఈ పనులన్ని జరుగుచున్నవని మరియు బ్రహ్మనాడిలో పై నుండి వ్యాపించి ఉన్న ఆత్మే ఈ పనులు జరుగుటకు చైతన్యమునిచ్చుచున్నదని తెలియునట్లు గోపురము మీద క్రింది నుండి పై వరకు ఎన్నో సంఘటనల చిత్రములను ఉంచారు. దేవాలయముల దగ్గర దేవుని బొమ్మలుండవలెనుగాని నాట్యము చేయునవి యుద్ధము చేయునవి స్త్రీ పురుష సరసములకు సంబంధించినవి ఎందుకుండవలయునను ప్రశ్నవచ్చినపుడు జవాబు కోసము వెదకినపుడు ప్రతి పనికి ప్రతి కదలికకు కర్మలన్ని జరుగుటకు ఆత్మే ఆధారమని తెలియునట్లు గోపురము మీద అనేకములయిన బొమ్మలనుంచారు.

సర్వకార్యములు ఆత్మవలననే జరుగుచున్నవన్నట్లు ఏడు ద్వారముల కిరువైపుల కార్యముల దృష్యములనుంచారు. గోపురము మీద అనేక ప్రతిమలుంచడము వలన శరీరములోని దేవుని కర్తవ్యమును తెలియగలరనునదే పెద్దల ఉద్ధేశము.

అనేకరకముల బొమ్మలున్న గోపురమును గర్భగుడి ముందే ఎందుకుంచాలి అనునది ఒక సంశయముకాగ ఆత్మను ఆత్మ కర్తవ్యమును తెలుపునదే గోపురమైతే గుడి ముందరకాక గుడి ప్రక్కన నుంచవచ్చు కదా! లేక గుడి వెనకయిన ఉంచవచ్చును కదా అని ప్రశ్నలు ఉద్భవించగలవు. దానికి సమాధానమేమిటో చూస్తాము. గోపురము



గోపురము

మీద బొమ్మలుంచడము ఆత్మ విధానము తెలుపున దొక్కటేయైతే గోపురము దాని ప్రక్కన గుడిని నిర్మించవచ్చును. అలా గుడి ప్రక్కనకాక గుడి ముందరే నిర్మించుటలో మరియొక విధానమున్నదని తెలియుచున్నది. గుడిముందర గోపురముంటే గుడిలోనికి పోవువారు గోపురమును దాటి పోవలసియుండును. అదే ప్రక్కనయుంటే గోపురము దాటి పోవు వీలుండదు. గుడి ముందర గోపురముండుట వలన తప్పని సరిగ దానిని చూచిన తర్వాతనే గుడి కనిపించును. అలాకాక ప్రక్కనుండుట వలన ముందు గోపురమును చూడక నేరుగ గుడినే భక్తులు చూడగలరు. దాని వలన గుడిలోనికి పోకమునుపే తెలియవలసిన విషయము తెలియలేరు. ఆత్మ లేక దేవుడు శరీరములో ఈ విధముగ నున్నాడని తెలియక పోవడమేకాక మరియొక విధానము కూడ తప్పి పోవును. అది ఏమనగా!

గోపురము మీద అనేక బొమ్మలుండును కదా! వాటిలో మన మనస్సును చలింపజేయునవి, మరచి పోయిన విషయములు జ్ఞప్తికి వచ్చునట్లుచేయునవి, సులభముగ మనస్సును ఆకర్షించునవి ముందుగ కనిపించునట్లు నిర్మించియుందురు. శృంగార పురుషులకు భూతు బొమ్మలు, యుద్ధ ప్రియులకు పోరాట బొమ్మలు, సంగీత ప్రియులకు వాయిద్య బొమ్మలు ఇలా మొదలగు బొమ్మలు మొదలగువారికి కనిపిస్తుయుండును. అన్ని రకముల వారికి అన్ని రకముల చిత్రములు కనిపించునట్లు గోపుర నిర్మాణముండును. దేవాలయమునకు పోవు ప్రతివారు ముందు గోపురమును దర్శించి తర్వాత దేవుని దర్శించవలసి ఉన్నది. ప్రతివారు ముందు చూడవలసినది గోపురమేయన్నట్లు గుడి ముందరే గోపురమును నిర్మించి ఉన్నారు. గుడికి పోయిన వారు

ముందు గోపురమును చూచినపుడు వాటిమీది బొమ్మలు కనిపించును. ఎవరికి ఆసక్తి ఉన్న బొమ్మలు వారికి కనిపించుట వలన గుడి ముందరికి పోయిన వారికి వారివారి తలలలో యోచనలు మెదలను మొదలు పెట్టును. అలావారి తలలో యోచనలను రేకెత్తునట్లు చేయడమే గోపురము యొక్క ఉద్ధేశము. ప్రతి మనిషికి యోచనలుండడము సహజమే అయినప్పటికి దేవుని సన్నిదానములో మనస్సును యోచనలనుండి మల్లించి దేవుని మీద పెట్టవలెననెడిదే ముఖ్య ఉద్ధేశము. గోపురము వద్దకు పోతూనే మరచి పోయినవి మనసులో లేనివి జ్ఞాపకమొస్తున్నవి. అలా అనిగి పోయినవి బయటకురాగ అవి లేకుండ చేసుకోవడమే ముఖ్య కర్తవ్యమని, అలా చేసుకొన్నపుడు ఏ యోచనలేని నిర్మలమైన మనస్సును దేవుని మీద నిలుపవచ్చునని పెద్దల ఉద్ధేశము.

ఆలయము దగ్గరికి పోయిన వారికి గోపురము మీద ఏడు ద్వారముల అర్థము వాటి ప్రక్కన ఉన్న బొమ్మలను చూచి ఆత్మ యొక్క గొప్ప పనితనము తెలిసినప్పటికి కొందరికి బొమ్మలను చూచి మనస్సు యోచనలలో మునిగిపోవుట సహజమే. అలా యోచన లొచ్చిన వెంటనే కొందరు దేవుని ఆలయములో అలాంటి యోచనలు రాకూడదని తలచి నిగ్రహించుకొందురు. అలా వచ్చిన యోచనలను అనచి వేయడము వలన తర్వాత కొంతసేపటి వరకు యోచనలురాక మనస్సు నిలకడకల్గి దేవుని మీద గురికల్గునని పెద్దలనెడివారు.

గోపురము మీద బొమ్మలు చూచి చలించిన మనస్సు వెంటనే అచలనముకాకపోతే గోపురము దాటి పోయిన తర్వాత ధ్వజస్తంబము యొక్క దృశ్యముతో దానిలోని భావముతో మనస్సు చలించక నిలిచి పోవును. గోపురము వద్ద మొదలయిన మనోచలనము గోపురము

దాటు లోపల నిలువకపోతే ధ్వజస్తంబము వద్దయిన నిలువాలి. అక్కడ కూడ నిలువకపోతే చివరకు గర్భగుడి ముందరున్న గంట వద్దయిన నిలవాలి. మనస్సు యొక్క యోచనలు నిలుపుటకు ధ్వజస్తంబములో గుణముల వివరము, గంటానాధములో యోచన నిలిచిపోవడము యొక్క అర్థము నిమిడ్చి పెట్టారు. సహజముగ ఉన్న గుణములు యోచనల రూపముగ వస్తుండునని గోపురము వద్ద గుణములు చెలరేగునట్లు చేసి అలా చెలరేగిన మానవుని గుణములు అణగిపోయినపుడే దేవుడు తెలియునని తెలుపునిమిత్తము గోపురము దాని తర్వాత ధ్వజస్తంబము చివరిలో గర్భగుడి ముందర గంటను మ్రోగించుట పెట్టారు. మనస్సు నిలకడ లేని భక్తి నిష్ప్రయోజనమని తెలుపు నిమిత్తము ఆలయములో నిర్మించిన నిర్మాణములో గోపురము కూడ ఒక భాగమని తెలియాలి. శరీరములో దేవుడు ఆత్మ రూపములో ఉన్నాడని, దేవుని వలననే ప్రతి కదలిక ఉన్నదని, అన్ని పనులు ఏడు నాడీ కేంద్రముల ద్వార జరుగుచున్నవని తెలుపుచు గోపురము నిర్మింపబడినదని తెలియాలి.



# 7. రాక్షసాకారము

గర్భగుడి ముందు వచ్చు గోపురము అనేక ఆకారముల ప్రతిమలతో నిండియుండగ, గోపురము పైన కలశములకు క్రింది ప్రక్కన క్రిందికి కనిపించునట్లు వికృతాకారముండును. ఆ వికృతాకారము నాలుగు వైపుల కనిపించునట్లు పెట్టియుండుట గమనించ వచ్చును. ఈ విధముగ సాంప్రదాయ పద్ధతిగ కట్టిన దేవాలయములలో కనిపించునని మరియొక మారు తెలియబరుస్తున్నాము. గోపురము మీదగల బొమ్మలన్నిటికి పైన

వికృతాకారము అమర్చినది ఇప్పటికి తమిలనాడులో రాయవేలూరు నందు చూడవచ్చును, ఆంధ్రాలో కూడ చాలా పురాతన దేవాలయముల మీద కూడ చూడవచ్చును. అలా గోపురము మీద వికృతాకారమును పెట్టిచూపడములో అర్థమేమనగా! గోపురము మీద బొమ్మలన్నియు మన జీవిత సంఘటనలేనని తెలుసుకొన్నాము. మన జీవిత సంఘటన కార్యములన్నియు కర్మ ప్రేరేపిత గుణముల వలన జరుగుచున్నవే, కావున గోపురము మీదగల సంఘటనా చిత్రములన్నియు మాయా పూరితమైనవే అగును. ఈ మాయను వదలి ఆవలకు పోయినపుడే దైవము తెలియునను సందేశముతోనే గోపురము తర్వాత గుడిలో దేవున్ని ఉంచారు. మొదట గోపురము మీద చిత్రించిన చిత్రములన్నియు మాయ ఆవరణములోనివే అని తెలియజేయు నిమిత్తము గోపురము పై భాగములో నాలుగు వైపుల కనిపించునట్లు వికృతాకారమునుంచారు.

గోపురము మీద వికృతాకారము మాయకు గుర్తు. గుడిలోని సౌమ్యమైన ఆకారము దేవునికి గుర్తు. దేవాలయములలో బయట గోపురములో వికృతాకారముగ మాయను, లోపలి గుడిలో సౌమ్యాకారముగ దేవున్ని గుర్తుగ నిర్మించారు. గోపురము మీద వికృతాకారమును బట్టి అది మాయ అని దానికి క్రింది వైపునగల చిత్రములన్నియు దానివే అనునట్లు తెలియుచున్నది. వికృతాకారము కోరలు కల్గి, తీక్షణమైన చూపు కల్గి, నోరు తెరిచి దాదాపు సింహపు తల ఆకృతిని పోలి ఉండును. కావున మాయ ఆకృతిని సింహతలాటము అనుట కూడ జరుగుచున్నది. సింహము తలలాగ ఉన్న సింహతలాటమను మాయ ఎన్ని రకములుగ ఉన్నదో గోపురము మీద అనేక చిత్రములుగ చూపించారు. "గుణమయీ మమ మాయా దురత్యయా" అను

భగవంతుని వాక్యము ప్రకారము మాయను జయించుట దుస్సాధ్యమనునట్లు మాయ పశుబలము కల్గిన సింహములాంటిదని కూడ తెలియజేశారు. వాస్తవముగ దేవుని తెలియాలంటే సులభమైన పనికాదు. మాయను పూర్తి జయించ వలసి ఉన్నది. మాయ బలమైనదని భయపడనవసరము కూడ లేదు. నన్ను శరణు జొచ్చినవాడు మాయను సులభముగ జయించగలడని దేవుడు తెలుపుచు "మామేవ యేప్రపద్యన్తే మాయా మేతాం తరన్తితే" అన్నాడు. భగవద్గీతలో చెప్పినట్లు దేవున్ని శరణుజొచ్చక పోతే మానవుడు అడవిలో ఆకలయిన సింహము బారి నుండి తప్పించుకోలేనట్లు అనేక సంఘటనల రూపములో, బంధువుల రూపములో, భార్య రూపములో, అనేక విధములుగ ఉండి వ్యతిరేఖత కల్గించు మాయ నుండి తప్పించుకోలేరు. ఎకె47 రైఫిల్ ఉన్నపుడు బలమైన సింహమునయిన సులభముగ కాల్చి వేయగలము. అలాగే దైవజ్ఞానము కల్గి సర్వ విధముల దేవుని శరణు జొచ్చినవాడు దైవ జ్ఞానమను బందూకాతో మాయయను సింహమును సులభముగ చంపవచ్చును. అందువలన మాయ ఎడల అప్రమత్తతగ ఉండవలెనంటే దైవజ్ఞానమనే ఆయుధము కావలెను.



# 8. ద్వజ స్థంబము

గోపురము దాటిన తర్వాత ముందు ద్వజస్థంబము కనిపించును. ద్వజ స్థంబము అనగా పతాక స్థంబము లేక జెండా స్థంబమని అర్థమున్నది. ఒక రాజ్యమును తెలియజేయునది జెండా లేక ఒకరి పెత్తనమును తెలియజేయునది జెండా. ఇక్కడ దేవాలయములో ద్వజ

స్థంబమెందుకుండాలి? ఇక్కడ ఎవరి పెత్తనము తెలియజేయుటకున్నదని ప్రశ్నలురాక తప్పవు. దేవాలయములో దేవుని రాజ్యమును సూచించుటకే జెండా ఉన్నదని తెలియవలెను. ధ్వజ స్థంబము కంటే ముందున్న గోపురములో ఆత్మను లేక దేవున్ని తెలియుటకు ఏడు ద్వారములు ఉండినప్పటికి వాటి చుట్టు మాయకు సంబంధించిన బొమ్మలు చూపబడి ఉన్నవి. గోపురముపైన మాయ వికృతాకార దర్శనమిస్తున్నది. అనగ శరీరములో దేవుడున్నప్పటికి మాయ శరీరమును ఆవహించి ఉన్నదని తెలియుచున్నది. అంతేకాక పైకి కనిపించు చిత్రములన్ని మాయకు సంబంధించినవే. అందువలన వాటిని చూస్తూనే మనస్సు చంచలిస్తున్నది. దీనిని బట్టి గోపురము నుండి ధ్వజ స్థంబము వరకు మాయ రాజ్యమని ధ్వజ స్థంబము నుండి దేవుని రాజ్యమని తెలియునట్లు ధ్వజ స్థంబమును ఉంచారు. ధ్వజ స్థంబము మీద మాయ గుర్తునుంచి దానిమీద మాయకు మించినదని దైవము యొక్క గుర్తు కూడ చూపారు. అదెట్లున్నది వివరించుకొందాము.

దేవాలయములో గర్భగుడి ముందర గోపురము తర్వాత ధ్వజ స్థంబముండును. ధ్వజస్థంబము ఇంతే ఎత్తు ఉండవలెనను నిర్ణయము లేదు. కావున ఒక్కొక్క దేవాలయములో ఒక్కొక్క రకముగ ఎత్తు కల్గియుండును. ధ్వజస్థంబము చిన్నదిగాని పెద్దదిగాని దాని పై భాగమున చిత్రములో ఉన్నట్లు మూడు వరుసల గంటలుండును. ఒక్కొక్క వరుసలో ఆరు గంటలను తగిలించియుందురు. గంటలు చిన్నవిగ ఉండి గాలికి అల్లాడునట్లు ఉండును. మూడు వరుసలు ఒకే ప్రక్కకు ఉండుట వలన చూచువారికి జెండాలాగున కనిపించుచుండును. గంటలకు పైన స్థంబమునకు పై భాగమున నూనె పోసి వత్తులు వేసి పెద్ద దీపము

వెలిగించుటకు అనుకూలముగ తయారు చేసి ఉందురు. పూర్వము ప్రతి దినము సాయంకాలముననే నిచ్చెన సహాయముతో పైకి ఎక్కి దీపమును వెలిగించెడివారు. కొంత కాలమునకు పూజారులలో సోమరి తనమేర్పడుటవలనను, కడుపులు బరువగుట వలనను ప్రతిరోజు ఎక్కుటకు బదులు నెల కొకమారు ఎక్కి దీపమెలిగించెడివారు. మరీకొంత కాలమునకు నెల కొకమారు వెలిగించుట కూడ మానుకొని సంవత్సరమంతటికి ఒక మారు వెలిగించను మొదలు పెట్టారు. చివరకు ఈ కాలానికి ఆ పద్ధతి కూడ పోయినది. అయినప్పటికి పలానా సాంప్రదాయముండెడిదన్నట్లు ఆనవాలుకు కొన్ని చోట్ల మాత్రము సంవత్సరమున కొకమారు వెలిగించుట కలదు. అదియు కార్తీక పౌర్ణమి రోజున ధ్వజస్థంబము మీద దీపము వెలిగించుచుందురు. సంవత్సరమునకంతటికి కలిపి ఒక రోజు మాత్రము వెలిగించుచున్నారు కావున సంవత్సరమునకు 365 రోజులని లెక్కించి 365 వత్తులను కలిపి ఒకే వత్తిగ జేసి వెలిగించుట అక్కడక్కడ ఇప్పటికి గలదు. కొన్ని దేవాలయములలో పూర్వపు సాంప్రదాయము ప్రకారము ఉండవలసిన ధ్వజస్థంబమే లేకుండ పోయినది. కొన్ని ఆలయములలో సాంప్రదాయ సిద్ధముగ ధ్వజస్థంబముండినప్పటికి దానికి గంటలు మూడువరుసలు లేక పోవడమో, ఒక వరుస మాత్రము ఉండడమో లేక ఒకే గంటయుండడమో, అసలు గంటలే లేకుండయుండడమో, దీపము వెలిగించుటకు నూనె పోసి పెట్టుటకు అనుకూలముగ లేకుండునట్లో అనేకరకముల ధ్వజస్థంబములు కనిపిస్తున్నవి. కాలము గడుచుకొలది కొన్ని ఆలయములకు గోపురమేయుండకపోగా కొన్ని ఆలయములకు ధ్వజస్థంబమే లేకుండ పోయినది. కొన్ని ఆలయములలో ఉండిన అది

చూపాకారనిమిత్తమేకాని గంటలుగాని దీపముగాని అసలు ఉండదు. ఇలా సాంప్రదాయములన్ని లేకుండపోయి ఇందూ మతము ప్రత్యేక హిందూ మతముగ తయారయినది. దేవాలయములు నిర్మించుటకు ప్రత్యేకమయిన ఆగమశాస్త్రమున్నదని చెప్పువారు, మేము వేద వేదాంగములు చదివామని మాకు అన్ని తెలుసునని చెప్పువారు, సాంప్రదాయములు మంటగలిసిపోతూ ఉంటే వాటిని గూర్చి ఏమి చెప్పకున్నారు. ఇందూమతముగ యున్నది కాలక్రమమున హిందూ మతముగ మారి పోయినది, ఇందూ మతములో పూర్వమున్న హద్దులు ఆచారములు లేకుండ పోయినవి. అందువలన ప్రపంచవ్యాప్తముగ ఉన్న ఇందూమతము చివరకు భారత దేశములో మాత్రము హిందూ మతముగ మిగిలి పోయినది. ఏది ఏమయిన మన ఆచార వ్యవహారాలను కాపాడుకొనుట పునరుద్ధరించుకొనుట మన కర్తవ్యము. అందువలన దేవాలయములలోని పూర్వపు పద్ధతులను సంపూర్ణముగ తెలుసుకొందాము.

దేవాలయములన్నియు పూర్వము ఆధ్యాత్మిక కేంద్రములుగ ఉండెడివనుకొన్నాము కదా! దాని ప్రకారము ధ్వజస్థంబములో కూడ ఎంతో ఆధ్యాత్మిక జ్ఞానము మేళవించియున్నది. అది ఏమనిన మన శరీరములోని మనస్సు ఎడతెరిపి లేకుండ విషయ చింతనలు తెచ్చిపెట్టుచుండును. అది ఏ విషయమైనరాగ ద్వేషమునకు సంబంధించినదో, లేక కామ (ఆశ) దానములకు సంబంధించినదో, లేక లోభ ఔదార్యములకు సంబంధించినదో, అట్లునుకాక మోహ వైరాగ్యములకు సంబంధించినదో, లేక గర్వ వినయములకు సంబంధించినదో, లేక కోపము దయకు సంబంధించినదో అయి

ఉండును. మనస్సుకు వచ్చు విషయమేదయిన అది సాత్త్విక రాజస తామసములనెడి గుణభాగములలోనివే. మూడు గుణములనే మాయ అని భగవద్గీతలో భగవంతుడు "గుణ మయీ మమ మాయా" అని చెప్పియున్నాడు. మాయ మూడు గుణ భాగముల రూపములో ఉండి ఒక్కొక్క భాగములో ఆరు వర్గములుగ ఉన్నది. ఒక్కొక్క వర్గములో రెండు రకముల గుణములున్నవి. ఉదాహరణకు ఆశ ద్వేషములు ఒక గుంపని తెలియండి. ఇటువంటి గుంపులు ఆరు సాత్త్వికములోను రాజసములోను తామసములోను ఉండుట వలన ధ్వజస్థంబము మీద వాటికి గుర్తుగ మూడు వరుసల గంటలనుంచారు. ఒక్కొక్క గుణ భాగములో ఆరు గుంపుల గుణములుండుట వలన ఆ వివరము తెలియునట్లు గుణ విషయములకు ప్రతీకగ ఒక్కొక్క వరుసలో ఆరు గంటలనుంచారు. గాలి కాలములో గంటలు గాలికి కదలుచు ఒకదాని తర్వాత ఒకటి శబ్దము చేయుచుండును. ఒక గంట కదిలితే దాని శబ్దము ముగిసిపోకమునుపే మరొక గంట కదిలి శబ్దము చేయుచుండును. అదే విధముగనే మన శరీరములోని మనస్సు ఎడతెరిపి లేకుండ విషయ జ్ఞాపకాలు తెచ్చిపెట్టు చుండును. ఒక విషయ జ్ఞప్తి ముగియకనే మరొక విషయము తెచ్చి పెట్టుచుండును. ఈ విధముగ ఒకదాని తర్వాత ఒకటిగ వచ్చు విషయములకు గుర్తుగ గంటారావములున్నట్లు గంటలనుంచారు. మాయా విధానమును గంటలు గంటారావములుగ చూపగ, దానిని అణచివేయు జ్ఞానమున్నదన్నట్లు, దానిని అధిష్టించి దైవ జ్ఞానమున్నదన్నట్లు, గంటలకు పై భాగమున ధ్వజస్థంబము చివరిలో పెద్ద దీపమునుంచారు. దీనిని పూర్వము జ్ఞాన జ్యోతి అనెడివారు. ఇంద్రియ విషయముల కంటె ఉన్నతమైనది జ్ఞానము కనుక గంటలపై

భాగమున జ్యోతినుంచారు. విషయముల వలన ఉత్పన్నమగు కర్మను కాల్చునది జ్ఞానాగ్ని కనుక గంటలను గుణ విషయములుగజేసి దాని పై భాగమున జ్ఞానాగ్నికి చిహ్నముగ దీపమును వెలిగించారు. గోపురము మీది బొమ్మలు చూచి ఆలోచనలు తలలో మెదలుచుండిన ఇంత వరకు నీవు మాయ అను చీకటి ఆవరణములో ఉన్నావు. ద్వజస్థంబము వద్ద నుండి దైవము ఆవరణములోనికి జ్ఞాన వెలుగులోనికి ప్రవేశిస్తున్నావని తెలియునట్లు వెలుగుచున్న దీపమును ద్వజస్థంబము మీద ఉంచెడివారు. పూర్వము ద్వజ స్థంబ వివరము తెలిసినవారు అక్కడే తమ ఆలోచనలను లేకుండ చేసుకొనుటకు ప్రయత్నించెడివారు. ద్వజస్థంబ అర్థము ప్రకారము తమ జ్ఞానము చేత ఆలోచనలను కొందరణచి వేయుచుండిరి. కొందరికి మాత్రము విషయబలమదికముగ ఉండుట వలన అక్కడికి అనగిపోక ఇంకనూ విషయములు తలలో ఉండవచ్చును. అటువంటి వారు చివరకు గర్భగుడి ముందరగల గంట వద్ద లేకుండ చేసుకోగలరు. మాయా బలముచేత అనగని ఆలోచనలుండినప్పటికి చివరకు అవికూడ తొలగిపోయి నిర్మలమైన మనస్సు దేవునియందు లగ్నమగునట్లు గంటను ఉంచారు. గంటారావము ద్వార ద్వజస్థంబము వద్ద కాని మనోనిలకడ తప్పని సరిగ కలుగును.



# 9. గంట

ప్రతి దేవాలయములోను మూల ప్రతిమ ముందర ఒక గంటను వ్రేలాడగట్టియుందురు. ఆలయములోనికి ప్రవేశించిన భక్తులు (ఆస్తికులు) మొదట గంటను కొట్టుట సాంప్రదాయము కలదు. సామాన్యముగ

గంటను మ్రోగించనిదే దేవునికి నమస్కరించరు. కొందరు పొట్టివారైన ఎగిరి శ్రమపడియైన గంటను మ్రోగించి నమస్కరించుట అలవాటై పోయినది. అట్లు ఎందుకు గంటను మ్రోగించవలయునని ప్రశ్నించిన ఇది పద్ధతియనుచున్నారు. కాని ఏ భక్తుడు వివరించి చెప్పలేక పోతున్నారు. భక్తులు గొర్లదాడిలాగ ఒకరు చేయు పనిని వివరించుకొనక ఇంకొకరు చేయుచున్నారని, ఒక వేళ ఆలయములలో పూజ చేయువారికైన ఈ విషయము తెలిసి ఉండునను ఉద్దేశముతో వారిని ప్రశ్నించిన "దేవుడు నిద్రావస్థలో ఉండును. గంటారావము విని భక్తుడొచ్చాడని మేల్కొనును" అని చెప్పుచున్నారు. అటులైన దేవుడు మేల్కొనుటకు ఒక భక్తుడు మ్రోగించిన గంటారావము చాలుకదా! వెనుకనే వచ్చిన భక్తుడు ఎందుకు మ్రోగించవలయును. ఒక భక్తుని చూచిన వెంటనే రెండవ వానిని జూడక నిద్రలోనికి జారుకొనువాడా దేవుడు? అని అడిగిన దానికి వివరించి చెప్పలేక సమంజసములైన ప్రశ్నలు కాదనువారున్నారు.

అన్నిటికి అతీతులైన యోగులు, దేవాలయములలో అద్భుతములైన అర్థమునిచ్చు ఆత్మ జ్ఞానమును పొందుపరచినవారు, గంటారావమును గూర్చి ముందే ధ్వజస్థంభము వద్ద తెలిపినారు. గంటారావము విషయాల అల అని తెల్పారు. మానవుడు దేవాలయము లోపలికి రాకమునుపు అనేక విషయములతో నిండియుండును. అటువంటివాడు అన్ని విషయ జ్ఞప్తులు వదలివేసి ఒక్క క్షణమైన ఆలయములోని ప్రతిమ మీద మనస్సు నిల్పవలయునను ఉద్ధేశముతోనే గంటను ప్రతిమ ముందరుంచారు. ఒక్కమారు గుడిలో గంటను మ్రోగించి గంటానాదము వినండి. టంగ్.......గ్......గ్....గ్...గ్ అని దీర్ఘముగ ఏక స్థాయిగనున్న నాథము వినిపించును. పూర్వపు భక్తులు ఆ విధముగ గంటను మ్రోగించి

ఆ గంటానాధము మీద మనోదృష్టి నుంచి వినెడివారంట. అట్లు వినుట వలన కోతిలాగ అనేక విషయముల మీద తిరుగు మనస్సు ఆ నాధమందైక్యమై నాదము ఏక స్థాయికొచ్చునట్లు మనస్సు కూడ ఏక స్థాయికొచ్చెడిది. నాదము ఏకస్థాయిగ మ్రోగుచు వినిపించకుండ పోయినట్లు మనస్సు ఒకే స్థాయిలో నిలచి చలించ కుండపోవును. ఆ సమయములో ఒక్క క్షణమైన మనో నిగ్రతతో ప్రతిమ మీద దృష్టినిలుపుట మంచిదని పూర్వము యోగుల భావన.



గంట

ఈనాడు ఒక్క మారుకాక గణ గణమని అనేక మార్లు మ్రోగించే గంటకు ఏ మాత్రము అర్థము లేదు. ఎందుకు మ్రోగించుచున్నామని తెలియకనే ముందువాడు కొట్టాడు కదా! వెనుక వాడిని నేను కొట్టవలయుననుటయే ఉద్దేశము తప్ప గంటానాదము మనోనిశ్చలతకని తెలుసుకోలేక పోవుచున్నారు. మనోనిశ్చలతలేని పూజలు వ్యర్థము. కనుక ఒక్కమారు గంటను మ్రోగించండి, ఆ నాధమందు మనస్సును ఉంచండి. నాధము స్థాయిలో మనస్సు ఒక్కమారు నిలుపక బయటి

విషయములే జ్ఞప్తికి వచ్చుచుండిన రెండవమారు గంటను మ్రోగించి నాధము ముగియువరకు విని మనోచంచలమును అరికట్టి పూజ చేసిన ప్రయోజనముంటుంది. అట్లుకాక గుడికి సరదాగాపోయి, సరదాగా గంట కొట్టితే పూజ కూడ సరదాగాయే ఉండును. కాని సారాంశముగా ఉండదని గ్రహించవలెను.



# 10. సింహతలాటము

గోపురము దాటిన తర్వాత ధ్వజస్థంబము, ధ్వజస్థంబమును అర్థము చేసుకొని దాటిన తర్వాత గర్భగుడి ముందర గంట, గంటను దాటి కొద్దిగ ముందుకురాగ ఏడవద్వారము లోపల దైవ ప్రతిమ ఉండును. ప్రతిమ ఏ రూపములో ఉండిన దానినినే ఆ గుడికి మూల విరాట్ అంటారు. ఆకారములేని దైవమును ఆకారముగల ప్రతిమగ గర్భగుడిలో పెట్టడమేమిటని ఇతరమతముల వారికి అనుమానము రావచ్చును. దానికి సమాధానమేమనగా! అణువణువున వ్యాపించిన ఆకారములేనివాడు పరమాత్మ. అంతటవ్యాపించిన పరమాత్మను ఇందూమతములో "పురుషోత్తమ" అని లేక పరమాత్మయని, ఇస్లామ్ మతములో "అల్లా" అని, క్రైస్తవ మతములో "ఏహోవా" అని అనుట గలదు. ఎవరు ఎట్లు పిలిచిన ఒక్కడినే. అటువంటి వానిని తెలియజేయాలంటే ఏదో ఒక పద్ధతిగ తెలియజేయాలను ఉద్దేశముతో దేవాలయాల సృష్ఠీకరణ జరిగినది. దైవము నిరాకారుడనుటకు ఆకారములేని అనగా ముక్కు ముఖము కన్నులు మొదలగు శరీరాకృతి లేని రాతి గుండును చూపించారు. శరీరాకారము

లేని లింగమును కొన్ని ఆలయములలో నుంచగ కొన్ని గుళ్లలో మాత్రము ఆకారము కల్గిన ప్రతిమలనుంచారు. ఉదాహరణకు తిరుపతి వెంకటేశ్వరస్వామిని తీసుకొందాము. అక్కడ ఆకారము కల్గిన ప్రతిమనుంచారు. దేవుడు నిరాకారుడనుటకు లింగమునుంచగ అదే దేవుడు అపుడపుడు సాకార రూపములో వచ్చుననుటకు మనిషి ఆకార ప్రతిమనుంచారు. దేవుడు రూపములేనివాడైయుండి ధర్మ ప్రతిష్ఠాపన కొరకు తనను తాను సృష్టించుకొని పరమాత్మ ప్రతినిదిగ లేక పరమాత్మ దూతగ భూమి మీద మానవ జన్మ ఎత్తుచున్నాడని గీతలో కూడ చెప్పి ఉన్నాడు. అవదులు లేని పరమాత్మ సమాచారము తీసుకవచ్చాడు కనుక అట్టి వానిని అవదూత అనడము కూడ జరిగినది. ఇదే విషయమై ఇస్లాంమతములో కూడ దైవదూత (పైగంబర్ లేక ఖలీపా) అన్నారు. పరమాత్మను దేవాలయములో నిరాకారముగ చూపుటకు లింగమును, సాకారముగ చూపుటకు ప్రతిమను నిర్మించారు. ప్రతిమ కల్గిన తిరుపతి వెంకటేశ్వరాలయములో వెంకటేశ్వరుని ప్రతిమ చుట్టు కిరీటము పై భాగము నుండి ప్రక్కల వరకు సింహతలాటమునుంచారు. కిరీటము పై భాగమున సింహము తల ఆకృతిని బోలు ఆకారముండి అది ప్రక్కల వరకు వ్యాపించి ఉన్నది.

అలా ఉండడములో అర్థమేమనగా! ఆకారము కల్గిన భగవంతుడు కూడ మాయ ఆవరణములోనే ఉన్నాడని తెలియుచున్నది. అటువంటి భగవంతున్ని తెలియాలంటే ఆయన చుట్టు ఆవహించి ఉన్న మాయ (సైతాన్ లేక సాతాన్)ను తెలిసి దానిని దాటవలసి ఉన్నది. ఆయన చుట్టు ఉన్న మాయను దాటక పోతే అవదూతగ వచ్చినవాడు సాధారణ మనిషిగనే కనిపించును. ఆయన మాయను గుర్తించి




సింహతలాటము

దాటితే వచ్చినవాడు భగవంతుడేయని తెలియును. అలా గుర్తించలేక ఎన్నోమార్లు మాయలోనే చిక్కుకొన్నాము. నేను వచ్చినపుడు మీరు నన్ను గుర్తించలేదని తర్వాత వచ్చినపుడు కూడ గుర్తించలేరని పరమాత్మ తెలిపాడు. ఎక్కువ బలమును మృగబలము అంటారు. మనిషి కంటె మృగమునకు ఎక్కువ బలముంటుంది, కావున చేతకానపుడు ఎదుటి వానిది మృగ బలమంటాము. మృగములలో రాజు సింహము. మాయ ఎక్కువ బలము కలది కావున దానిని సింహముతో పోల్చారు. దేవునివైపు పోవాలనుకొన్నవాని ప్రయత్నమును ఎక్కువ బలము కల్గి విఘ్నము చేయునది మాయ. అటువంటి మాయను జయించుట చాలా కష్టమని గీతలో కూడ చెప్పారు. ఆ విషయము తెలియజేయు నిమిత్తము దేవుడను భావముగల వెంకటేశ్వరుని ప్రతిమ చుట్టు సింహతలాటమునుంచారు. సింహబలము కల్గిన మాయ నీతలలో యోచన రూపముగ, బయట భార్య భర్త బంధువుల రూపముగ, అనేక కార్యరూపములుగ ఎటులయిన ఉండవచ్చును. సింహతలాటములో చూపబడిన మాయను జయించుట కష్టమే అయినప్పటికి మన ప్రయత్నము వదల కూడదు. సింహమును ఎదురుగ బలమునుపయోగించి జయించలేము. బుద్ధి బలమును ఉపయోగించి ఎంత పెద్ద సింహమునయిన ఎన్ని సింహాలనయిన మన

ఆధీనములో ఉండునట్లు మన మాట వినునట్లు చేసుకోవచ్చును. అలాగే మాయ అనెడి సింహాన్ని శ్రద్ధా జ్ఞానము అనెడి బుద్ధి చేత జయించ వచ్చును. మాయను జయించనిదే దేవుడు తెలియబడడని తెలుపు నిమిత్తము దేవాలయములలో సింహతలాటమునుంచారని తెలియవలెను.



# 11. గర్భగుడి

దేవాలయములో మూల వీరాట్ ప్రతిమయున్న దానిని గర్భగుడి అంటున్నాము. గర్భము నుండి సజీవముగ పుట్టువాడు భగవంతుడు. ప్రపంచములో ఒక్క భగవంతుడు తప్ప ఏ మనిషి తల్లి గర్భము నుండి సజీవముగ పుట్టడు. అంతట వ్యాపించి ఉన్న పరమాత్మ తల్లి గర్భము నుండి సజీవముగ పుట్టుచుండును. ఒక్క చోట ఉన్న జీవాత్మ తల్లి గర్భము నుండి బయటికి వచ్చిన శరీరములో మాత్రము చేరుచుండును. మనిషి భగవంతుడు ఒకే లాగున కనిపించుచున్నప్పటికి పుట్టుకలోనే ఎంతో తేడాగలదని, మన మాదిరి కర్మ బద్ధుడై పుట్టడని, తల్లి శరీరములో కూడ అణువణువున వ్యాపించినవాడు తల్లి శరీరము నుండే సజీవముగ పుట్టునని తెలియజేయు అర్థముతోనే ఆయనను భగవంతుడన్నాము. అందువలననే భగవంతుని గుర్తుగ నిర్మించిన ఆలయములలో దేవుని ప్రతిమయున్న స్థలమును గర్భగుడి అంటున్నాము. గర్భగుడిలో గర్భమునుండి అనగ భగము నుండి పుట్టిన భగవంతుడుండునని అర్థము. ఎక్కడయిన ఆకారముగల ప్రతిమ ఉన్నదానినే గర్భగుడి అనాలి. ముక్కు ముఖము ఆకారములేని లింగము గల ఆలయములో లింగమున్న స్థలమును గర్భగుడి అనరాదు. ఎందుకనగా పరమాత్మ గుర్తింపయినవాడు పుట్టువాడు కాదు. నిరాకార స్వరూపమును తెలుపు లింగమున్న స్థలమును

గర్భగుడి అనడము చాలా తప్పు మరియు సాంప్రదాయ విరుద్దమని తెలియాలి. లింగమునకు సింహతలాటముండ కూడదు. అలాగే లింగమున్న స్థలమును గర్భగుడి అనరాదు. ఆకార ప్రతిమయున్న స్థలమును గర్భగుడి అనాలి. అలాగే ప్రతిమాకారమునకు తప్పనిసరిగ సింహతలాటముండాలి. పరమాత్మ అంశ భూమి మీద అవతరించినప్పటికి పరమాత్మ అణువణువున వ్యాపించి ఉండును. పుట్టిన ఆకారమునకు అనగ భగవంతునికి తల్లి గర్భముండును. నిరాకారమైన పరమాత్మకు తల్లి గర్భముండదు, ఆయనకు పుట్టుక లేదు. అందువలన ఆకారమున్న భగవంతుని రూపమునకు సమతగయున్న రంగదేవాలయమును గర్భగుడి అనవచ్చును. ఆకారములేని పరమాత్మకు సమతగయున్న లింగమున్న ఆలయమును గర్భగుడి అనరాదు. అలాగే ఆకారమున్న భగవంతుడు మాయలో చిక్కి తిరుగువాడై ఉండును కనుక మాయకు సమతయైన సింహతలాటమును ఆకారమున్న ప్రతిమకు పెట్టవలెను. ఆకారములేని పరమాత్మ మాయలోపల చిక్కియుండడు కనుక పరమాత్మ సూచనయైన లింగమునకు సింహతలాటమునుంచకూడదు. ఆకారము కల్గిన భగవంతునికే ఆయుధములు అవసరము, ఆకారములేని దేవునికి (పరమాత్మకు) ఆయుధములు అవసరములేదు, ఆయనే ఆయుధములందు వ్యాపించినవాడు కనుక లింగము దగ్గర ఆయుధములుండవు మరియు ఉంచకూడదు. ఆకారమున్న ప్రతిమకు మాత్రమే ఆయుధములుంచవలెను.



# 12. శంఖు చక్రములు

తిరుపతి మొదలైన దేవస్థానములందు శంకు చక్ర నామములు మాత్రమే ప్రతిష్ఠించి ఉంచడము గమనార్హము తమిలనాడులో కొన్ని

దేవాలయముల ప్రాంగణముల మీద శంఖు చక్ర నామదర్శనము కలవు. అలాగే దేవతా పటములుగ శంఖు చక్రనామములు గల చిత్రములు కూడ ఉన్నవి. అన్నిటికంటే తిరుపతి తిరుమలలోనే ఎక్కువగ శంఖు చక్రనామముల దర్శనము కలదు. అట్లే నామముగల దేవతల చేతులందు కూడ శంఖు చక్రములుండును. దేవాలయములోని ప్రతిది ఆత్మ జ్ఞానార్థమే అయినపుడు శంఖు చక్రనామములకు కూడ విశేషార్థమే ఉండును. అది ఏమనగా!

ఒక యుద్ధము జరుగబోవుననుకోండి, అక్కడ మొదట అరుపులు, కేకలు, శంకారావములు, ధంకారావములు మొదలైన పెద్దకోలాహల మేర్పడును. తర్వాత నాశనమేర్పడును. అట్లే కర్మ నాశనమునకు యోగసాధనయను యుద్ధము చేయవలయును. ఆ యోగసాధనను యుద్ధము శబ్దము లేకుండ మొదలుకాదు. గురువు నుండి బయల్పడు జ్ఞాన బోధలను శబ్దము మొదట కలుగవలెను. జ్ఞానబోధయను శబ్దము శరీరములోని మనస్సుకు చేరిన తర్వాత యోగసాధనను యుద్ధము మొదలగును. చిన్న పోట్లాట మొదలుకొని పెద్ద యుద్ధముల వరకు శబ్దము లేకుండ ఏ మాత్రము జరుగనట్లు, కర్మయను శత్రువు మీదికి యోగ సాధనను యుద్ధము జ్ఞానశబ్దము లేనిది ఏ మాత్రము జరుగదు. అందువలన జన్మరాహిత్యమునకు, ఆత్మ దర్శనమునకు మొదట జ్ఞానమవసరము తర్వాత యోగమవసరము. జ్ఞానములేనిది యోగము రానించదు. "శ్రేయోహి జ్ఞానమభ్యాసాత్, జ్ఞానాద్ధ్యానం విశిష్యతే" అని భగవద్గీత కూడ బోధించుచున్నది.

శంఖమునుండి ఉద్భవించునది శబ్దము. జ్ఞానము శబ్దముతో కూడుకొన్నది. కావున జ్ఞానము మొదట ప్రతి మానవునికి ఉండవలెనను



శంఖు చక్ర నామము

ఉద్దేశముతో నామముకు ఎడమ ప్రక్క శంఖమునుంచారు. జ్ఞానముచే యోగసాధన చేయువానికి యోగము లభించి కర్మను కాల్చివేయును. కనుక కర్మ నాశనమగుటకు చక్రమును చూపించారు. మొదట జ్ఞానశబ్దమను శంఖారావముచేసి తర్వాత యోగసాధనను యుద్ధము చేసిన యోగశక్తియను చక్రముచేత కర్మయను శత్రువు నశించునను ఉద్ధేశముతో కుడి ప్రక్కన చక్రమునుంచారు. జ్ఞానములేనిది జ్ఞానశక్తిలేదు. కనుక శంఖము లేకుండ చక్రమును ఎక్కడ ఉంచరు. ఎక్కడైనగాని శంఖు చక్రముల రెండు గుర్తులుండును. ఈ రెండు గుర్తులకు మధ్య నామము ఉండును. అట్లులేని యెడల నామముగల దేవుడయిన ఉండును. ఈ విధముగ శంఖు చక్రములకు మధ్యన నామమో లేక నామముగల దేవుడో ఉండడము యొక్క కారణమేమనగా!

జ్ఞానము కల్గి యోగమాచరించిన వారికి యోగశక్తి (జ్ఞానశక్తి) చేత కర్మ కాలిపోవును. అటువంటివాడు మోక్షము పొందును. అందువలన బ్రహ్మనాడిగ గుర్తింపు పొందిన నామమును అక్కడ చూపడము జరిగినది. నామము పై భాగము యొక్క మొన శూన్యమును

చూపుచున్నది. కావున శంఖు చక్రములు కల్గిన నేను మోక్షమందున్నానని దేవాలయ ప్రతిమ చూపుచున్నది. అట్లే జ్ఞానము యోగశక్తి కల్గినవాడు మోక్షమును పొందునని జ్ఞానచిహ్నముగ శంఖమును, మోక్ష చిహ్నముగ నామమును, కర్మ నాశన శక్తి చిహ్నముగ చక్రమును చూపడము జరిగినది. పెద్దలు పెట్టిన చిహ్నములుండిన వాటికి సంబంధించిన ఆత్మజ్ఞాన వివరములు ఈ దినములలో లేవు. కావున చదువరులు బాగ అర్థము చేసుకొని ఆచరించవలెను.



# 13. ఆయుధములు

ఒక్క శివాలయమైన లింగమునకు తప్ప రూపము కల్గిన అన్ని దేవతలకు ఆయుధములుండుట చూచి ఉందుము. ఆ ఆయుధములు కూడ కొందరికి ఒకటి మరికొందరికి రెండు మొదలుకొని ఏడు లేక ఎనిమిది వరకుండుట చూచి ఉన్నాము. దేవతలకు ఆయుధములు ఉంచడములో అంతరార్థమేమిటో కూడ మనము తెలుసుకోవలసి ఉన్నది. వాయువు అనగ గాలి మన ముక్కు రంధ్రములలో ఆడుచున్న శ్వాస వాయువే అనగా గాలి. శ్వాసల లెక్కాచారము వలననే మనము బ్రతుకబడు కాలముండును. ఒక మనిషి బ్రతుకునది శ్వాసల వలన కావున వాయువే వాని జీవిత కొలత. అందువలన పూర్వము జ్యోతిష్యము ప్రకారము వాని జీవితము ఇంతవరకుండుననుచు వాని వాయువు ఇంత ఉన్నది అనెడివారు. అదియే కాలక్రమమున వాయువు అనే పదము ఆయువుగ మారినదని ముందు కూడ చెప్పుకొన్నాము. మారిన పదము ప్రకారము ఆయువును అయిపోవునట్లు చేయునది ఆయుధము.



ఆయుధములు

ఆయువును అనుసరించి పుట్టినది ఆయుధము అనుపదము. అలాంటి ఆయుధములను దేవతలకు ధరింపజేయడములో అంతరార్థముండనే ఉంటుంది. ఇంతకు ముందు శంఖు చక్రములను గురించి చెప్పినపుడు చక్రము కర్మ నాశన చిహ్నమని తెలియజేసాము. అలాగే ఇక్కడ కూడ అనేక ఆయుధములను చూపడములో సూక్ష్మముగ ఉన్న అనేక రకములైన కర్మలను జ్ఞానమను ఆయుధములచేత ఖండించడమనే అర్థము గలదు. ఎపుడైతే కర్మ నాశనమైపోవునో అపుడు జీవునకు మోక్షము లభించును. ఆ విధానమును తెలుపు నిమిత్తము భగవంతుని వద్దగల జ్ఞాన ఖడ్గములను మన కర్మ మీద ఉపయోగించుకోవాలి. అలా జరగాలంటె మనము భగవంతుని పూర్తిగ నమ్మినపుడు ఆయన జ్ఞానముచేత మన కర్మ లేకుండ పోవును.



# 14. నామము

ఈశ్వరలింగము మీద విభూతి రేఖలకు క్షరాక్షర పురుశోత్తములని అర్థముండునట్లే త్రినామములకు కూడ వేరొక విధముగ ఆత్మ జ్ఞానమును బోధించునట్లు అర్థము గలదు. అది ఏమనగా! ప్రతిజీవరాసి శరీరములో 3 లక్షల 50 వేలు నాడులున్నట్లు వినికిడి. అందులో 72 వేలు ముఖ్యమైనవి. వాటికంటే ముఖ్యమైనవి 10 మాత్రమే. ఆ పది కంటే ముఖ్యమైనవి మూడు నాడులు గలవు. అవియే సూర్యనాడి, చంద్రనాడి, బ్రహ్మనాడి. ఈ మూడు నాడులు మన శరీరాంతర్గతమున మధ్యలో శిరస్సు మొదలుకొని గుదస్థానము వరకు వెన్నెముక దగ్గరున్నవి. వెన్నెముక మద్యలో బ్రహ్మనాడి కలదు. దానికిరుప్రక్కల సూర్య చంద్రనాడులు పూసల దండలవలె వ్యాపించియున్నవి. ఇందులో ముఖ్యమైన నాడి మధ్యనగల బ్రహ్మనాడి. కుడిప్రక్కగలది సూర్యనాడని ఎడమ ప్రక్కగలది చంద్రనాడని పేర్లుగలవు. సూర్యచంద్రనాడులలో మనలోని మనస్సుగలదు. మధ్యనాడయిన బ్రహ్మనాడిలో జీవాత్మకంటె అతీతమయిన సర్వ జీవరాసులందు ఇమిడి ఉన్న ఆత్మగలదు. సూర్య చంద్రనాడులలో గల మనస్సు బ్రహ్మనాడిని చేరడము యోగమని అందురు. మనస్సు బ్రహ్మనాడిని చేరిన అందులోని ఆత్మను జీవాత్మ అనుభవించుచున్నది. అనగా జీవాత్మ ఆత్మ ఒక్కటైనారన్న మాట. జీవాత్మ ఆత్మ యొక్క ఐక్యతను సూచించు జ్ఞానమే మూడు నామములని తెలియవలయును.

కుడిప్రక్కగల నామమును సూర్యనాడిగ, ఎడమ ప్రక్కగల నామమును చంద్రనాడిగ, మధ్యనగల నామమును బ్రహ్మనాడిగ పెద్దలు

గుర్తించారు. మనస్సు నివాసస్థలమైన సూర్యచంద్రనాడుల కంటె ఆత్మ నివాసమైన బ్రహ్మనాడియే ముఖ్యమైనది. అందువలన సూర్యచంద్ర నాడులుగ గుర్తించుచున్న కుడి, ఎడమ ప్రక్కలగల నామములకు తెల్లని రంగుదిద్ది ఆత్మ స్థానమైన బ్రహ్మనాడిగ గుర్తించుచున్న మద్యనాడికి ఎరుపురంగు దిద్దడమైనది. ఈ విధముగ దిద్దడము వలన చూస్తూనే మధ్యనాడి యొక్క ప్రత్యేకత కనిపిస్తూ ఉన్నది. మద్యనాడి యొక్క గొప్పతనమును చూచించుచు ప్రక్కనగల రెండునాడుల కంటె పొడవుగ తీర్చడమైనది. ఏ జీవాత్మయైన బ్రహ్మనాడిలోని ఆత్మలో చేరిపోతే చివరకు మోక్షము లభించునను ఉద్ధేశమును తెలుపుచు మధ్యగల నామము మొదటి భాగమునుంచి లావు తగ్గించుచువచ్చి చివరి భాగముకొన సూదిగ పెట్టడమైనది. ఆత్మలో చేరువారు చెప్పుటకు వీలుకాని శూన్యమైన పరమాత్మలో కలిసి పోవుదురనుటకు తార్కాణముగ మధ్యనాడి కొనభాగము ఆకాశమువైపు ఉండునట్లు చూచించారు. తిరుపతి దేవస్థానములో వెంకటేశ్వరుల ముఖము మీద పై విధ భావమును చూచించుచు పెద్ద నామమును పెట్టారు. ఆ విధముగ వెంకటేశ్వరుడు నామముతో దర్శనము కావడము వలన వాటి వివరము తెలుసుకొందురని గుర్తింపుగ పెద్ద నామమునుంచారు. ఆయన నామము యొక్క రహస్యము ఎవరు తెలియక సాధారణ విషయముగ తీసుకొనుచున్నారు. మనము కూడ నామము ధరించుచున్నాము. కాని ఆ నామమును గూర్చి ఎవ్వరు వివరించుకోవడము లేదు.



నామము

నాటి పెద్దలు లేకుండ పోయినారు. నేడు జ్ఞానరహస్యములు మనకు తెలియని పరిస్థితి ఏర్పడినది. కావున నామమునుంచుకొన్నవారు వైష్ణవులు, విభూతి రేఖలుంచినవారు శైవులని భావించుకొనుచున్నాము. త్రినామము విభూతి రేఖలు ఆత్మ జ్ఞానము బోధించు గుర్తులని తెలియక కుల వర్గ వ్యవస్థను తెలుపు చిహ్నములుగ భావించు కొనుచున్నాము. దేవాలయములలోని దేవుళ్లను కూడ వైష్ణవ దేవుడని. శైవదేవుడని చీల్చి వేయుచున్నాము. పరమాత్మ గుర్తయిన లింగమును శైవదేవుడని, భగవంతుని గుర్తయిన రంగని ప్రతిమను వైష్ణవ దేవుడని చెప్పుకోవడము అధర్మము.



# 15. హస్తము

దేవుని గర్భ గుడిలో ప్రతిమకు ఎంతో విశేషత ఉండగ ఆ ప్రతిమచూపిన హస్తమునకు మరీ విశేషత కలదు. ప్రతిమకున్న హస్తమే మనకు కూడ ఉన్నది. ప్రతిమ చూపిన హస్తములో ఎంతో అర్థమున్నదని గ్రహించిన ఎడల మనహస్తములో కూడ అదే విశేషత ఉన్నదని తెలియగలము. అందువలన దేవాలయములో గల ప్రతిమకున్న హస్తమును గురించి తెలుసుకొందాము. హస్తము యొక్క ఆకారమును బొమ్మలో చూచెదము.

హస్తము మద్యన మూడు రేఖలున్నవి. ఆ మూడు రేఖలలో క్రింద రెండు రేఖల కొనలు ఒకవైపు ఒకదానితో ఒకటి కలసియున్నవి. మూడువరేఖ క్రిందగల రెండు రేఖల కంటె పైన ఉండి రెండు రేఖలతో కలియకుండ వేరుగ ఉన్నది. వీటి భావమేమనగ భగవద్గీత

పురుషోత్తమ ప్రాప్తియోగమను అధ్యాయములో

16 వ శ్లో. " ద్వా విమౌ పురుషౌ లోకే క్షర శ్చాక్షర ఏవచ
క్షర స్సర్వాణి భూతాని కూటస్థో క్షర ఉచ్యతే "

భూమిమీద రెండు రకముల పురుషులున్నారు. ఆ ఇద్దరిలో ఒకడు క్షరుడు (నాశనమగువాడు) రెండవవాడు అక్షరుడు (నాశనముకాని వాడు)గ ఉన్నారు. క్షరుడనువాడు సర్వ జీవరాసులందు జీవునిగా ఉన్నాడు. అక్షరుడనువాడు సర్వజీవుల శరీరములందు కూటస్థుడుగ కలసి ఉన్నాడను శ్రీకృష్ణ పరమాత్మ మాట ప్రకారము మధ్య హస్తమునందు క్షరాక్షరులను రెండు రేఖలు విడిగా ఉండి కొనలు కలిసి ఉన్నవి. సమస్త శరీరములలో క్షరులుగ ఉన్న జీవాత్మను అట్లే సమస్త శరీరములలో చైతన్య శక్తిగ ఉన్న ఆత్మను సూచించు గుర్తులే హస్తములోని క్రింది రెండు రేఖలని తెలియాలి.

"ఉత్తమః పురుష స్త్వన్యః పరమాత్మే" అను పదిహేడవ శ్లోకములోని వాక్యము ప్రకారము మరియు "యస్మాత్ క్షర మతీతో హ మక్షరాదపి చోత్తమః" అను పద్దేనిమిదవ శ్లోకము ప్రకారము ఇద్దరి పురుషుల కంటే ఉత్తమమైన పురుషుడొకడున్నాడు వాడే పరమాత్మ. వాడు క్షరునికంటె అతీతుడు అక్షరుని కంటె శ్రేష్టుడు కావున వానిని పురుషోత్తముడు అంటున్నాము. ఆత్మ కంటె వేరుగ ఉన్నాడు కనుక పరమాత్మయని, జీవాత్మ ఆత్మలకంటె ఉత్తమునిగ ఉన్నాడు కనుక పురుషోత్తముడని చెప్పుచున్నాము. పరమాత్మ పురుషోత్తమ అనునవి ఆయన స్థోమతను తెల్పు పదములుగాని వాస్తవముగ అవి పేర్లుకావు. ఇద్దరి పురుషులకంటె వేరుగ అతీతముగ ఉన్నాడు కావున హస్తములో

మూడవ రేఖ రెండు రేఖల కంటే వేరుగ పైన గలదు. సృష్టికి కారణమైన సృష్టిలో మూల పురుషులయిన క్షరాక్షర పురుషోత్తముల గుర్తులను తెలియజేయు హస్తము ప్రతిమ చేత చూపబడుచున్నది. ప్రపంచములో ముఖ్యమైన ముగ్గురు మూల పురుషుల విషయము హస్తములో ఉండుటవలన అరచేతిలో అంతా ఉన్నదని, అరచేతిలో వైకుంఠమున్నదని పెద్దలనెడివారు. అరచేతిలోని అర్థమేకాక ఒక అరచేయినేకాక హస్తమంత పరికించి చూచెదము.

హస్తమునకు ఐదు వ్రేళ్లు గలవు. ఐదువ్రేళ్లు పంచ భూతములకు, ఐదు జ్ఞానేంద్రియములకు, ఐదు వాయువులకు ప్రతీకగ ఉన్నవి. వీటిని సందర్భాను సారము అర్థము చేసుకోవలయును. ఇచట ఐదు వ్రేళ్లను పంచభూతములయిన ఆకాశము, గాలి, అగ్ని, నీరు, భూమిగ అర్థము చేసుకోవాలి. హస్తము మధ్యలోగల రేఖలను ముగ్గురు పురుషులుగ ఐదు వ్రేళ్లు ఐదు ప్రకృతి భాగములుగ లెక్కించుకోవడము వలన మొత్తము ప్రపంచము దానికి ఆధారమైన పరమాత్మ, ఆత్మ, జీవాత్మలు అనగా యావత్ అండపిండ బ్రహ్మాండమంతయు హస్తమునందే తెలియబడునట్లు అర్థముకాగలదు. పంచ భూతములయిన ప్రకృతి పరమాత్మ రెండునూ హస్తములోనే ఇమిడినట్లు ప్రతిమ చూపడమేకాక ప్రతి ఒక్కరిలోను ప్రకృతి పరమాత్మలున్నట్లు తెలుసుకోవాలని తెలియబడినది.

ఒక మనిషి శరీరములో జీవాత్మ ఆత్మయేకాక పరమాత్మ మరియు ప్రకృతి ఉన్నట్లు హస్తములో తెలియబరచబడి ఉండడమేకాక శరీరములోని మరియొక రహస్యము కూడ బహిర్గతమగుచున్నది. ఆ రహస్యమేమనగా మనిషి ప్రకృతిలో ఉంటే ఏ విధముగ ఉంటాడు, పరమాత్మలోనికి పోతే ఎలాగుంటాడను విషయము. శరీరములోని ప్రకృతిలో చిక్కుకొన్న




హస్తము

జీవుడు ప్రకృతి జనితమైన మూడు గుణములందు ఉన్నాడని చూపడము ఒక విధానముకాగ, మూడు గుణములను దాటిన ఎట్లుండునను విషయము మరియు మూడు గుణములను అతిక్రమించి ఉండడము వలన కొంత కాలమునకు జీవుడు పూర్తి ఏ విధముగ మారి పోవునను విషయమును కూడ తెలియబరచబడుచున్నది. ఆ విషయములు హస్తములో ఎట్లున్నది పరికించి చూస్తాము. హస్తమునకున్న వ్రేళ్లకు మూడు గెణుపులు గలవు. వ్రేళ్లకున్న అడ్డగీతల వలన ఒక్కొక్క వ్రేలు

మూడు భాగములుగ విభజింపబడి కనిపిస్తున్నది. ఐదు వ్రేళ్ళ పంచభూతములకు ప్రతీకకాగ పంచభూతములనబడు ప్రకృతికి మూడు గుణములు పుట్టాయని, పంచభూత నిర్మితమైనవే మూడు గుణములని తెలియునట్లు ఐదు వ్రేళ్ళు మూడు భాగములుగ ఉన్నవి. ప్రకృతిలో పుట్టిన జీవుడు ప్రకృతి గుణములందే చిక్కుకొని ఉన్నాడని గుడిలోని దేవుడు హస్తము చూపి తెలియచేయుచున్నాడు. హస్తములోని అరచేయి మధ్యన ఉండగ అరచేయి క్రింద మనికట్టు మీద మూడు మడతలు కనిపిస్తున్నవి. ఆ గీతలను వ్రేల్లలోని గీతలతో చేర్చితే అరచేయి చుట్టు చక్రమేర్పడినట్లున్నది. హస్తము బొమ్మలో చూపినట్లు మూడు రేఖలకు మధ్యలోని అరచేతిలో మూడు ఆత్మలు కనిపిస్తుండగ అరచేతి నుండి వ్రేల్ల వైపు మూడు భాగములున్నాయి కదా! అందులో మొదటిది తామస గుణభాగమని, రెండవది రాజస గుణభాగమని, మూడవది సాత్త్విక గుణ భాగమని తెలియాలి. చేతిలో చూపినట్లే శరీరములోని జీవుడు ఈ మూడు గుణములలోనే ఉన్నాడు. గుణములుగ గుర్తించిన చేతి గెనుపులలో సాత్త్వికముగ గుర్తించిన వ్రేల్లకొన భాగమయిన గెనుపులలో శంఖు చక్రముల ఆకారముండును. శంఖు జ్ఞానబోధయని చక్రము కర్మనాశనమని ముందు అధ్యాయములోనే తెలుసుకొన్నాము. జ్ఞానబోధ తెలిసి కర్మ నాశనము చేసుకొను విధానమొకటున్నదని తెలియబరచడమే వ్రేల్లకు శంఖు చక్రములుండు అర్థమని తెలియాలి. వ్రేల్ల చివరలోగల శంఖు చక్రములను చూచిన తర్వాత దానికి సంబంధించిన విధానము గుణముల వెనకల తెల్లని గోరుగ ఉన్నదని తెలియగలము. మూడు గుణములే కాదు వాటిని వాటి వలన వచ్చు కర్మను జయించెడి యుద్ధము కూడ కలదు అని యుద్ధ చిహ్నములుగ

ఉన్న శంఖు చక్రములను వ్రేల్ల కొన భాగములో దేవుడు చిత్రించడము జరిగినది. ఇలా ఎన్నో ఆకారములను హస్తములో చిత్రించి ఉండగ కొందరు హస్తములోని రేఖలను శంఖు చక్రములను జ్యోతిష్యముగ హస్తసాముద్రికముగ చెప్పుకోవడము తప్పు అని గమనించాలి. చివరి భాగములో ఉన్న సాత్త్విక గుణభాగము తర్వాత గోర్లు కనిపిస్తుండును. గోరును చూచినచో వ్రేల్లు మూడు గెనుపుల చర్మముకంటె గట్టిగ ఉండి వ్రేల్ల రంగుకంటే వేరుగ తెల్లగ ఉండును. మూడు గుణములలో జీవుడు ఉండడమేకాక నాల్గవ స్థానము కూడ జీవునకున్నదన్నట్లు వ్రేల్లకొన భాగములో గోర్లుండడము యొక్క అర్థము. "చాతుర్వర్ణం" అని భగవద్గీతలో చెప్పినట్లు జీవులు సాత్త్వికులు రాజసులు తామసులేకాక యోగులు కూడ ఉన్నారు. ప్రకృతిలోని ఆ యోగుల యొక్క స్థానమును తెల్పునదే గోరు. గోరు తెల్లగ ఉండి యోగుల స్పష్టతను తెలియ చేయుచున్నది. యోగులయినవారు జ్ఞానము కల్గియుందురనుటకు లేక జ్ఞానము కల్గినవారే యోగులగుదురనుటకు, జ్ఞానము వలననే యోగము ప్రాప్తించుననుటకు గుర్తుగ జ్ఞానమునకు చిహ్నమైన చంద్రుడు తెల్లని గోరు మీద మరి తెల్లగ కనిపిస్తు ఉండును. ఈ విధముగ వ్రేల్ల మూడు గెనుపులు మూడు గుణములుకాగ చివరగ పైకి కనిపించు గోరు యోగుల స్థానము సూచిస్తున్నది. గోరు మీద ఉదయించు చంద్రుడు జ్ఞానమును సూచిస్తున్నాడు.

మూడు గుణములలో ఉన్న వానికి కష్ట సుఖములుండును. మూడు గుణములు దాటి యోగములో ఉన్నవాడు కూడ కష్ట సుఖములకు లోనగుచుండును. ఎందుకనగా మూడు గుణములందు ఉండిన, యోగములో ఉండిన జీవుడు కష్ట సుఖములనుభవించక తప్పదు. కష్ట

సుఖములు పూర్తి లేకుండ పోవలయునంటే జీవుడు గుణములను యోగమును అన్నిటిని వదలి మోక్షము పొందవలెను. మోక్షము పొందిన వానికి ఏ అనుభూతితోను సంబంధము లేదు. కష్టసుఖ అనుభవము ఏ మాత్రము ఉండవు. అందువలననే మూడు గుణములను సూచించు వ్రేల్ల గెనుపులలో కత్తితో కుచ్చిన వెంటనే నొప్పి కనిపించును. యోగమును సూచించు గోరు కూడ వ్రేల్ల కంటే కొద్ది తేడాతో నొప్పి కనిపించును. మోక్షము పొందిన వానికి ఏ అనుభూతి ఉండదు కావున తెల్ల గోరు చివరలో వేలుకు పై భాగమున చివరలో తెల్లగోరు నుండి నీల వర్ణముగల గోరు మొలచి ఉండును. ఆ గోరు మోక్షమును సూచించుచున్నదై నీలవర్ణము గల్గి ప్రత్యేకముగ ఉండును. మోక్షము పొందిన వానికి కష్టసుఖ అనుభూతులు లేవన్నట్లు నీలవర్ణ గోరును కత్తితో కోసిన ఏ మాత్రము నొప్పికాని సుఖముగాని ఉండదు. మోక్షము పొందిన జీవుడీవిధముగ ఉండునని తెలుపు నిమిత్తమే చివరి గోరు నొప్పిలేనిదై ఉన్నది. మూడు ఆత్మల విధానము, మూడు గుణముల విధానము, జ్ఞానము యోగము యొక్క విధానము, చివరకు మోక్షము యొక్క విధానము తెల్పునదే దేవుని హస్తదర్శనము. ప్రతిమ చూపు హస్తములో ఎంతో జ్ఞాన మిమిడి ఉండగ దానిని అభయహస్తమనడము పొరపాటు కాదా! ఆకారమున్న ప్రతిమ హస్తములో ఏ అర్థముందో నీ చేతి హస్తములో కూడ అదే అర్థము గలదు. నీ చేతిని నీవు చూచుకొమ్మని దానిలోని అర్థము తెలుసుకొమ్మని దేవాలయములోని దేవుడు హస్తమును చూపుచున్నాడని తెలియవలయును.

యోగమునకు జ్ఞానమవసరమని "శ్రేయోహి జ్ఞాన మభ్యాసాత్" అని భగవద్గీతలో పరమాత్మ భగవంతుని రూపములో తెల్పియుండగ,

మన హస్తములో కూడ యోగమును తెలుపు తెల్లని గోరుకు మరి తెల్లని చంద్రుడు ఉన్నట్లు తెలియుచున్నను **కొందరు మాయ వశమై జ్ఞానముతో పనేలేదు మూతిమీద ధ్యాస పెట్టు కొమ్మనో, మూతిలోని ముక్కుమీద ధ్యాస పెట్టుకొమ్మనో, ముక్కులోని శ్వాస మీద ధ్యాస పెట్టుకొమ్మనో చెప్పడము గీతలోని దేవుని మాటను ధిక్కరించడము కాదా! దేవాలయములోని ప్రతిమ హస్త సందేశమును మరచి మరెక్కడో పెట్టినట్లు కాదా! వారివారి చేతిలోని దేవుని సందేశముద్రను విస్మరించినట్లు కాదా! జ్ఞానమును చెత్తతో సమానముగ చెప్పడము మాయ యొక్క మాట కాదా! అట్లనుకొంటె భగవంతుడు జ్ఞానమును గీతలో చెప్పవలసిన పనేలేదు కదా! శ్రేయోహి జ్ఞాన మభ్యాసాత్ అన్న మాటకు విలువే లేదు కదా!** ఎవరు ఏమనుకొనిన దేవాలయములోని దేవుని హస్తములో ఎంతో సందేశముందని అది యావత్ ప్రపంచమునకు, మోక్షమునకు, గుణములకు, యోగమునకు, జ్ఞానమునకు ప్రత్యక్ష సాక్షమని తెలియాలి. పూర్వము ఉదయము లేస్తూనే హస్తమును చూచుకొనుట ముఖ్య సాంప్రదాయముగ ఇందువులలో ఉండెడిది. ఇప్పటికి ఆ సాంప్రదాయము నూటికి ఒక్క శాతము ఎక్కడయిన ఉండవచ్చును. పూర్వము ఉదయములేస్తూనే కల్లు తెరవగనే మొట్ట మొదటి దృశ్యముగ హస్తమునే చూచుకొనెడివారు. హస్తమును చూచుట వలన హస్తములోని రహస్యములన్ని జ్ఞప్తి తెచ్చుకొని నేను ఈ రోజంతయు మోక్షము కొరకు ప్రాకులాడెదనని తలచి పరమాత్మ చిహ్నమైన రేఖను భక్తి పూర్వకముగ కల్లకద్దుకొనెడివారు. పూర్వపు పెద్దల భావమునే మనము కల్గి హస్తమును

చూడవలెనని, ఇతరులకు కూడ హస్తము యొక్క వివరము తెలుపవలెనని, దేవాలయములు ఆధ్యాత్మిక కేంద్రములని, ఆరాధనలు అర్థముతో కూడుకొన్నవని తెలిపితే విగ్రహారాధనను వ్యతిరేకించువారు కూడ వ్యతిరేకించక అర్థము చేసుకోగలరని తెలుపుచున్నాము.



# 16. నెమలి పింఛము

ఇపుడు శ్రీకృష్ణ దేవాలయమున కొస్తాము. ఆ దేవాలయములోని క్రిష్ణ ప్రతిమయందెంతో జ్ఞానమిమిడ్చబడి ఉన్నది. క్రిష్ణ ప్రతిమకు తలయందు నెమలి పింఛము అమర్చబడి ఉండును. నెమలి పింఛమును కృష్ణుడు అందమునకో అలంకారమునకో ధరించలేదు. తాను ఉన్న స్థితి ఇదియని తెలుపుచు, మీరు కూడ ఈ మాదిరే ఉండవలయునని తెలుపుచు నెమలి పింఛము ధరించాడు. విశేషమేమనగా! పింఛము యొక్క మధ్య భాగము నీలిరంగుగ కొద్ది గుండ్రముగ ఉండును. ఈ భాగము పింఛములో అన్ని రంగుల కంటే ముఖ్యముగ తెలియు నట్లుండును. దానికి చుట్టు మెరుపుగల ఆకుపచ్చ రంగు ఉండును. దాని తర్వాత లేత గోధుమరంగు గల ఆకారము చుట్టు ఉండును. ఈ లేత గోధుమరంగు చుట్టు చివరియందు మెరియుచు ఉండును. దీని చివరి అంచు మెరుపు తర్వాత చుట్టు గుర్తించలేనంతగ లేతగ ఒకరంగు భాగముండును. ఇట్లు పింఛములో మొత్తము నాలుగు భాగములున్నట్లు గుర్తు తెలియుచున్నది. మీరు ఒక పింఛమును సంపాదించుకొని బాగ చూచి గుర్తించండని కోరుచున్నాము. ముఖ్య భాగమైన మధ్యలోనిది నలుపుతో కలిసిన నీలిరంగుగ ఉండును. రెండవది గుండ్రని మెరుపు

గల ఆకుపచ్చ భాగము, మూడవది లేత గోధమ రంగు, నాలుగవది గమనించలేనంతగ ఒక భాగముండును. నాలుగవదాని చివరియంచు కూడ మూడవదాని అంచువలె కొద్దిగ మెరియుచుండును. కనుక నాల్గవ భాగమును కూడ కష్టము లేకనే గుర్తించవచ్చును. బయటినుంచి మూడు గుండ్రని భాగములు ఉండి మధ్యలో కన్నుగ, కేంద్రముగ ఉన్న నెమలి పింఛమును బ్రహ్మ విద్యయైన గీతా శాస్త్రమును తెలిపిన కృష్ణుడు ధరించడము చాలా గొప్ప అర్థమైయుండును.



నెమలి పింఛము

మన శరీరములలో శిరోభాగమందు గుణములు కలవు. శరీరకార్యములన్నిటికి కారణమైన గుణములు ఒక పద్ధతిగ అమర్చబడి ఉన్నవి. ఆ పద్ధతి ఒక చక్రముగ పొందింపబడియున్నవి. గుణములు మూడు రకములుగ విభజింపబడియున్నవి. సాత్త్విక, రాజస, తామసమనబడు గుణరకములు చక్రములో మూడు భాగములుగ అమరి

ఉన్నవి. దానినే సాత్త్వికభాగము, రాజసభాగము, తామసభాగమని పేర్లు పెట్టబడినవి. ఈ మూడు భాగములకు మధ్య గుండ్రని ఒక భాగముండును అది బ్రహ్మనాడి. అందు ఆత్మ నివాసమైయుండును. ఆత్మ నివాసమైన బ్రహ్మనాడిని ఇరుసుగ చేసుకొని కంటికి కనిపించని గుణచక్రమమరి ఉన్నది. సర్వజీవులు గుణచక్రములలో చిక్కుకొని ఉన్నవి. ఏ భాగములో ఎక్కువ ఉండునో ఆ జీవునికి ఆ భాగము యొక్క పేరు పెట్టుట జరిగెడిదని పెద్దలు తెలిపారు. తామసగుణ భాగములో ఉన్న జీవుని తామసుడు, రాజస గుణభాగములో ఉన్న జీవుని రాజసుడని, అట్లే సాత్త్విక భాగములోనున్న వానిని సాత్త్వికుడని అనుట జరుగుచున్నది. ఏ గుణ భాగములో ఉన్నను ప్రతి జీవరాసిని ఆత్మ చూస్తున్నది. అందువలన ఆత్మే సాక్షిగ ఉన్నది. ఆత్మకు తెలియని జీవరాసి లేదు. అన్ని జీవరాసుల గుణచక్ర మధ్య భాగములో గల ఆత్మ చుట్టు ఉన్న గుణములతో సంబంధము లేక సాక్షిగ చూస్తు ఉన్నది.

ప్రతి జీవరాసి గుణముల వలన పనులు చేయుచున్నవి. పనుల వలన ఆయా జీవులకు పాప పుణ్యములు సంభవించుచున్నవి. కర్మలయిన పాప పుణ్యములు జీవాత్మలకేగాని మధ్యనున్న ఆత్మకు అంటవు. ఆత్మ శక్తియే శరీరమంత వ్యాపించి కదలిక శక్తి నిచ్చునదిగ ఉన్నప్పటికి ప్రతి జీవరాసి కదలికలు గుణములననుసరించి ఉండును. అందువలన ఆత్మ కారణమైన శక్తేకాని కార్యమైన కర్మకాదు. శరీరములో గుణముల ఆదేశము ప్రకారము వివిధ పనులు జరిగిన ఏ విధ కార్య సంబంధము లేక ఏ కర్మనంటక ఆత్మ అన్ని శరీరములందు సాక్షి భూతముగ ఉన్నది.

నెమలి పింఛము యొక్క మధ్యనగల భాగము గుణచక్రములో మధ్యనగల ఆత్మ నివాస స్థానము. దానికి చుట్టుగల రెండవ భాగము

గుణచక్రమందు సాత్త్వికము, దానికి చుట్టుగల మూడవ స్థానము రాజసభాగము. అట్లే చివరి నాల్గవ భాగము తామస భాగము. ఈ విధముగ నెమలి పింఛము గుణచక్రము సమాన పోలికలున్నవి. కృష్ణుడు పనులు చేయుచున్నను నాకు ఏ గుణ కర్మలంటవు, మూడు గుణముల మధ్య ఆత్మగనున్నానని తెలుపు నిమిత్తము మూడు భాగములకు మధ్యన గుర్తింపుగ కనిపించు ఆకారముగల నెమలి పింఛమును తల మీద ధరించాడు. అంతేకాక అందరియందు మూడుగుణములకు ఆత్మ సాక్షిగ నున్నాదను భావనతో కృష్ణుడు పింఛము ధరించడము జరిగినది.

మన శరీరములోని బ్రహ్మనాడియందు ఆత్మనివాసమై ఉన్నది. ఆ నాడి శిరస్సు మొదలుకొని గుద స్థానము వరకు వ్యాపించి ఉన్నది. వెన్నెముక మధ్యలో వ్యాపించిన బ్రహ్మనాడి నుండి ఆత్మశక్తి ప్రసరించుటకు ఇరువైపుల చిన్న చిన్న నరములు బయల్పడినవి. బ్రహ్మనాడి శక్తికి నిలయమైనదైతే ఆ శక్తిని గుణములు ఉపయోగించు కొనుచున్నవి. పైన గల గుణచక్రము నుండి వచ్చు ఆదేశములు మధ్యగల బ్రహ్మనాడి ద్వారానే రావలయును. అట్లే బయటి ఇంద్రియాల నుండి వచ్చు విషయములన్ని చిన్న నరముల ద్వార బ్రహ్మనాడి చేరి, అందు పయనించి గుణచక్రములో గల జీవునకు చేరుచున్నవి. ఈ చిన్న నరముల అమరిక, బ్రహ్మనాడి అమరిక మరియు పైన గల గుణచక్రము యొక్క అమరిక నెమలి పింఛమును గమనించిన బాగుగ తెలియును. పింఛము క్రింది కాడ లావుగ తెల్లగ మొదలై పొడవుగ ఉండును. అది బ్రహ్మనాడిగ అర్థము చేసుకోవలయును. ఆ పొడవు కాడకిరువైపుల చిన్నచిన్న ఈకలు ప్రక్కకు వ్యాపించి ఉండును. వాటిని బ్రహ్మనాడి నుండి బయల్పడిన చిన్నచిన్న నరములుగ లెక్కించుకోవలెను. పై భాగమునగల నాల్గు భాగములుగ కనిపించు పింఛము గుణచక్రముగ లెక్కించుకోవలెను.

1. సర్వజీవుల శరీరమందీ విధమైన అమరిక ఉండునను జ్ఞానము తెలుపు నిమిత్తమే కృష్ణుడు పింఛము ధరించాడు. 2. సర్వ జీవులు గుణములకు ఆత్మ సాక్షిగ ఉన్నదను సూచన నిమిత్తమే కృష్ణుడు పింఛము ధరించాడు. 3. ఆత్మ మూడు గుణములకు మధ్య నుండి ఏ గుణముతో సంబంధము లేకున్నదని తెల్పు నిమిత్తమే పింఛము ధరించాడు. నేను ఏ పనులు చేయుచున్నను మధ్యనగల నాకు అంటవని తెలుపుటకే పింఛము నుంచాడు. 5. సర్వ జీవుల తలలందే గుణములున్నాయి, ఆత్మ ఉన్నదని తెలుపు నిమిత్తము తల మీదనే పింఛము ధరించాడు. 6. చివరి అంచు రంగు లేతదైనది. రెండవది దానికంటే ఎక్కువ కనిపించునది. మూడవది దానికంటే మరి ఎక్కువ కనిపించునది. నాల్గవది అన్నిటికంటే మిన్నగ కనిపించు కన్నుగ నున్నది. అటువంటి పింఛము ధరించడము ఏ జీవరాసియైన చివరకు చేరవలసిన స్థానమిదేనని తెల్పుటయేనని తెలుసుకోవలెను. 7. గుణ చక్ర రహస్యము తెలిసినవారు నావలె నున్నవారని నాకు సమానమైనవారని తెల్పు నిమిత్తమే కృష్ణుడు పింఛము ధరించాడు. 8. గీత కర్మయోగమను అధ్యాయము 28వ శ్లోకము : “తత్త్వవిత్తు మహా బాహో గుణకర్మ విభాగయోః గుణా గుణేషు వర్తన్త ఇతిమత్వాన సజ్జతే” గుణ కర్మముల భాగములు తెలిసినవాడు ఆత్మను తెలిసినవాడగును. అటువంటివాడు గుణముల వలన జరిగెడి ఇంద్రియ పనులు ఎన్ని చేయుచున్నను చేయని వాడేనని తెలుపు నిమిత్తమే కృష్ణుడు నెమలి పింఛము

ధరించాడు. కృష్ణుడు ధరించిన ఒక్క నెమలి పింఛమునందే ఇంత ఆత్మ జ్ఞానమిమిడి ఉన్నదని మనకు ఇంత వరకు తెలియక పోవడము దురదృష్టకరము.



# 17. మురళి

అందరి శరీరములకు 9 రంధ్రములున్నవి. కన్నులు రెండు, చెవులు రెండు, ముక్కురంధ్రములు రెండు, నోరు ఒకటి, గుదము ఒకటి, గుహ్యమొకటి మొత్తము సర్వజీవుల శరీరములకు 9 రంధ్రములు ఉండును. అందువలన కొందరు పెద్దలు తొమ్మిది రంధ్రముల పుట్టని శరీరమును వర్ణించి అందులో జీవుడు పాముగ నివశిస్తున్నాడన్నారు. పుట్టలోని పాము బయటికి తెలియదు. కనుక ఏ పుట్టలో ఏ పామున్నదోనని ఏ శరీరములో ఏ జీవుడున్నాడో అని అర్థమొచ్చునట్లు అన్నారు.

పిల్లన గ్రోవికి కూడ 9 రంధ్రములు కలవు. పిల్లన గ్రోవిని జీవుల శరీరములతో పోల్చవచ్చును. శరీరములకు గల నవ రంధ్రములవలె మురళి యొక్క రంధ్రములు కూడ 9 ఉన్నవి. కావున జీవుల శరీరములన్నియు నా చేతిలో ఉన్నవని తెలియబరచు నిమిత్తము కృష్ణుడు మురళిని ఎల్లవేళల తన చేతియందుంచుకొన్నాడు. శరీరములు స్వతంత్రములు కావని దేవుని చేతిలో కీలుబొమ్మలని దీనిని బట్టి తెలియుచున్నది. జీవుల శరీరములు ప్రకృతిచేత తయారైనవి. ఆ ప్రకృతినే దేవుడు తన ఆధీనమందుకొన్నాడు.

అజ్ఞానమును తీసి జ్ఞానమును కల్గజేయడమే శ్రీకృష్ణుని యొక్క జన్మరహస్యము. కావున తన పిల్లన గ్రోవిని జీవుల శరీరములుగ పోల్చి చూపుచు, దానియందు సంగీతమును పలికించుచున్నాడు. నవరంధ్రములుగల పిల్లన గ్రోవిని తన నోటితో ఊదుచు దానియందొక శబ్దము పుట్టునట్లు చేయుచున్నాడు. ఆ శబ్దము లయ బద్ధముగ మురళి నుండి బయటికి వచ్చి కొంత దూరము వరకు వినిపిస్తుపోయి లయించుచున్నది. తొమ్మిది రంధ్రములుగల మురళిని నోటితో ఊదుచు సంగీతమును పుట్టించడము కూడ ఆత్మ జ్ఞానమేనని తెలియవలయును. ఇందులో ఏ జ్ఞానమున్నదని కొందరికి అనుమానము రావచ్చును. దానికి సమాధానమేమనగా!

ప్రతి మానవుడు అజ్ఞానము నుండి జ్ఞానమునకు చేరవలసిందే. అట్లు జ్ఞానమును పొందవలయునంటే ఒక గురువు అవసరము. గురుముఖత వచ్చు బోధ ద్వార అజ్ఞాని జ్ఞానిగ మారగలడు. జ్ఞానిగ మారినవాడు యోగియై పరమాత్మయందు ఐక్యమగుచున్నాడు. నవరంధ్రములు గల మురళి నవరంధ్రములు గల శరీరమని తెలియవలెను. మురళిని ఊదువాడు కృష్ణుడైతే శరీరములకు జ్ఞానమూదువాడు గురువు. మురళియందు ప్రోగించునది సంగీతమైతే శరీరము ధరించిన జీవునకు గురువవసరము, గురువు ద్వారనే జ్ఞానము పొందవలెనను సూచనగ కృష్ణుడు మురళిని ప్రోగించుచున్నాడు. మురళిని ఊదినపుడు బయటపడు శబ్దము గురువు జ్ఞానశక్తి నిచ్చినపుడు బయటపడు కర్మలని తెలియవలెను. శబ్దము కొంత దూరము పయనించి శూన్యములో తేలిపోయినట్లు కర్మయను శబ్దము నశించగానే జీవుడు కూడ శూన్యమైన పరమాత్మలో చేరిపోగలడనునటుల కృష్ణుడు మురళిని ప్రోగించాడు.



మురళి

జ్ఞానము శాస్త్రబద్ధమైనది అట్లే సంగీతము కూడ లయబద్ధమైనది. ఊదువాడు లేకపోతే మురళిలో సంగీతము మ్రోగదు. అట్లే గురువు లేకపోతే జ్ఞానము లభించదు. శబ్దము బయల్పడిన తర్వాతే శూన్యములో కలిసిపోవును. అట్లే జ్ఞానము కల్గి యోగియైనవాడే పరమాత్మలో చేరిపోవునని తెలుపునిమిత్తమే మురళిని కృష్ణుడు చూపాడు.



# 18. పాదములు

కృష్ణుడెక్కడైన నిలిచి ఉండునట్లే కన్పించును. ఎక్కడ నిలచి ఉండిన ఒక పాదము పూర్తి భూమి మీద మోపి ఒక పాదము ఊరక ఆనించి ఉండును. కృష్ణుని శరీరబరువంతయు ఒక పాదము ఎక్కువ ఒక పాదము తక్కువ మోయుచున్నదని తెలియుచున్నది. కృష్ణుని రెండు పాదములు సర్వజీవుల శరీరములందున్న రెండు శ్వాసలుగ గుర్తించవలెను. మన శరీరములో రెండు ముక్కు రంధ్రములలో ఆడుశ్వాస ఒకటి ఎక్కువ ఒకటి తక్కువ ఆడుచుండును. కుడిముక్కు రంధ్రములో ఎక్కువ శ్వాస వచ్చిన ఎడమ ముక్కు రంధ్రములో తక్కువ వచ్చుచుండును. ఒక సమయములో ఎడమ రంధ్రములో ఎక్కువ వచ్చిన కుడి ముక్కు

రంధ్రములో తక్కువ వచ్చుచుండును. ఈ విధముగ వచ్చుటకు కారణము శరీరములోని సూర్యచంద్రనాడుల మీద మనస్సు మారుచుండును. సూర్యనాడి మీద మనస్సుండునపుడు కుడి రంధ్రములో, చంద్రనాడిలో ఉన్నపుడు ఎడమ రంధ్రములోను శ్వాస ఎక్కువ వచ్చుచుండును. సూర్య చంద్రనాడుల మీద మనస్సుండునపుడు మనిషి సర్వపనులందు ప్రపంచములో ఇమిడిపోవును. సూర్య చంద్రనాడుల మీద మనస్సు లేనపుడు మనిషి ప్రపంచముతో సంబంధము లేక నిద్రలోకాని లేక యోగములో కాని ఇమిడి ఉండును.



పాదములు

సర్వ శరీరములలో శ్వాస రెండు భాగములుగ ఉండి ఒకటి ఎక్కువ ఒకటి తక్కువ ఉన్నదని, లోపలి మనస్సు ఉనికిని తెల్పుచు కృష్ణుడు ఒక పాదమును పూర్తి మోపి ఒక పాదమును కొద్దిగ మోపినాడు. నిలిచి ఉన్న కృష్ణుడు మెలుకువగ జాగ్రత్తావస్తయందున్నాడు. కనుక

జాగ్రత్తావస్థయందే మనస్సు కుడి ఎడమ నాడుల మీదికి మారు చుండునని తెలియుచున్నది. జాగ్రాత్తావస్థయందు మనో గమన స్థానములను తెలుపు నిమిత్తమే కృష్ణుడు నిలచి పాదముల చూపాడు. జాగ్రత్తావస్థయందు మనస్సు గమనము తెలిసినవాడు నిద్రయందు మనో స్థానము తెలుసుకొనుటకు ప్రయత్నించును. అట్లు మనస్సు నిద్ర జాగ్రత్తయందు ఎచ్చటనుండునో తెలియుట జ్ఞానమగును. మనస్సు సూర్యచంద్రనాడుల నుండి నిద్రయందు బ్రహ్మానాడిలో చేరునని తెలిసినవాడు ఆత్మ జ్ఞానమునకు దగ్గరకాగలడు.



# 19. శరీరము నీలిరంగు

పరమాత్మ ప్రపంచమంతట వ్యాపించినవాడు, ఇంద్రియములకు తెలియనివాడు, అనంతమైనశక్తి. అటువంటి దానిని పోల్చి చెప్పుటకు ప్రపంచములో దగ్గర సంబంధమున్నది ఆకాశమే. ఆకాశము శూన్యమైనది కంటికి తెలియదు. ప్రకృతిలో ఆకాశము ఒక భాగమైన అది పరమాత్మకాక పోయిన, పరమాత్మ విషయము పోల్చు సమయములో బయలైనదని, శూన్యమైనదని చెప్పుచున్నాము. శూన్యమునకు కూడ ఒక రంగు ఉన్నది, అది నీలి వర్ణము. ఏ రంగయిన ఒక వస్తువు మీద లేక పదార్థము మీదనో ఉండును. కాని ఆకాశ నీలి ఏ పరద మీద లేదు. దానిని శూన్యములో ఎంత వెతికిన ఉన్నట్లే ఉండును కాని సమీపించలేము. ఆకాశము నీలి వర్ణమైనది. కావున నేను కూడ అంతులేని అంతట వ్యాపించిన ఆకాశమువలెనున్నానని తెలుపుచు కృష్ణుడు

నీలి దేహము ధరించాడు. ఆకాశమునకు అంతులేదు కావున నేను అనంతుడనని తెలుపు నిమిత్తమే పరమాత్మ శరీరము నీలి వర్ణముగ నున్నది.



# 20. ఆరాధన

ఇంతవరకు దేవాలయ విషయములను తెలుసుకొన్నాము. ఇపుడు మనమాచరించు భక్తి, ఆచరించవలసిన భక్తి ఆరాధన విషయముల గూర్చి తెలుసుకుంటాము. ఈ కాల మానవులలో భక్తి అనునది చాలా తక్కువ. ఏదో కొంత మందిలో భక్తి భావనలున్నను, అవి సరైన విధానములో లేవు. దేవుడున్నాడను నమ్మికగల అనేక విధములైన భక్తులున్నారు. ఒక్కొక్కరు ఒక్కొక్క విధాన మాచరించుచు వారికి తెలిసిన విధానమే సరైనదనుకొనుచున్నారు. కొంత మంది మాత్రము సరైన భక్తి కల్గి జ్ఞానమార్జించి ఆత్మ పరమాత్మల తెలియుటకు ప్రయత్నించుచున్నారు. కొంత మంది దారిలోపోతూ దేవాలయము ముందర నమస్కరించి పోయినంత మాత్రముననే మాకంటే ఎక్కువ భక్తి గలవారింక లేరనుకొనుచున్నారు. కొందరు సంవత్సరమునకొక కొబ్బరికాయను (టెంకాయను) దేవాలయములో కొట్టివచ్చి మిగతవారి కంటే మేము చాలా గొప్ప భక్తులమని అనుకొందురు. కొందరు దేవాలయము వరకు కూడపోక ఇంటిలోనే ఎదో ఒక దేవతా పటము ముందర నమస్కరించి భక్తి కలవాడినని తృప్తిపడుచున్నారు. కొందరు తిరుపతి మొదలగు యాత్రలకు పోయి అంతో ఇంతో ముడుపులువేసి కోర్కెలు కోరుటయే భక్తి అనుకొన్నారు. కొందరు శివలింగములకు అభిషేకము చేయించి

మృత్యుదోషములు పోవలయునని కోరడము పద్ధతనుకొంటున్నారు. కొందరేమో కనపడిన చెట్టుకు గుట్టకు కూడ మ్రొక్కువారై ఉన్నారు. వీరందరిది భక్తియే అయిన అందుకు తగిన అర్థము లేదు. నడచేది దారి అయిన చేరు గమ్యము శ్మశానము కావచ్చు, అడవికావచ్చు నీటికొలను కావచ్చు, గ్రామము కావచ్చును. అట్లే చేసేది భక్తియే అయిన అది ఏ విధమైన ఉండవచ్చును. పరమాత్మను చేర్చునను నమ్మిక లేదు. తెలియక నడచిన దారి అడవిని చేర్చినట్లు అర్థరహితమైన భక్తి కోర్కెలచే నిండినదయి జన్మలు కలుగ జేయును.

పరమాత్మను తెలియజేయు నిమిత్తము సృష్టించబడ్డ దేవాలయములు ముడుపులను లంచము చూపి కోర్కెలను కోరు స్థలములగుట విచారింపదగ్గ విషయము. కోర్కెలు నెరవేరకపోతే దేవుని దూషించడము జరుగుచున్నది. కోర్కెలు కోరమని నేను నెరవేర్చుతానని ఏ గుడిలో దేవుడైన చెప్పాడా? **ఆశయను తాడుచేత కట్టబడి వివిధ కోర్కెలు కోరడము భక్తి కాదు. నూరు రూపాయలు ఖర్చుచేసి అభిషేకము చేయించి లక్షల రూపాయలు ఆదాయము రావలయునని కోరడము భక్తి కాదు. కర్మచే సంభవించు రోగములు నయమయిన మ్రొక్కుబడి చెల్లించుతానని కోరడము భక్తి కాదు. ఆత్మావగాహన చేయు దేవాలయములు మానవులకు దేవుల్లకు మధ్య కోర్కెల వ్యాపార కేంద్రములు కావడము శోచనీయము.**

ఎనుబది నాల్గు లక్షల జీవరాసులలో ఉత్తమమైన బుద్ధి గల మానవ జన్మధరించి, పాప పుణ్యముల వ్యత్యాసము తెలియక, జరుగు

పనులకన్నిటికి కారణమేదని వివరించుకొనక, తమ తెలివియే అన్నిటికి కారణమనుకొనుట అహంకారమే అగును. చావు పుట్టుకలు దాని తర్వాత స్థితి ఏమిటని యోచించక వృథాగా కాలమును గడుపుట జీవితమునకే అర్థము లేదు. పేరుకాని, రూపముగాని లేని పరమాత్మను కనుగొనుటకు ఒక పద్ధతితో కూడు కొన్న మార్గముందని తెలియక పోవడము అజ్ఞానమే అగును. ఉదయము లేచింది మొదలు పనులయందు లగ్నమై జీవితమంటె ఏమిటను భావన ఏ మాత్రము లేనివారు పశు పక్షులు జీవితమును గడిపినట్లే కాని వాటికంటే విశేషము లేదని తెలియవలయును. దేవుడున్నాడను నమ్మికమీద ఆధారపడి అందుకు కావలసిన వివరములు ఏమి తెలియక దేవాలయములకు పోయి పూజలు చేయువారిని చూచి కొందరు నమ్మకమనునది ఒక రోగమని వర్ణించి చెప్పువారున్నారు. ప్రతిపనియందు ఒక విశేషముందని తెలియనివారు గ్రుడ్డిగ భక్తి మార్గములో పోవువారిని చూచి వారి పనులకు ఆధారము లేదని నిర్ణయించుకొని దేవుడే లేడనువారున్నారు. దూరము నుండి చూచినవాడు చింత చెట్టుకు జమ్మి చెట్టుకు వ్యత్యాసము తెలియనట్లు భక్తి మార్గములో అర్థరహితులను చూచి జ్ఞానులు యోగులను కూడ ఆస్తిక రోగుల క్రిందికి లెక్క కట్టు నాస్తికులున్నారు. ఆస్తికులు నాస్తికులను రెండు తెగలకు యోగులు సంబంధించినవారు కారని చాలా మందికి తెలియదు. **ఆస్తికులు నమ్మిక గలవారు, నాస్తికులు నమ్మిక లేనివారు. నమ్మిక అపనమ్మికము మీద ఆధారపడక సత్యమును నిరూపన చేసుకొని అనుభవించువారు యోగులు. పురాణముల బట్టి పోవువారు ఆస్తికులైతే అవి నిరూపనకురానివని వాదించువారు నాస్తికులు. పురాణములే**

ప్రమాణములు కాదని శాస్త్రముల తెలిసి ఆచరించువారు యోగులు. ఆస్తికులకు యోగులకు వ్యత్యాసము తెలియని నాస్తికులు ఎద్దు ఈనిందంటే గాటికి కట్టివేయమను సామెతగ యోగులను కూడ ఆస్తికుల క్రిందికే చేర్చుకొనుచున్నారు. ఆస్తికులకు నమ్మికయే ప్రధానము, యోగులకు నిరూపనే ప్రధానమని తెలియనివారు నాస్తికులు. ఆస్తికులు తెలియక ఆచరించు ఆచరణలకు అర్థమునిచ్చువారు యోగులని తెలియనివారు నాస్తికులు. అజ్ఞానముతో కోర్కెలు కోరడము కోసము చేయు విధానమే భక్తి మార్గమనుకొను వారిని చూచి, కోర్కెలను నెరవేర్చు కేంద్రములే దేవాలయములను కొనువారిని చూచి, వారుజేయు పూజ విధానములు వృథాచేష్టలుగ తలచిన నాస్తికులు దేవుడను భయము కల్గినవారు నిర్మించినవే దేవాలయములని, దేవాలయములకు అర్థము లేదని తలంచుచున్నారు.

ప్రతి మలుపునందు ఆత్మ జ్ఞానమును ఇమిడ్చిన నిర్మాణములే దేవాలయములు. రూపము పేరులేని శూన్యమైన శక్తిని గూర్చి వివరించడమే దేవాలయ నిర్మాణములని ముందు తెలుసుకొన్నాము. ఆస్తికులు నాస్తికులు కాని యోగులు నిర్మించిన దేవాలయములలో జరుగు ప్రతిపనికి యోగులే అర్థము చెప్పవలయును. ఆత్మ నిరూపణ మార్గమును సూచించు దేవాలయములను అర్థము చేసుకోలేనివారు ఆస్తికులైన్పటికి గ్రుడ్డికంటే మెల్ల మేలన్నట్లు నాస్తికుల కంటే మేలని చెప్పవచ్చును. ఆస్తికులైనవారు జ్ఞాన చూపు కల్గి మేము తెలియజేయు ప్రతి ఆచరణకు

అర్థము అవగాహన చేసుకొని యోగమార్గమాచరింతురని తలచుచున్నాము. నాస్తికత్వమును నాశనము చేసి ఆస్తికత్వమును కూడ వదలి నిరూపణయే ముఖ్యధ్యేయమని యోగ మార్గమాచరించవలయునని ఇపుడు దేవాలయ పూజా విధానములకర్థము తెలియజేయుచున్నాము.



# 21. దీపము

పూజా విధానములో దీపము వెలిగించుట మొదటి పని, ప్రమిదయందు నూనెపోసి రెండువత్తులు వేసి వెలిగించు ఆచారము కలదు. వెలుగు నిమిత్తమేకాక జ్ఞానార్థముతో దీపము యొక్క సారాంశమున్నది. ప్రతి జీవికి శరీరమున్నది, ఆ శరీరములో కర్మలున్నవి. అందులోనే ఆత్మ జీవాత్మలు నివాసమై ఉన్నారు. జీవాత్మ శరీరములో జ్ఞానముచేత యోగమాచరించి ఆత్మలో కలిసిపోయిన యోగశక్తి లభించును. ఆ యోగశక్తి వలన కర్మంతయు కాలిపోవును. జ్ఞానాగ్ని (యోగశక్తి) లేనిది కర్మ కాలిపోదు. కర్మ కాలిపోనిది జన్మలు కలుగుచునే ఉండును. అందువలన జన్మ రాహిత్యమును కోరువారు అందులకు సమమైన అర్థమునిచ్చునటుల బాహ్యార్థముగ దీపము వెలిగించెడివారు.

ప్రమిదను శరీరముగ పోల్చి, అందుగల రెండు వత్తులను జీవాత్మ ఆత్మలుగ పోల్చి, జ్ఞానముచే యోగమాచరించిన వేళ ఆత్మ జీవాత్మలు కలిసి పోవుననునట్లు రెండు వత్తులను కలిపి వెలిగించుచుండెడివారు. రెండువత్తులు ఒక జ్యోతిగ వెలుగడమును యోగముగ చెప్పెడివారు.



దీపము

శరీరమున్నపుడు తప్పక కర్మ ఉండును. కనుక ప్రమిద పెట్టగనే ముందు నూనెపోసి ఉంచి తర్వాత వత్తులు వేసివెలిగింతురు. గురువు వలననే జ్ఞానము లభించును కావున ప్రక్క అగ్నిచేత వత్తులు వెలిగింతురు. జ్ఞానమను అగ్నిచేత రెండు వత్తులు (జీవాత్మ ఆత్మలు) ఏకమై వెల్గునపుడు కర్మ అను నూనె అయిపోవును. జ్ఞానాగ్నిచే శరీరములోని కర్మ నశించి పోవుచున్నదను సూచనయే ప్రమిదలోని నూనె అయిపోవడము. ప్రమిదలోని నూనె అయిపోయిన వెంటనే రెండు వత్తులు ఆరిపోవును. అట్లే శరీరములోని కర్మ అయిపోయిన వెంటనే శరీరములోని ఆత్మ జీవాత్మలు లేకుండ పోయి పరమాత్మలో ఐక్యమైపోవును. శరీరములోని ఆత్మ జీవాత్మ పోయిన మృత దేహము మిగిలినట్లు నూనె అయిపోయి రెండు వత్తులు ఆరిపోయిన ప్రమిద మిగిలి పోవును. మృత దేహమునకు విలువలేనట్లు ఆరిన ప్రమిదకు కూడ విలువ లేదు. పూర్వము మట్టి ప్రమిదలను పారవేసెడివారు. మృత శరీరము నశించునది కావున పగిలిపోవు మట్టి ప్రమిదలుంచెడివారు, పద్ధతి ప్రకారము లోహపు

ప్రమిదలు వెలిగించకూడదు. ఒకవేళ లోహపు ప్రమిదలుంచితే శుభ్రముచేసి వాడుకొనెడివారు. ఇప్పటికి కూడ మట్టి మూకట్లలో కాని లేక చిన్న మట్టి ప్రమిదలలో కాని దీపము వెలిగించు సాంప్రదాయము కొన్ని దేవాలయములలో కలదు. జీవుడు గురువునొసగిన జ్ఞానాగ్ని చేత ఆత్మతో కూడి వెలిగి అన్నిటిని వదలి పరమాత్మలో చేరిపోవు సూచనయే దీపారాధన అంతరార్థమని తెలియవలెను. గుడిలో ఎన్ని దీపములు పెట్టిన వత్తులు నూనె గలవి కనుక అన్నిటికి ఒకటే అర్థము. పెద్ద పూజలు చేయలేకుండిన విశేషార్థము గల దీపారాధనయిన ప్రతి ఇంటిలో చేయమని పెద్దలు తెల్పినారు. నేటికి కొందరిల్లలో ఉదయము సాయంకాలము దీపారాధన చేయుట కలదు. అయిన అది నామకార్థపు పనియే అయినది మరియు అర్థశూన్యమైనది. కొందరు ఒకే వత్తివేసి వెలిగించుచుందురు. అట్లు వెలిగించగూడదు. అట్లు వెలిగించుటవలన ఆచరణ కూడ తప్పు చేసినట్లగును. ఈ కాలములో కొన్ని దేవాలయములందు ప్రమిదలలో దీపారాధన చేయకుండ కరెంటు బల్బు వెలిగించి నమస్కరించుచున్నారు. అర్థము లేకున్న ఆచారమైన ఉండుట మంచిది. కాని ఆచరణ కూడ లేకుండపోతే మరీ అజ్ఞానమగును. అందువలన కరెంటు బల్బులు ఎన్ని వెలిగించినప్పటికి, అర్థముండునట్లు మట్టి ప్రమిదలలో దీపారాధన చేయడము అర్థముతో కూడిన సాంప్రదాయమగును.



# 22. తాంబూలము

పూజా విధానములో తాంబూలముంచుట కూడ కలదు. తాంబూలములో 1. ఆకు, 2. వక్క 3. సున్నము పూర్వ కాలములో ఉంచెడివారు. తాంబూలములో ఆకు విశాలమైనది. దానికంటే తక్కువ పరిమాణము కలది వక్క. వక్క కంటెను పరిమాణము తక్కువ గలది సున్నము. ఈ మూడు కలిసితే ఎర్రగ మారిపోవు స్వభావము గలవు. తమలపాకుకు చురుకుదనమైన ప్రత్యేకత కలదు. అట్లే వక్కకు కూడ వగరు ప్రత్యేకత గలదు. సున్నము కూడ ఘాటైనది. ఈ మూడు మూడు విధములుగ ప్రత్యేకత కల్గి ఉన్నవి. మన శరీరములో కూడ గుణచక్రములో విశాలమైనది తామసము. దానికంటె పరిమాణములో చిన్నది రాజసభాగము. రాజసము కంటె చిన్నది సాత్త్వికము. ఇపుడు మనము గుణచక్రములో విశాలమైన తామస భాగముగ తాంబూలములో పెద్దదైన తమలపాకును పోల్చుకోవచ్చును. అట్లే రాజసమును వక్కగ, సాత్త్వికమును సున్నముగ పెద్దలు లెక్కించారు. లోపలి నుండి గుణచక్రమున మూడవది తామసము రెండవది రాజసము ఒకటవది సాత్త్వికము. కనుక మూడు ఆకులు, రెండు వక్కలు, ఒక సున్నపు ఉంటను ఉంచెడివారు. తాంబూలములోని మూడు వస్తువులకు ప్రత్యేకమైన రుచులున్నట్లు గుణచక్రములోని మూడు గుణభాగములకు ప్రత్యేకమైన ఆచరణలు కలవు. తాంబూలములోని మూడు వస్తువుల వలన ఎర్రదన మేర్పడినట్లు గుణచక్రములోని మూడు గుణముల వలన కర్మయను ఎర్రదనము ఏర్పడినది. అందువలన జీవాత్మగ ఉన్న నేను కర్మకు కారణమైన మూడు గుణములను నీ ముందరనే వదలి

వేయుచున్నాను. గుణములులేని నన్ను నీలోనికి ఐక్యము చేసుకొమ్మని కోరు బాహ్యార్థమే తాంబూలముంచుటని గ్రహించవలెను. ఈ కాలములో పూజా సమయమున తాంబూలముంచిన ఆకులు, వక్కలు మాత్రము ఉంచుచున్నారు. కాని సున్నమునుంచడము లేదు. రెండు గుణములు పోయిన మూడవది ఉండవలెనన్నట్లు మూడవదయిన సున్నమును పెట్టక పోవడము విచిత్రము. సున్నములేని తాంబూలము దైవసన్నిధిలో అర్థము లేనిదగును.




తాంబూలము

తాంబూలముతో పాటు రకరకములైన తిను బండారములు నైవేద్యముగ ఉంచడము కూడ జరుగుచున్నది. పాయసము, పాలు, అరటిపండ్లు, చెక్కర, పెరుగన్నము, లడ్లు మొదలగునవి నైవేద్యములుగ సమర్పించడము చేయుచున్నారు. ఇవన్నియు తినుబండారములే. ఏ పదార్థములు తినిన ఆ పదార్థము యొక్క రంగు నోటిలో ఏర్పడదు,

అన్ని పదార్థములకంటే ప్రత్యేకముగ ఉన్న తాంబూలము తినిన నోరు ఎఱ్ఱనగును. అన్ని పదార్థముల రంగు వాసనలను తాంబూలము కప్పివేయుచున్నది. అట్లే ఆహారములైన తిను పదార్థములవలె మన శరీరములో అనేక రకములైన విషయములున్నవి. రకరకములైన విషయములు నాలో ఉండినవి నీకే సమర్పిస్తున్నానను సూచనయే అన్ని విధములైన పదార్థములు నైవేద్యములుగ ఉంచడము. శరీరములోని అన్ని విషయములు మూడు గుణభాగములలోనివేనని చూపు నిమిత్తమే అన్ని పదార్థములను అదిగమించి ఎఱ్ఱనగు తాంబూలమునుంచాము. నైవేద్యముగ తినుబండారములనేవైన ఉంచవచ్చును. కొందరు మాంసమును కూడ నైవేద్యముగ పెట్టు పూజలు కలవు. శాఖాహార నైవేద్యమైన మాంసాహార నైవేద్యమైన తాంబూలమునుంచడము అందరు చేయుదురు. దీని చేత ప్రతి విషయము మూడు గుణములందు ఇమిడి ఉన్నవేనని తెలియుచున్నది. ఈ కాలములో కూడ నైవేద్యములు పెట్టువారు అంతట ఉన్నారు. కాని తాంబూలములో సున్నము పెట్టువారు లేరు. ఒక్క తిరుపతి దేవస్థానములో మాత్రము తాంబూలములో సున్నము పెట్టు సాంప్రదాయమున్నట్లు వినికిడి ఉన్నది. అట్లే మధుర వద్దగల బృంధావనములో కూడ సున్నము పెట్టు సాంప్రదాయము కలదని విన్నాము.



## 23. పూలమాల

పూర్వకాలము జ్ఞానదృష్టి కల్గిన ప్రజలు వారి ఆరాధనలో పూలమాలను దేవునికి సమర్పించెడివారు. అలాగే దైవ సమానులయిన

గురువులకు పూలమాలను అర్పిచెడివారు. నేటి కాలములో రాజకీయ నాయకులకు పూలమాలలు వేయడము జరుగుచున్నది. వేల సంవత్సరముల పూర్వము గుడిలోని దేవునికి బడిలోని గురువుకు తప్ప ఇతరులకు పూలమాల వేసెడివారుకారు. పూలమాల దొరకని సమయములో కొద్దిపాటి పూలతోనయిన దేవుని పూజించెడివారు. పూవుతో పుట్టినదే పూజ అనెడివారు. అందువలన పూజ్య భావమున్న గురువుల వద్ద, దేవాలయములలోని దేవుని వద్ద మాత్రము పూలను ఉపయోగించెడివారు. ఆకార స్వరూపమున్న ప్రతిమలకే పూలమాలను ఉపయోగించెడివారు. లింగాకార ఈశ్వరాలయములలో లింగము వద్ద పూలను ఉపయోగించకుండిరి. లింగమునకు పూలమాల వేయకుండ పోవడము, ఆకారమున్న ప్రతిమకు పూలమాల వేయడములో అర్థమేమిటని కొందరికి ప్రశ్నరావచ్చును. దానికి సమాధానము ఆకారమున్న శరీరములో ఆత్మే దేవుడన్నాము కదా! ఆ దేవుడు శరీరమధ్యలో వ్యాపించి ఉన్న బ్రహ్మనాడియందు నివశిస్తు శరీరమంత చైతన్య రూపముతో వ్యాపించి ఉన్నాడు. శరీరమధ్యలో శిరస్సు నుండి క్రింది వరకు వ్యాపించి ఉన్న బ్రహ్మనాడిలో ఆత్మ ఉన్నది. అదియు మొత్తము ఏడు నాడీ కేంద్రముల మీద వ్యాపించి ఉన్నది. పూలమాలను దేవునికి సమర్పిస్తున్నామను భావముతో ఆ మాల ఏడు కేంద్రముల వరకు ఉండునట్లు తల మీద నుండి క్రింది వరకు వ్యాపించునట్లు పూలమాలనలంకరించెడివారు. సాంప్రదాయానుసారము తల మీద నుండి మాలను ధరింపజేయడము ఇప్పటికి తిరుపతి దేవస్థానమందు శ్రీవెంకటేశ్వరస్వామి ప్రతిమ వద్ద చూడవచ్చును. వాస్తవముగ ఎక్కడయిన ఏ దేవునికైన అలాగే చేయవలసి ఉండగ అలా చేయక పూలమాలను

మెడమీద నుండి అనగ కంఠము వద్ద నుండే ధరింపజేయుచున్నారు. కంఠము వద్ద నుండి మాల ఉండడము వలన బ్రహ్మనాడి ఐదు కేంద్రములకే మాల వేసినట్లగును. మిగత రెండు కేంద్రములకు వదలివేసినట్లగును. కొందరేమో చిన్న మాలను ధరింపజేయడమువలన పైన కంఠస్థానము నుండి హృదయ స్థానము వరకు వ్యాపించుట వలన కేవలము రెండు స్థానములకే సరిపోవుచున్నది. క్రింద మూడు కేంద్రములను వదలి వేసినట్లగుచున్నది. అలా వేయడము సాంప్రదాయము కానే కాదు. అందువలన స్థోమత ఉంటే పొడవు మాలతో ఏడు కేంద్రములకు మాల వేయాలి. లేక పోతే కొన్ని పూలనుకాని లేక ఒక్క పూవ్వునుగాని దేవుని శిరోభాగమున ఉంచి ఆరాధించడము మంచిది. పైన ఒక్క కేంద్రము మీద పెట్టడము వలన ఆత్మ అంతటికి పెట్టినట్లుగును. అలాకాక పైన వదలి క్రింద ఐదు కేంద్రములకు పూలమాల వేసిన ప్రయోజనముండదు.

ఆలయములోని దేవుని తర్వాత పూజ్య స్థానములో ఉన్నవాడు గురువు. గురువు శరీరములో ఆత్మ స్వరూపుడై ఏడు కేంద్రములు వ్యాపించి ఉన్నాడను భావముతోనే పూలమాలను ధరింపచేసెడివారు. భక్తి భావముతో ఆరాధ్య భావముతో గురువు శిరస్సు మీద నుండి సప్త స్థానముల వరకు ధరింపచేసిన మాలను తర్వాత గురువు తీసి పెట్టెడివాడు లేక తల మీద నుండి మెడ మీద తగిలించుకొనెడివారు. గుడిలోని ప్రతిమ కదలదు కావున పూలమాలను అలాగే తల మీద ఉంచెడివారు. గురువు కదలెడివాడు కనుక మాల క్రింద పడిపోవు అవకాశము కలదు. అలా పడిపోకుండునట్లు తర్వాత మెడ మీదికి జరుపుకొనెడివారు, లేకపోతే పూర్తిగ తీసి ప్రక్కన పెట్టెడివారు. ఏది ఎట్లయిన సప్తస్థానములకు

మాలను ధరింపజేయడమే ముఖ్య ఉద్దేశము. ఏడు కేంద్రములలో ఉండి శరీరమును బొమ్మలాగ ఆడించు దైవమునకు పూలమాల వేయుచున్నానని తలచి వేసెడివారు. గురువు శరీరములో కూడ అదే ఆత్మ ఉన్నదని తలచి గురువుకు కూడ వేసెడివారు. మిగత అన్ని శరీరములలో కూడ ఆత్మే ఉన్నప్పటికి అందరికి మాలను వేయక గురువుకు దేవునికి ఇద్దరికి మాత్రమే వేసి వారు మాత్రమే పూజ్యులని తెలియజేసారు. ఇప్పటి కాలములో పూజ్య భావములేకున్న గౌరవము కొరకో, లేక మన్నన పొందు కొరకో, గుర్తింపు కొరకో, ఇతరులకు కూడ మాల వేయడము జరుగుచున్నది. అలా చేయడము వలన నేటి ప్రజలకు ఎవరు పూజ్యులు అన్న విషయము తెలియకుండ పోయినది. అందువలన వీరు పూజ్యులని తెలియునట్లు ఆలయములోని దేవునికి జ్ఞానముతెల్పు గురువుకు పూలమాల వేస్తాము.

శివలింగమునకు మాల వేయకూడదన్నాము కదా! అది పూజ్యము కాదా అని కొందరడుగవచ్చును. దానికి సమాధానము లింగము మానవాకృతికాదు. మానవాకృతిలో ఆత్మ దేవుడై ఉంటాడను భావముతో ఆకృతి కల్గిన ప్రతిమకు మాల పైనుండి వేయడము జరిగినది. లింగములో ఆత్మ లేదు జీవాత్మ లేదు, లింగము పరమాత్మ స్వరూపము అంతట వ్యాపించిన దానికి పరిమితి స్థానము కల్పించి పూలమాల వేయలేము. ఇతర దేవాలయములలో మాదిరి అభిషేకము ఆరాధన అన్నిటిలోను చాలా తేడా ఉండును. మోక్ష చిహ్నము పురుషోత్తముని భావము అయిన లింగము ముందర ఆరాధన ఉండదు కాని అర్థము చేసుకోవడమే ఉంటుంది, లింగము ప్రత్యేకతే అది. సృష్ఠి రహస్యమును తెలియ జేయు లింగమును చూచి దాని గొప్పతనమును తెలుసుకో

వలసిందే కాని ఆరాధింపతగినది కాదు. పూర్వము జ్ఞానము తెలిసిన పెద్దలు ఎలా నడిచి ఉంటే అలా అర్థము తెలిసి నడువవలసినది మన బాధ్యత. అలాకాక మన ఇష్టమొచ్చినట్లు చేస్తు పోకుండ ప్రతి దానికి ఒక హద్దు ఆచారముంటుందని దేవాలయములలో తెలిపెడి ఆచారములేమిటో వాటి అర్థములేమిటో గ్రహించి వాటి ప్రకారము దేవునికి సమర్పించెడి పూలమాలను పూర్తి అర్థముతో సప్త స్థానములకు సమర్పిస్తాము.



# 24. అభిషేకము

దేవాలయములలో గల దేవుల్లకు అభిషేకము చేస్తుంటారు. పూజా విధానములో అభిషేకము కూడ ఒక భాగమై ఉన్నది. పూర్వపు జ్ఞానులు దేవాలయములకు దేవాలయములలోని పనులకు భావయుక్తమైన ఆచారముగ అర్థములనిమిడ్చి పెట్టారు. కాని వాటి వివరము కాల గర్భములో మరుగై పోవుట వలన కొన్ని ఆచారములు మిగిలి ఉన్నప్పటికి అర్థాలు లేకుండపోయినవి. అందువలన కొందరు ఆచారములను సక్రమముగ ఆచరించక వారి స్వబుద్ధికి తోచినట్లు కొన్ని పనులను మిలితము చేసుకొన్నారు. అటువంటి పనులలో అభిషేక కార్యము కూడ ఒకటిగా ఉన్నది. అభిషేకమనగా ప్రతిమను స్నానము చేయించుట అని అర్థము. పూర్వము గర్భగుడిలోని ప్రతిమను కేవలము మూడు ద్రవముల చేతనే కడిగెడివారు. అవి ఒకటి తేనె, రెండు పాలు, మూడు నీరుగ ఉండెడివి. అభిషేకమనెడి ప్రతిమ స్నానము కేవలము

ఆకారమున్న ప్రతిమలకే చేసెడివారు. ఆకారములేని శివలింగమునకు చేసెడివారు కారు. ఈ కాలములో శివలింగమునకు కూడ అభిషేక కార్యము చేయుచున్నారు. లింగాభిషేకమే ముఖ్యమని తలచెడివారు చాలామంది గలరు, ఇది పూర్తి సాంప్రదాయ విరుద్దము. లింగమును అభిషేక ప్రియుడని వర్ణించడము మరివిడ్డూరము. ఈ మా మాటలు కొందరికి నచ్చక పోవచ్చును. నచ్చిన నచ్చక పోయిన సత్యమే తెలుసుకోవాలనుకొను వారికి తెలియజేయునదేమనగా!

మనము మొదటనే చెప్పుకొన్నాము. లింగమును దేవతలలోనికి కలుపకూడదని, అలాగే లింగముగల గుడిని గర్భగుడి అనకూడదని కూడ చెప్పాము. లింగమును సాక్షాత్తు నిరాకారమైన పరమాత్మగ భావించవలయునని కూడ తెలియజేసాము. లింగమునకు సింహ తలాటముంచ కూడదని కూడ చెప్పాము. దీనికంతటికి కారణము ఏదయితే పురుషోత్తమము అంటున్నామో, ఏదయితే జీవాత్మ ఆత్మలకంటే పరముగ ఉన్న పరమాత్మ అంటున్నామో దానినే ప్రతిభింబముగ లింగరూపముగ దేవాలయములలో చూపాము. అందువలన లింగమును అన్నిటికి అతీతమైనదిగ భావించవలసి ఉన్నది. లింగము రూపములేని దేవుడుకాగ మిగత అన్ని ప్రతిమలను రూపమున్న దేవుల్లగ భావించవలసి ఉన్నది. లింగమును పరమాత్మగ భావించగ రూపమున్న దేవున్ని భగవంతునిగ భావించవలెను. లింగము మాయాతీతమైనది కావున దానికి ప్రతిమలకున్న ఆచారములుండవు. రూపమున్న ప్రతిమలు భగవంతుని చిహ్నాము కావున వాటికి ప్రత్యేకమైన ఆచారములు పెద్దలు నిర్ణయించారు. భగవంతుడు భగమునుండి పుట్టుకొచ్చి మనవలె భూమి మీద సంచరించును. అందువలన భగవంతునికి మనవలె గుణములు

కూడ ఉండును. గుణములేకాక సర్వ సాధారణముగ ఆయన భూమి మీద నడువవలసి ఉండును. ఒక్క జ్ఞానమును బోధించడములో తప్ప అన్నిటిలోను సాధారణ వ్యక్తిగనున్న వానిని భగవంతునిగ గుర్తించడము అసాధ్యము. కావున ఎన్నో మార్లు పరమాత్మ భగవంతునిగ వచ్చినపుడు ఆయనను గుర్తించ లేక పోయారు. సర్వ సాధారణముగనున్న భగవంతుడు గుణములతోడనే చరించుచుండును. ఆయనకు కూడ సాధారణ మనిషికున్నట్లే సాత్త్విక రాజస తామసములనెడి గుణములు ఉండును. ఆ మూడు గుణములు తలయందే యుండును. తలలో నిలయమైన గుణములతో అందరివలె భగవంతుడు ఆచరించుచున్నప్పటికి ఆయన మనవలె కర్మ బద్ధుడుకాడు. తామరాకు మీద నీరున్నను తామరాకుకు తేమ అంటనట్లు గుణములలో భగవంతుడున్నప్పటికి భగవంతునికి గుణముల ఫలితమైన కర్మ అంటదు. నిత్యము గుణములలో ఉన్నప్పటికి వాటి కల్మసమయిన కర్మ ఆయన కంటుకోలేదను అర్థము తెలియునట్లు మొదట తేనెతోను తర్వాత పాలతోను ఆ తర్వాత నీటితోను ప్రతిమను అభిషేకముచేసి మెత్తని నూలు గుడ్డతో తేమ లేకుండ తుడుచుదురు.

తామస గుణము చాలా నీచమైనది దానియందు చిక్కుకొన్నవారు అనేక అజ్ఞాన ఒడుదుడుకులకు లోనగుచుందురు. తేనె తీపుగలిగి మరియు జిగటగల్గి ఉండును. తేనె యొక్క తీపు కోసము దానిపై వ్రాలిన కీటకములు తేనె జిగురుకు చిక్కుకొని దానియందే మునిగి చివరకు మరణించును. తేనె ఏ విధముగ నున్నదో అలాగే తామస గుణభాగములోని ఆరు గుణములు ప్రపంచములో జీవునకు మాదుర్యమును చూపించునవై ఉండి ఆ గుణమునందు చిక్కుకొన్న జీవున్ని దేవుని వైపు పోకుండునట్లు చేయుచు అదోగతి జన్మలు కల్గ

చేయుచున్నవి. అందువలన తామస గుణమును తేనెతో సమానముగ పోల్చి ఆ గుణము భగవంతుని తలలో ఉండినప్పటికి దాని మాలిన్యము తల నుండి దిగజారిపోయినదని మొదట తేనెను తలమీద నుంచి క్రిందికి పోవునట్లు ప్రతిమమీద పోయుచున్నారు. తర్వాత తేనె కంటే రంగు రుచిలో ఎంతో భిన్నముగనున్న పాలను రాజస గుణముతో పోల్చి పాలను కూడ తల మీద నుండి క్రిందికి జారి పోవునట్లు పోయుచున్నారు. తేనె పాలు అయిపోయిన తర్వాత సాత్త్విక గుణముతో సమానముగ నీరును పోల్చి నీటిని కూడ అదే విధముగ పోసి తేమ కూడ లేకుండ తుడిచివేసి భగవంతునికి మూడు గుణములున్నను వాటి చేతనే పరిశుద్ధుడు అయినవాడను అర్థమును తెలియజేశారు. పూర్వమిలాగ అర్థముతో కూడుకొన్న అభిషేకముండగ నేడు అభిషేకము అర్థహీనమై పోయినది. అభిషేకములో తేనె, పాలు, నీరునేకాక నెయ్యిని పెరుగును ఉపయోగించుచున్నారు. అలా నెయ్యి పెరుగు వాడడము ఆచార విరుద్ధము. అభిషేకము ఆకారము కల్గి గుణములున్న భగవంతుడు గుణాతీతుడను ఉద్ధేశముతో చేయునది. కాని పుట్టని పరమాత్మ నిరాకారుడై గుణముతో సంబంధమే లేకున్నపుడు, అట్టివానిని ఉద్దేశించి లింగమును పెట్టినపుడు, ఆ లింగమునకు అభిషేకము చేయడములో లింగమునకే అర్థముండదు. అందువలన లింగాభిషేకము తగని పనియని, ఆకార ప్రతిమలకు కూడ తేనె పాలు నీరుతో మాత్రము అభిషేకము చేయాలని, అపుడయితేనే ఇందూ ధర్మాచరణయగునని, అలాకాక వేరు విధముగ చేయడము అధర్మాచరణయగునని, ధర్మ ప్రతిష్టాపన చేయు భగవంతునికి అధర్మములు సరిపడవని తెలియవలెను. ఇప్పటినుంచయిన అభిషేకము అర్థహీనము కాకుండ ప్రతిమలకే చేయవలెనని తెల్పుచున్నాము.

# 25. కొబ్బరి కాయ (టెంకాయ)

దేవాలయములలో కాని ఇంటిలో కాని ఎంత తెలియని వారైన కొబ్బరికాయలేనిది పూజ చేయరు. కొబ్బరికాయ కొట్టితేనే పూజయను భావము చాలా మందికున్నది. టెంకాయను ప్రతిమ ముందర ఎందుకు కొట్టుతారు? అని కొందరిని అడిగితే, టెంకాయను దేవునికి అర్పితము చేసి దానిని మనము ప్రసాదముగా తీసుకోవడానికి ముఖ్యమైనదని తెలిపినారు. టెంకాయ ఎందుకు ముఖ్యమైనది? ఇతర కాయలు ఎందుకు పగులకొట్టకూడదు? అని అడిగితే దానికి సరైన సమాధానము చెప్పక పెద్దలు చేసినట్లు చేయవలయునుకాని వివరించి అడుగ కూడదు అని అంటున్నారు. ఇంకను కొంతమందిని కొబ్బరికాయకు పీచు అంతా పెరికి పైన జుట్టు కొంచెము పెట్టుచున్నామే ఆ కొద్దిగా ఎందుకు ఉంచవలయును? అని అడిగితే పూర్వము నుంచి వచ్చే పద్ధతినే చేయవలెను కాని దానిని విమర్శ చేయకూడదన్నారు. వారికి తెలియక అట్లన్నారుగాని టెంకాయలో ఎంతో అర్థము ఉన్నది. ఆ అర్థము తెలుసుకోలేక దానిని పూజా సాధనముగ పెట్టుకొని దేవునితో బేరములు ఆడుచున్నాము. టెంకాయ యొక్క సారాంశము తెలుసుకుంటే భక్తి ఎంతో బాగుండేది. దాని సారాంశము తెలియక కొంతమంది భక్తులు ఒకరు నాలుగు, ఒకరు రెండు, డబ్బున్నవారు ఇంకా ఎక్కువ కొట్టుచున్నారు. ఎక్కువగా టెంకాయలు కొట్టితే భక్తి, లేకపోతే భక్తికాదా? ఏమి లేని బీదవాడు టెంకాయ కొట్టలేకపోతే వానిది భక్తి కాదంటామా?



కొబ్బరి కాయ

దేవుడు ఒప్పుకోడంటామా? అన్నిటికి ముఖ్యమైనది మనస్సు. ఏది లేక పోయినా మనసుంటే అంత కంటే నాకు ప్రియులులేరని దేవుడు గీతయందు చెప్పి ఉన్నాడు. అయితే టెంకాయ పూజా విధానములో ఎందుకు చోటుచేసుకొన్నది, దాని ప్రత్యేకత ఏమంటే? టెంకాయ కూడ పరమాత్మను తెలుసుకొనుటకు చిహ్నముగ ఉపయోగపడుచున్నది. కావున పూర్వము పెద్దలు టెంకాయను దేవాలయాలలో ఉపయోగించినారు. కొబ్బరికాయతో అజ్ఞానులు జ్ఞానులుగా మారుదురని పెద్దలు ఈ పనిని చేసినారు. కాని కాలక్రమేణ దాని అర్థము పోయినది. దాని అర్థము

తెలియజేయువారు పోయినారు. ఈ కాలములో కొబ్బరికాయ మానవులకు దేవునికి మధ్య వ్యాపార వస్తువుగా మారిపోయినది.

టెంకాయచుట్టు ఉన్న పీచునంత తొలగించగా కాయ మూడు భాగములుగా కనిపించుచున్నది. కాయ మీద ఉన్న మూడు సారలు కాయను మూడు భాగములుగ కనుపించునట్లు చేయుచున్నవి. ప్రతి భాగముపైన కన్ను మాదిరి ఒక తగ్గు ఉన్నది. మూడు భాగములకు మూడు కన్నులున్నవి అందువలన టెంకాయకు ముక్కంటని పేరు వచ్చినది. టెంకాయకున్న మూడు భాగములకు పైన జుట్టుగా కొంత పీచు నిలుపుచున్నాము. చివరన ఉండె ఈ జుట్టుకు ప్రత్యేకత ఉన్నది. టెంకాయ జుట్టును పైకి చేసి దానిమీద ఉన్న పెద్దకడుపును (పెద్ద భాగమును) మనకు ఎదురుగా పట్టుకొని చూచిన పెద్ద భాగమునకు రెండు వైపులా రెండు భాగములు ఉండునుకదా, ఆ భాగములపైన కన్నులు (గుంతలు) ఉన్నవి కదా! కుడి వైపు ఉన్న భాగమును సూర్యనాడి అనియు, ఆ భాగమునకు పైన ఉన్న కన్నును ఆ నాడీ కేంద్రమనియు, ఎడమ ప్రక్క ఉన్న భాగము చంద్రనాడి అనియు, ఆ భాగము పైన ఉన్న కన్నును ఆ నాడీ కేంద్రమనియు, రెండు భాగములకు మధ్య పెద్ద భాగమై ఉన్న దానిని బ్రహ్మనాడి అనియు, ఆ భాగముపైన ఉన్న కన్నును ఆ నాడీ కేంద్రమనియు తెలుసుకోవలెను. సూర్య, చంద్ర, బ్రహ్మ నాడులు ఏకమయినపుడే జ్ఞానముద్భవించును. ఆ తర్వాత జీవుడు దేవుడుగా మారిపోయి చావు పుట్టుకలు పొందక పోవును. ఈ మూడు నాడులనొక్కటి చేసినవాడు యోగి అని తెలుపుటకు టెంకాయమీద కూడ మూడు భాగములనుండి ఏకముగ జుట్టు పెట్టబడినది. మూడు నాడులు ఏకము అయినవాడు జన్మలు లేక ఆత్మయందు ఐక్యము చెందును.

కావున మూడు భాగముల నుండి ఏకముగా మారిన జుట్టుకొన భాగము ఆకాశమును చూపుచున్నది. జీవుడు ఏ ఆకారములేని దానియందు ఐక్యమగును. కావున జుట్టుకొన కూడ ఏ ఆకారములేని ఆకాశమును చూపుచున్నది. మూడు నాడులు ఏకము చేసినవాడు జ్ఞానము చివరి భాగమునకు చేరియుండును. కావున టెంకాయ జుట్టుకు కూడ "జ్ఞాన శిఖ" అని పేరు వచ్చినది. జ్ఞానశిఖ అనగా జ్ఞానమునకు చివరి భాగము అని అర్థము. వివేకవంతులయిన బ్రాహ్మణులు వారి తలల మీద జుట్టు నెందుకు పెట్టుచున్నారనగా! జ్ఞానశక్తి నిలువ ఉండు చోటు శరీరమునందు తలయొక్కటే, కావున జ్ఞానశక్తి ఉన్న బ్రాహ్మణులు బాహ్యార్థమై తలలో ఉండు వెంట్రుకలన్నియు తీసి శిఖను మాత్రము ఉంచుచుండిరి. తలయే జీవునకు స్థానము, దానియందే తలంపులు ఉద్భవించుచున్నవి. బ్రహ్మజ్ఞానులు తలంపులను జయించి ఉందురు. కాబట్టి వారు మాయందు ఏ తలంపులు లేవను భావనలో బాహ్యార్థముగా తల మీద వెంట్రుకలు తీసివేయుచున్నారు. అట్లే టెంకాయకు కూడ చుట్టు ఉన్న పీచు పెరుకబడుచున్నది. తలలోనే బ్రహ్మనాడి యొక్క ఏడవ కేంద్రము ఉన్నది కదా! దాని ద్వారానే జీవుడు బ్రహ్మమందు ఐక్యము కావలెను. బ్రహ్మనాడి శరీర మధ్యభాగమున ఉన్నది. తల మీద కూడ దాని స్థానము మధ్యనే ఉన్నది. కావున జ్ఞానశక్తి ఉన్నవారు తమతల మీద మధ్య భాగములో జ్ఞానశిఖ అను పేరుతో కొన్ని వెంట్రుకలు విడిచి వేయుచున్నారు. అట్లే టెంకాయకు కూడ పైన జుట్టు విడుచుచున్నారు. పూర్వము ఈ విధముగా చేయుచుండిరి. కాల క్రమమున జుట్టును ఎక్కడ పెట్టవలెనని తెలియక, ఎవరు పెట్టుకోవలెనని తెలియక, ఎందుకు పెట్టుకోవలెనని తెలియక చాలా మంది

పొరపడుచున్నారు. బ్రహ్మజ్ఞానియైన ఈశ్వరుడు తన తల మీద ఉన్న వెంట్రుకలను విచ్చలవిడిగా లేకుండ జ్ఞానశిఖగా ముడివేసినాడు. ఆ ముడి ఈశ్వరుని తల మధ్య భాగమున ఉన్నది. అట్లే ఎందరో మహర్షులు కూడ జ్ఞానశిఖను తలమీద మధ్య భాగమున ఉంచినారు. ఇట్లు ఎందరో జ్ఞానులు తమ సూర్య, చంద్రనాడులను బ్రహ్మనాడియందు ఐక్యము చేసి దాని బాహ్యార్థము తలలమీద బ్రహ్మ స్థానమయిన మధ్య భాగమున వారి వెంట్రుకలను ముడి వేసినారు. బ్రహ్మ స్థానము చిన్న పిల్లల తలమీద ప్రత్యక్షముగ చూడవచ్చును. ఒక సంవత్సరము లోపల పిల్లల తల మధ్య భాగమున బ్రహ్మనాడి స్పర్శను చూడవచ్చును. ఆ భాగముననే జ్ఞానశిఖను జ్ఞానులు వేయుచుందురు. జ్ఞానశిఖ ఈ కాలములో చాలా మందికి తల మధ్య భాగమున లేక కొంచెము వెనుకకు పోయి ఉన్నది. బయట జ్ఞానశిఖ ఎక్కడున్నను పరవాలేదు. మనకు లోపల ముఖ్యమైన జ్ఞానమున్న చాలు. టెంకాయను పరిశీలించితే ఎంత అర్థముందో చూడండి. టెంకాయను జ్ఞాన స్వరూపమైన విషయముగా భావించవలెను.

అగ్ని నుండి చిన్న చిన్న అగ్ని రవ్వలు బయల్పడినట్లు పరమాత్మ నుంచి జీవుడు బయల్పడినాడు. ఒకే అంశ అయినప్పటికి జీవుడు దేవుడనివేరైనారు. ఈ విధముగానే ఆత్మ స్వరూపమైన టెంకాయను కొట్టగా రెండు చిప్పలుగా పగిలి పోవుచున్నది. అందులోనొక చిప్పకు జ్ఞానశిఖ మిగిలి పోవుచున్నది. రెండవచిప్పకు ఏమీ మిగలక పోవుచున్నది. జ్ఞానశిఖ మిగిలిన చిప్ప ఆత్మగాను, జ్ఞానశిఖ లేకుండ మూడు భాగములుగానే మిగిలియున్న రెండవ చిప్ప జీవాత్మగాను పరిగణింప బడుచున్నవి. టెంకాయను రెండు చిప్పలుగా దేవుని ముందు పగులగొట్టి ఒకే పరమాత్మ అంశనుండి నీవు నేను వేరైనామను బాహ్యార్థముగా

చూపుచున్నాము. ఈ విధమైన భావముతో పూర్వము జ్ఞానులు చేయుచుండిరి. ఇపుడు కొంత మంది ఏ భావము లేకున్న కోరికలు మాత్రము చాలా పెట్టుకొని టెంకాయలు చాలా కొట్టుచున్నారు. టెంకాయను కొట్టువారందరు దాని యొక్క ప్రాముఖ్యతను తెలుసుకుంటే ఎంతో శ్రేయస్కరముగా ఉండును.

టెంకాయను పగులకొట్టగా రెండు భాగములగు చున్నవి కదా! ఆ రెండు చిప్పల లోపలి భాగమున తెల్లని రంగు కల్గి ఏ కల్మషము లేక ఉండును. దాని అర్థమేమనగ నీవు దేవునివి, నేను జీవున్ని, నీవు ఏ గుణములు లేక నిష్కల్మషముగా ఉన్నావు. నేనునూ నీ మాదిరే ఏ కోర్కెలు ఏ తలంపులు లేక నిష్కల్మషముగా మారి ఉన్నానని, బాహ్యార్థముగా తెలియచేయుటకై రెండు చిప్పలు తెల్లగా ఉన్నవి. ఈ విధముగ జ్ఞానులు టెంకాయలు పగులకొట్టి బాహ్యార్థముగా చూపించినారు. మరియు రెండుగ మారిన నీవు నేను ఏకము కావలెనని బాహ్యార్థముగానే రెండు చేతులు కలిపి చూపించారు దానినే మనము నమస్కారము అనుచున్నాము. ఎడమ హస్తము ఆత్మ అనియు, కుడి హస్తము జీవాత్మ అనియు ఆ రెండు హస్తములు జోడించడము జీవాత్మ ఆత్మలు ఐక్యము చేయడమనియు తెలుసుకోవలెను. పూర్వము తెలిసినవారు నోటితో నేమి మాట్లాడక వారిలోయున్న భావమును టెంకాయ ద్వారా నమస్కారము ద్వారా బాహ్యార్థముగా దేవునికి తెలియజేయుచుండిరి. ఈ కాలములో అనేక విధ కోర్కెలతో పవిత్రమైన టెంకాయలను అపవిత్రము చేయుచున్నారు. రెండు చేతులు జోడించి చూపడములో జీవాత్మ ఆత్మ ఐక్యార్థము ఉందని తెలియక చేతులు జోడించి నిలబడి అనేకములైన కోర్కెలు కోరదగినవి, కోరరానివి కోరుచున్నారు.

టెంకాయకు ఉన్న కన్నులలో ఒక కన్నుకు మాత్రము రంధ్రము పడును. మిగతా వాటికి ఎందుకు పడడము లేదు? మరియు దానిలోని నీళ్లను అందరు తీర్థముగా పుచ్చుకొనుచున్నారు. దాని ఫలితము ఏమై ఉండును? అనియు కొంతమందికి అనుమానము రావచ్చును. దానికి నా సమాధానము జీవుడు పరమాత్మను చేరవలయునంటే తన మధ్యన ఉన్న బ్రహ్మనాడియందే ఐక్యము కావలెను. కావున టెంకాయ కన్నులందు కూడ బ్రహ్మనాడి అనిపించుకొన్న పెద్ద భాగముపైన ఉన్న కన్నే రంధ్రముపడును. మిగత నాడులయందున్నపుడు మరణించిన జీవుడు ఆత్మను చేరలేడు. కావున టెంకాయ మిగతాకన్నులు గట్టిగా ఉండి రంధ్రములుపడవు. మనము చేసిన పూజ యొక్క ఫలితము టెంకాయలోని నీటిని ఆవహించి ఉండును. కావున దానిని తీర్థముగా పుచ్చుకొనుచున్నారు. ఎవరు ఎంత భావముతో పూజ చేసి ఉందురో, అంత శక్తియేవారు తీసుకొన్న తీర్థమందు ఉండును. కావున భావములేని పూజ వ్యర్థము. దీని వలన తీర్థమనగా శక్తితో కూడుకొని ఉన్నదని తెలియుచున్నది. పూజా విధాన భావము తెలియక దానిలోని భక్తిని అనుసరించక చేసిన పూజయితే తీర్థము కూడ శక్తిలేనిదగును.

టెంకాయను కొట్టునపుడు జుట్టును క్రిందివైపుగా పట్టుకొని చాలా మంది కొట్టుచున్నారు. అట్లు కొట్టుట సరియైన పద్ధతికాదు. టెంకాయను కొట్టునపుడు జుట్టును పైకి ఉంచి చూపి కొట్టవలెను. ఈ విధముగా కొట్టగా కుడిచేతియందు క్రింద చిప్ప మిగులును. జుట్టు ఉన్న చిప్ప ఎడమ చేతియందు మిగులును. తిరిగి కుడి ఎడమ చేతులు కలిపి చూపించడమే నన్ను నీలోనికి చేర్చుకొమ్మను భావము. ఈ విధముగా సరైన భావముతో పూజ చేసిన ఆ పూజయందు జ్ఞానశక్తి లభించును.

జ్ఞానము వలన ముమ్ముందులో సరైన మార్గములను తెలుసుకొని యోగసాధనలు చేసి దేవునియందు ఐక్యము కావచ్చును. ఆ విధముగాకాక భావము లేని పూజ వ్యర్థము. టెంకాయకు పెట్టిన డబ్బులు కూడ వ్యర్థమే. టెంకాయలోను, గంటలోను, నమస్కారములోను ఎంతో అర్థము ఉన్నది. దానిని తెలుసుకోజాలక ఇతరులు చేస్తూ ఉంటే మేము చేస్తున్నామంటే ఏ ప్రయోజనము ఉండదు.

బ్రహ్మవిద్యయందు ప్రవేశమున్నవారు టెంకాయను గురించి చెప్పుచుండుట విన్నాము. అందువారు టెంకాయను మూడు భాగములను మూడు గుణములుగా భావించి చెప్పుచున్నారు. మూడు గుణముల జయించక ఇంకా కొద్దిగా గుణములు ఉన్నవారు టెంకాయకు కూడ జుట్టు కొద్దిగా పెట్టుచున్నారు. మరియు వారు కూడ తమ తలల మీద కొద్దిగా జుట్టు ఉంచుకొనుచున్నారు. పూర్తి గుణములు జయించి గుణాతీతులై ఉన్నవారు జుట్టును ఏ మాత్రము పెట్టుకోక తీసివేయు చున్నారు. వారు టెంకాయకు కూడ జుట్టు పెట్టకుండ అంతయు పెరికి కొట్టుచుందురు అని తెలిపి ఉన్నారు. ఆ మార్గముగా టెంకాయను భావించిన ఆ భావములో అనేక సంశయములు బయలుదేరును. ఎంత వెదకిన ఆ సంశయములకు సమాధానములు దొరకుటలేదు. కావున ఆత్మయే ఊహకందించి తెలిపిన దానిని నేను తెలుపుచున్నాను. ఈ మార్గమున పోయిన ఒక్క సంశయము కూడ బయలుదేరదు. ఒకవేళ బయలు దేరిన అందులకు సమాధానము వెంటనే లభించును.



# 26. తల వెంట్రుకలు సమర్పించుట

దేవాలయములలోని ఆరాధనలలో తల వెంట్రుకలు తీయించుకొని గుండు చేసుకొనుట ముఖ్యమైనదిగా ఉన్నది. పూర్వ కాలములో తెలిసిన పెద్దలు భావసహితముగ తల మీద వెంట్రుకలు తీసివేసి తలను గుండు చేయించుకొనెడివారు. అలా దైవ సన్నిధిలో వారి మనస్సులో ఉన్న ఉద్దేశమును ఆచరణ రూపముగ చూపించినారు. ఆ ఆచరణ యొక్క భావము పూర్వపు పెద్దలతోనే అంతరించి పోయినప్పటికి ఆచరణ మాత్రము ఆనాటికంటే ఈనాడే ఎక్కువగ ఉన్నది. చిత్తశుద్ధి లేని శివపూజ లేల అన్నట్లు భావ శుద్ధి లేని ఆచరణ కూడ ప్రయోజనము లేదు. పూర్వము కంటే నేటి కాలములో భక్తి ఎక్కువగ కనిపిస్తున్నప్పటికి భక్తిలో చేసే పనులకు అర్థములేకుండ పోయినది. దేవ స్థానములో గుండు చేయించుకొన్న వారి దగ్గరకు పోయి నీవెందుకు గుండు గీయించుకొన్నావని ప్రశ్నించినట్లయితే వారి వద్ద నుంచి వచ్చు సమాధానము నాకోర్కె నెరవేరింది నా మొక్కుబడిగ గుండు గీయించుకొని వెంట్రుకలు సమర్పించామంటారు. నీకు కోర్కె నెరవేరింది కాని నీవిచ్చే వెంట్రుకలతో దేవునికేమిటి లాభము. దేవునికి మొక్కుబడిగ ధన మివ్వవచ్చు, దాన్యమివ్వ వచ్చును, వెంట్రుకలివ్వడమేమిటని ప్రశ్నించిన ఎడల అందరు చేసినట్లు నేను చేస్తున్నాననడము తప్ప సరియైన సమాధానముండదు. అందరు దేనికి చేస్తున్నది ఎవరికి తెలియదు. ఒకరిని చూచి మరొకరు చేస్తున్నారే తప్ప ఎదుటివాడు ఎందుకిలా చేస్తున్నాడను వివరము తెలుసుకోలేక పోయినారు. ఈ విషయములో అందరికి పూర్తిగ అవగాహన లేకుండ పోయిందనియే చెప్పవచ్చును.

చేసేవానికి తెలియదు చూచే వానికి తెలియదు కావున చూచేవాడు చేసేవానిగ మారిపోవుట గుండు గీయించుకొనుట అర్థము లేని భక్తి అయినది.

పూర్వ కాలము నిజమైన భక్తి కలవారుండెడివారు. వారు దైవ భక్తి విషయములో ఎంతో అర్థముతో కూడిన పనులు చేసెడివారు. ఆ కాలములో వారు దేవాలయములలో జ్ఞానయుక్తమైన భావములతో మెలగెడివారు. దేవాలయములలో ఏ కోర్కెలు కోరేవారు కాదు. గోపురము వద్ద ఉన్న కోర్కెలను ద్వజస్థంబము వద్దే లేకుండ చేసుకొనెడి వారు. ఒక వేళ ఏ ఆలోచన ఉండిన చివరకు గంటా నాధములో మనస్సును కలిపి మనస్సు నిర్మలముగ చేసి దేవుని మీద లగ్నము చేసెడివారు. మనస్సులో కోర్కెలున్న లేకుండ చేసుకొనే దానికి దేవాలయములకు వచ్చి అక్కడున్న ఆధ్యాత్మికతను పెంచుకొనెడివారు. ఇంకా జ్ఞానులైనవారు మనస్సులో ఏ కోర్కెలు లేవని ఆచరణలో తెలుపుకొనెడి వారు. అట్లు దేవునికి విన్న వించుకోవడమే గుండు గీయించుకోవడము. ఒకప్పుడు జ్ఞానము తెలిసిన భక్తుడు తిరుపతి వెంకటేశ్వర ఆలయమునకు పోయి కోర్కెలకు ఆలోచనలకు తల నిలయమైనదని తలచి, తలలోని ఆలోచనలు లెక్కలేనన్ని తల మీద వెంట్రుకల వలె ఉండునని తలచి, నీ సన్నిదానమునకు వచ్చిన నాకు ప్రపంచ సంబంధమైన ఏ కోర్కెలు లేవని దేవునికి తెలుపుకొనునట్లు తల మీద వెంట్రుకలన్ని తీయించి గుండు గీసుకొని నేను సంకల్ప రహితుడనైనాను, తల మీది వెంట్రుకలవలె తలలోపల కోర్కెలుండుట సహజమే, నేను నా తలలోని కోర్కెలను లేకుండ చేసుకొన్నానని నీకు తెలుపుటకు బాహ్యార్థముగ నా తల వెంట్రుకలు లేకుండ చేసుకొన్నానని

తన గుండును తలవంచి గుడిలోని దేవునికి చూపాడట. ఆ దృష్యమును వివరము తెలియని మరొకడు చూచాడు. అలా చేయుట వలన ఎదో లాభమొస్తుందనుకొని, అందువలననే అతడు అలా చేసాడనుకొని, నాకు లాభము వస్తే నేను గుండు కొరిగించుకొంటానని మ్రొక్కుకున్నాడు. అలా ఆవిధానమును కోర్కెలు కోరుటకని, దేవుడు కోర్కెలు నెరవేర్చువాడని, ఆ పని చేసినందుకు ప్రతి ఫలముగ తల వెంట్రులనీయ వలెనని అందరనుకోవడము జరుగుచున్నది. పూర్వపు జ్ఞానము మాసి పోయినందువలన దేవునికి మనకు మద్యన తల వెంట్రుకలు లంచముగ మారాయి. తలంపులు పోయాయనుటకు గుర్తుగ పూర్వము తలను బోడి చేయించుకొంటే నేడు ఆ పద్ధతి ఏ మాత్రము లేకుండ గుండుచేయించు కొంటున్నారు. కావున వేమన యోగి తన పద్యమందు తలలు బోడియైన తలంపులు బోడియగునా అన్నాడు.

ఆ రోజు కోర్కెలు లేవు అను ఉద్దేశముతో వారు తలబోడి చేసుకోగ నేడు కోర్కెల గల్గి అవి నెరవేరితే గుండు చేయించు కుంటామని మ్రొక్కి నెరవేరితే చేయించుకోవడము విపరీతమైన తప్పు పద్దతి కదా! తప్పు పద్ధతిగ కోరడమేకాక కోరరాని కోర్కెలు కూడ కోరుచున్నారు. అన్నదమ్ములు చనిపోయెట్లచేసి ఆస్తి అంతా నాకే వస్తే వెంట్రుకలు కొరిగించు కొంటాననడము, అత్తగారికున్న ఒక కొడుకును చనిపోయెటట్లు చేసి అత్తగారి ఆస్తంత నాకే వస్తే నీకు మ్రొక్కుబడిగ తల వెంట్రుకలిస్తా మనడము, విద్యార్థులు చదవకుండిన పాసయ్యేటట్లు చేస్తే గుండు చేయించుకొంటానని మ్రొక్కడము కూడ జరుగుచున్నది. పూర్వము పెద్దలు కోర్కెలు లేని పద్దతిగ గుండును చేయించుకొంటె నేడు గుండు చేయించు కొంటానని మ్రొక్కి విపరీత కోర్కెలు కోరుట చూస్తే ధర్మాలు

అధర్మాలుగ మారినట్లేననిపిస్తుంది ఇపుడు అధర్మాలుగ ఉన్న ఆచరణలను తిరిగి ధర్మాలుగ మార్చుకొని సరియైన పద్ధతిని మనమైన అనుసరిద్దాము.



# 27. నమస్కారము

దైవారాధనలో నమస్కారము చాలా ముఖ్యమైనది. రెండు హస్తములు జోడించి చూపడమును నమస్కారమంటున్నాము. ఎదుటి వారి ఎడల పూజ్య భావమును గౌరవ భావమును చేతుల ద్వార ప్రకటించడమునే నమస్కారమని కొందరంటున్నారు. ఇప్పటికది నిజమేయైనప్పటికి పూర్వపు పెద్దలలో మరికొంత వేరు భావముండెడిది. రెండు విడివిడిగ ఉన్న చేతులను దేవాలయములలోని ప్రతిమల ముందర చూపెడివారు. ఇంత వరకు నేను నీవు వేరు వేరుగ ఉన్నాము. ఇప్పటి నుండి నేను నీతో కలిసి పోవాలను కొంటున్నాను అనుభావముతో విడివిడిగ ఉన్న చేతులను జోడించి చూపెడివారు. నమస్కారము ఆనాటి వారి భావములో జీవ బ్రహ్మైక్య సందానముగ లేక మోక్షముగ ఉండెడిది. పూర్వము జ్ఞానము తెలిసిన వారుండిరి కావున వారికి గుడిలోని దేవుడే జ్ఞానశక్తి కల్గిన వారి శరీరములలో ఉన్నాడను భావముండెడిది. అందువలన జ్ఞానిగాని గురువు గాని ఎదురు పడినపుడు వారిలో కూడ దైవత్వముందను భావము కల్గి ఆ దైవమునకు నమస్కరించెడివారు. ఆ సాంప్రదాయము ఇప్పటికి ఉన్నను వారిలోని దేవునికి నమస్కరిస్తున్నానను భావమే లేదు. ఎదుటి వానితో పని జరుపుకొనుటకు లేక ఎదుటి వానిని అనుకూలముగ మార్చుకొనుటకు నమస్కారము చేయడము జరుగుచున్నది.



నమస్కారము

పూర్వము జ్ఞానము కల్గినవారు ప్రతి మనిషిలోను జ్ఞానమును బట్టి దైవమును చూచెడివారు. ఇపుడు ప్రతి మనిషిలోను జ్ఞానమును చూడకుండ ప్రపంచపు హోదాను చూస్తున్నారు. పూర్వము జ్ఞానమును బట్టి పూజ్య భావముంటే ఇపుడు హోదాను బట్టి పూజ్య భావమున్నది. పూర్వము తమ కాలు ఇతరులకు తగిలిన వారి శరీరములో కూడ దేవుడున్నాడను భావముతో వెంటనే నమస్కారము చేసెడివారు. ఇప్పటికి కొన్ని చోట్ల ఆ ఆచారమున్నది. ఎక్కడ ఏ భావముండినప్పటికి దేవాలయములోని నమస్కారమునకు నన్ను నీలోనికి కలుపు కొమ్మని చేతులు జోడించడమని తెలిసితే గుడిలో చేసిన నమస్కారమునకు విలువ అర్థముంటుంది. అలా కాక పోతే రౌడీలకు గుండాలకు రాజకీయ నాయకులకు పోలీసులకు చేసిన నమస్కారముతో సమానముగ ఉండును. అలా కాకుండ దేవాలయములోని నమస్కారము ప్రత్యేకమైనదని తెలియాలి.



# 28. శఠగోపము

ఆలయ పూజలో భక్తులకు పూజార్లు శఠగోపము తల మీద ఆనించి పంపుచుందురు. టోపీ ఆకారము గల శఠగోపము తల మీద పెట్టించుకోవడము భక్తులకు ఒక విధమైన తృప్తియే గాని దాని వలన ఫలితమేమి? ఏ ఉద్దేశముతో ఈ కార్యమును పెట్టారు అని శఠగోపము పెట్టువారు గాని పెట్టించుకొనువారు గాని యోచించడములేదు. కొన్ని ఆలయములలోశఠగోపమే లేదు. తిరుపతి మొదలైన కొన్ని పెద్ద ఆలయములలో మాత్రమే శఠగోపము ఉండుట ఉపయోగించుట జరుగుచున్నది. అంతకూ ఈ శఠగోపమేమిటో కొంత వివరించు కొందాము. ఒక వస్తువును కనిపించకుండ దాచుకొనుటను గోప్యముగ ఉంచడము అంటాము. ఉన్న దానిని రహస్యముగ బయటికి కనిపించకుండ చేయడమును గోప్యముగ నుంచడమే అగును. రహస్యముగ ఉంచినది ఒక వస్తువుగావచ్చు లేక ఒక విషయము కావచ్చు. కొందరు తన యందుగల విషయమును ఎవరికి తెలియకుండ బహుగోప్యముగ నుంచగలరు. గోప్యము అనుపదము దాని అర్థము ఇప్పటికి ఉన్నను దేవాలయములలో మాత్రము గోప్యము పోయి గోపము అయింది. పూర్వము శఠగోప్యము అను పదము నేడు శఠగోపమయినది.

కొన్ని ప్రాముఖ్యమైన దేవాలయములలో శఠగోపము భక్తులకు తలమీదనే పెట్టి పంపుచుందురు. పెద్దలు దీవించిన శఠగోపముంచిన తల మీదనే ఎందుకనగా మన తలలోనే గుణములు వాటి వలన వచ్చు కర్మ మొదలగునవన్నియు ఉన్నవి. ఆలయములో పూజానంతరము భక్తునికి తల మీదనే శఠగోపమునుంచడములో అంతరార్థము ఏమనగా!

మన శరీరములో పైన తలలోనే కర్మజనిత గుణములున్నవి. ఆ గుణములు మంచివి చెడువి అను రెండు విధములుగ విభజింపబడి ఉన్నవి. అందులో చెడువి ఆరు గుణముల గుంపుగను, అట్లే మంచివి ఆరు గుణముల గుంపుగను ఉన్నవి. అనగ మంచి చెడు గుణములు ఒక్కొక్కటి శట్ వర్గములుగ విభజింపబడియున్నవన్నమాట.కామ, క్రోధ, లోభ, మోహ, మధ, మత్సరములనెడి చెడు గుణములు ఆరు ఒక శట్ వర్గము కాగ దాన, దయ, ఔదార్య, వైరాగ్య, వినయ, ప్రేమ లను మంచి గుణములు ఆరు ఒక శట్ వర్గము అయినవి. శట్ అనగ ఆరు, వర్గము అనగ గుంపు అని తెలియాలి. చెడు శట్ వర్గము వలన పాపము, మంచి శట్ వర్గము వలన పుణ్యము రావడము సత్యము. పరమాత్మలోనికి ఐక్యము కావాలంటే మంచి చెడు కర్మ ఫలములు రెండు లేకుండ పోవాలి. అందువలన గుడిలోనికి పోయిన భక్తునికి చిన్న టోపీలాంటి పరికరమును తల మీద ఉంచి రెండు రకములయిన కర్మలు నీవు లేకుండ చేసుకోవాలను సందేశమిచ్చునట్లు శట్ గోప్యము అనెడివారు. పూర్వము ఒక్క భక్తుని తల మీద తలకు సరిపోవునంత వెడల్పు గల పరికరమును రెండు మార్లు తాకించెడివారు. ఈ కాలములో ఒక మారే తాకించుచున్నారు. ఒక మారు తాకించుట అశాస్త్రీయమైన పని. రెండు మార్లు తాకించడములో అర్థము గలదు. ఒక మారు తాకించినపుడు శట్ గోప్యము అని, రెండవమారు తాకించి శట్ గోప్యము అనెడివారు. అలా రెండు మార్లు తాకించి రెండు మార్లు శట్ గోప్యము అనడములో అర్థము ఏమనగా! ఒక మారు తాకించినపుడు నీ తలలోని చెడు గుణముల గుంపు ఆరు పైకి కనిపించకుండ పోవలెనని శట్ గోప్యము అనెడివారు. అలాగే రెండవ మారు తాకించినపుడు నీ

తలలోని మంచి గుణముల గుంపు కూడ గోప్యముగ ఉండి పోవలయునను ఉద్దేశముతో రెండవ మారు కూడ శట్ గోప్యము అనెడి వారు. అలా ఉపయోగించు పరికరము పలానా దానికి ఉపయోగించు చున్నామని ఎల్లకాలము గుర్తుండునట్లు దానికి శట్ గోప్యము అని పేరు పెట్టారు. దాని పేరు అలా కొంత కాలమునకు శఠగోప్యముగ మారిపోయినది. కాల క్రమమున శఠగోపము అను పేరుతో ఇప్పటికి కొన్ని దేవాలయములలో ఉన్నది. శఠగోప్యము శఠగోపముగ పేరులో మార్పు కల్గిన ఆచారములో రెండు మార్లు తల మీద పెట్టుట పోయి ఒక మారే పెట్టు ఆచారమొచ్చిన అర్థము మాత్రము పూర్తి లేకుండ పోయినది. ఇలా ఇందువుల ఆచారము ఎంతో నాశనమయి కొంత పేరుకు మాత్రము మిగిలి ఉన్నవి. అలా ఉన్నవాటికి తిరిగి ఊపిరి పోయాలంటే శఠగోపమునకు శట్గోప్యమను పేరు పెట్టి, ఒక్కమారు తల మీద పెట్టుట మాని రెండుమార్లు తల మీద పెట్టి, రెండు మార్లు తల మీద పెట్టినపుడల్లా గుణములగుంపు పోవాలని తలచవలెను. దేవాలయ పూజలలో అంతరార్థము భక్తుడు దేవునియందైక్యమగుటకయితే, శఠగోపము తల మీద రెండు మార్లు ఉంచడము మంచి చెడు రెండు రకముల గుణములు అనగి పోయినపుడు నీవు నాయందైక్యమగుదువను అర్థము దేవుడు భక్తునికి తెల్పునదగును. ఎంతో అర్థముతో మన పెద్దలుంచిన ఆచారములను నేటి కాలములో ఎవరు తెలుసుకోక పోవడము విచారకరము.



# 29. ప్రదక్షణలు

దేవాలయ పూజా విధానములో ప్రదక్షణలు చేయడము కూడ కలదు. పూర్వ కాలము ఐదు చుట్లు మాత్రము ప్రదక్షణ చేసెడివారు. ఈ కాలములో లెక్కలేనన్ని చేయువారు కలరు. ప్రపంచమంతయు పరమాత్మ శక్తి ఆవహించి ఉన్నది. "మయాధ్యక్షేణ ప్రకృతి స్సూయతే సచరాచరమ్" అన్నట్లు ప్రకృతి కంతయు పరమాత్మ అధ్యక్షతవహించి ఉన్నది. పరమాత్మను ఆధారముగ చేసుకొని ప్రకృతి ఉన్నది. ప్రపంచమను చక్రము పరమాత్మను ఇరుసుగ చేసుకొని తిరుగుచున్నది. ప్రకృతి ఐదు భాగములుగ విభజింపబడి ఉన్నది. ప్రకృతి ఐదు భాగములలోనే సర్వ జీవులు చిక్కుకొని ఉన్నవి. అందువలన నీవు ఇరుసుగ ఉన్నావు, నేను ప్రకృతి చక్రములో చిక్కుకొని తిరుగుచున్నానని. ఆ ప్రకృతి ఐదు భాగముల నుండి నన్ను విముక్తుని చేయమని ప్రదక్షణలు చేయుట పూర్వము ఆచారముగ ఉండెడిది. పూర్వము ప్రతిమముందర బయలుదేరి ప్రతి చుట్టు చక్రమువలె తిరిగి ప్రకృతి చక్రములో మొదటిదయిన ఆకాశము నుండి నన్ను విముక్తుని చేయమని ప్రతిమముందర కోరుచుండెడివారు. అట్లే రెండవ పర్యాయము చుట్టివచ్చి రెండవ భాగమైన గాలి నుండి రక్షించమని కోరెడివారు. మూడవ మారు చుట్టి అగ్ని నుంచి రక్షించమని, నాల్గవ పర్యాయము తిరిగి నీటి నుంచి రక్షించమని, ఐదవ పర్యాయము తిరిగి భూమి నుండి రక్షించమని కోరుచుండిరి. పంచ భూతముల నుండి విముక్తుని చేసి నీయందైక్యము చేసుకొమ్మని కోరుటయే పంచ ప్రదక్షణలని తెలియవలయును. ఇప్పటి కాలములో ప్రతిమ చుట్టు తిరుగుచున్నారు. కాని ఎన్ని చుట్లు తిరుగవలె

ఏమి కోరవలెనని తెలియక ఒక ప్రక్క ప్రపంచ విషయములను ఇతరులతో మాట్లాడుతునే ప్రదక్షణలు చేయుచున్నారు. లెక్కకిన్ని చేయవలయునను భావన తప్ప ఎందుకు చేస్తున్నామను ఆలోచనయే లేదు. కొందరు మూడు చుట్లు తిరిగి ముగించుచున్నారు. కొందరు ఐదు కంటె ఎక్కువ చుట్లు తిరుగుచున్నారు. ఐదు కంటె ఎక్కువ కాని తక్కువ కాని అర్థహీనము. అర్థముతో కూడుకొన్న ప్రదక్షణలు ఐదు మాత్రము చేయవలెను. తెలియనివారికి కూడ అర్థమిదియని తెల్పి ఆచరించునట్లు చేసిన భక్తిమార్గము ఆరాధనపద్ధతి సాఫల్యముకాగలదు.



# 30. కర్పూరము

పూర్వము భక్తులు దేవాలయములోనికి పోయి గంటనుకొట్టి, టెంకాయను పగులగొట్టి, చేతులు జోడించిన తర్వాత కర్పూరము వెలిగించి దేవుని ముందర పెట్టుచుండిరి. దాని అర్థము ఏమనగా! రంగు, రూపు, గుణములు ఉన్న నన్ను జ్ఞానాగ్ని చేత కాల్చి నీలోనికి ఐక్యము చేసుకొనుమని దాని బాహ్యార్థముగా రంగు, వాసన ఆకారము ఉన్న కర్పూరమునకు అగ్ని ఉంచి దేవునికి చూపించుచుండిరి. చూచుచుండగనే అది అగ్ని చేత దహింపబడి శూన్యములో ఐక్యము అగుచున్నది. రంగు, వాసన ఆకారము ఉన్న కర్పూరము శూన్యమునందు కలసి పోయిన తర్వాత దానిని పలానా చోట ఉన్నదని చెప్పుటకు వీలుకాక పోవును. అట్లే జీవుడు కూడ తనలో ఉన్న కర్మలను జ్ఞానాగ్ని చేత కాల్చినట్లయితె శూన్యమునందు కలసిపోవును. తర్వాత అతనిని ఇక్కడ ఉన్నాడు,

అక్కడ లేడని చెప్పుటకు వీలులేక పోవును. కర్పూరము వెలిగించి చూపించడములో కూడ ఇంత అర్థము ఉన్నదని తెలియనివారు పూజముగిసిన వెంటనే మంగళహారతి ఇవ్వవలెనని కర్పూరము లేక పోతే దూది వత్తులు వెలిగించి హారతి పట్టెదరు. అది సరైన పద్ధతి కాదు. జ్ఞానులు తమలో ఉన్న భావమును బయటికి చూపుటకు శూన్యములోనికి ఐక్యమగు కర్పూరము వెలిగించి చూపించినారు. మనము కర్పూరము లేకపోతే శూన్యములోనికి ఐక్యము కాని వత్తులను వెలిగించితే సరైన పద్ధతి ఎట్లగును? కావున కర్పూరము లేకపోతే నమస్కారముతోనే పూజను ముగించవచ్చును. పూర్వము పూజలు అన్ని విషయములు తెలుసుకొని చేసెడివారు. దాని వలన సార్థకత పొందెడివారు. ఈ కాలమున ఏమి తెలియకున్ననూ, తెలిసినవారు చెప్పెడి మాటలను పనికిరానివిగా భావించి పెడచెవిని పెడుచున్నారు.



కర్పూర హారతి

పూర్వము అగ్ని చేత దహింపబడు కర్పూరమును మౌనముగ చూస్తు ఉండి పోయెడివారు. మేము ఈ విధముగా జ్ఞానమను అగ్నిచేత కర్మ దహింపబడి అణువణువున వ్యాపించిపోవలయునను భావముతోనే చేసెడివారు. శుభకరమైన భావముతో చేయుచున్నాము కనుక దాని పేరు మంగళ హారతి అని పిలువబడుచున్నది. మంగళ

హారతి మీద హస్తములుంచి నమస్కరించుట కొందరు చేయుచున్నారు. కొందరు రెండు హస్తములనుంచి కల్లకద్దుకొనుచున్నారు. మంగళహారతి సమయములో గంటానాదము చేయుట కూడ కలదు. పూర్వ కాలములో కల్లకద్దు కోవడము కాని, నమస్కరించడము కాని, గంటా నాదము చేయుట కాని చేసెడివారు కాదు.

మంగళహారతి దూరముగా నుండిన నిశ్శబ్దముగ మౌనముగ చూచెడివారు. దగ్గరగ ఉన్నపుడు మండు చున్న హారతి మీద ఒక హస్తమునుంచెడివారు. పూర్వము ఆత్మ జ్ఞానమును తెలిసినవారు నేను కూడ ఈ హారతి కర్పూరములాగ శూన్యములో కలిసిపోవుదనని దేవాలయ మంగళహారతి మీద హస్తముంచి శపథము చేసెడివారు. శపథము చేసిన తర్వాత అట్లే ప్రవర్తించెడివారు. పూర్వము భావము కల్గి హస్తముంచెడివారిని చూచి భావము తెలియనివారు ఏదో లాభముందను భావముతో హారతి మీద చేతులు పెట్టెదరు. ఒక హస్తముంచవలయునని తెలియక రెండు హస్తములు చూపి కల్ల కద్దుకొనుచున్నారు. నేటి మానవులకు నాటివారు శపథము చేయుటకే కర్పూర హారతి మీద చేయినుంచారను విషయము తెలియకుండ పోయినది. ఇప్పటికయిన హారతి వత్తులతో చేయక భావమునకు సరిపోవు శూన్యములోనికి కలిసిపోవు కర్పూరమునే వెలిగించవలెనని కోరుచున్నాము. కర్పూరమును వెలిగించడమేకాక దానిమీద మీ కుడిచేయి పెట్టి నేను ఈ విధముగ జ్ఞానాగ్నిచేత దహించబడి కర్పూరమువలె శూన్యములో గల పరమాత్మలోనికి ఐక్యమగుదునని శపథము చేయవలెను.



# 31. గోవింద

నామముగల దేవాలయములలో గోవిందయని గట్టిగ అరచుట వినుచునే ఉందుము. ప్రత్యేకించి తిరుపతిలో గోవింద అనుట ఎక్కువగ గలదు. మిగత దేవాలయములలో కూడ భజన చేయుచోట భజనపాట అయిపోయిన వెంటనే అంత్యములో గోవింద అనుచుందురు. అట్లే ఒక మనిషి చనిపోయినపుడు గోవింద అని శవములను మోయుచు పల్కుచుందురు. మరియు ఒక మనిషి జూదములో డబ్బుపోగొట్టుకొని ఉత్తచేతులైనపుడు కూడ వీనిపని గోవింద అనుట జరుగుచున్నది. భజన అంత్యములో, జీవిత అంత్యములో, దివాలా తీసిన సమయములో గోవింద అనుట అంత్యస్థితిని తెలియజేయుచున్నది. గోవింద అంటె అయిపోయిందని అర్థము. పాట అయిపోయినపుడు, జీవితము అయిపోయినపుడు, ధనమైపోయినపుడు గోవింద పదము పూర్వము వాడెడివారు. నేటికిని అట్లే అనుచున్నాము. దేవాలయములోనికి పోయి కూడ గోవింద అనుట నేటికిని గలదు. అయిన గోవింద అను పదము దేవుని పేరనుకొన్నాము. కాని అది ఏ దేవుని పేరు కాదని అయిపోయిందని అంత్యస్థితిని తెలియజేయు గుర్తని తెలియదు. పూర్వము దేవాలయములో ప్రవేశించినవారు పూజా విధానమంతయు అయిపోయిన తర్వాత గోవింద అని అనెడివారు. పూర్వజ్ఞానులు నాకర్మ అంతయు నశింపజేసి ఏమిలేక అయిపోయిన స్థితిని కలుగ జేయుమను భావముతో గోవింద అనెడివారు. గోవింద అను పదము యొక్క అర్థము ప్రపంచములో అంత అయిపోయిన స్థితి అని తెలియవలయును. గోవింద గోవింద అనుట ప్రపంచములో కర్మ అంతయు అయిపోజేసి మోక్షమును

కల్గజేయుమనుటయేనని తెలియవలయును. గోవింద అను పదము ఏ దేవుని పేరు కాదని గుర్తించు కోవలయును. ఇంకను ఎట్లున్నదనగా!

ఎక్కడయిన గోవింద అను పదము రెండు మార్లు ఉచ్చరించడమే జరుగుచున్నది. ఈ పదము రెండు మార్లు ఉచ్చరించడములో కూడ పదము పదముకు కొంత వ్యత్యాసమున్నది. మొదట ఉచ్చరించు పదము గోవిందా...... అను దీర్గముండును. రెండవమారు ఉచ్చరించు పదములో గో...వింద అను దీర్ఘముండును. వాస్తవానికి గోవిందా అను పదములో ఒకే అర్థమున్నప్పటికి రెండు మార్లు ఉచ్చరించడము ఏమిటి? అన్నది ప్రశ్న. అంతేకాక మొదటి గోవిందా...లో దాను ఎక్కువ దీర్గించడము, రెండవ మారు అను గో....విందలో గో ను దీర్గించడములో కూడ విశేషమెదో ఉంటుంది. అది ఏమిటనేది కూడ ప్రశ్నయే. వీటి జవాబు కోసము వెదకితే కృత యుగములో ఈ పదమున్నట్లు ఆ కాలములోనే మహర్షులు సహితము గోవిందా పదమును ఉచ్చరించినట్లు చరిత్రలో తెలియుచున్నది. ఆనాడే తెలిసిన పెద్దలు గోవింద అను పదమునకు అర్థమును చేకూర్చి ఆ అర్థము ప్రకారమే రెండు మార్లు గోవింద పదమునుచ్చరించునట్లు, అదియు ఒకదానికొకటి కొద్దిగ వ్యత్యాస ముండునట్లు కనబరచి పెట్టారు. ఆనాడు వారు ఏది చేసిన భవిష్యత్తులో మానవాళికి జ్ఞానము కల్గునట్లు యోచించి చేసెడివారు. శాశ్వితముగ జ్ఞానమును ప్రబోధితము చేయు ఆనాటి వారి ఉద్దేశమేమిటో అక్కడికే వెళ్లి వారినే అడిగి తెలుసుకొందాము.

“గోవింద” అను పదములో అర్థము ఇక లేదు అనియు లేక అంతా అయిపోయినదనియు అర్థమును అమర్చారు. తెలిసిన వారు గాని తెలియని వారుగాని శవాన్ని తీసుకెళ్లేటపుడు అదే అర్థముతోనే

అంటున్నారు. తెలియని వారు అనాలను పద్ధతిగ అన్నప్పటికి సందర్భము అదియేనని యోచనచేయు వారికందరికి తెలియగలదు. అలాగే జూదములో ఉన్నదంత కోల్పోయినపుడు కూడ ఈ గోవింద పదమునే వాడుచున్నారు. అక్కడ కూడ అయిపోయిందను సందర్భమే ఉన్నది. ఇపుడు ఎవరు ఎన్ని సందర్భములలో వాడినప్పటికి పూర్వము దేవుని దగ్గర మాత్రము గోవింద అనెడివారు. ఆనాడు దేవుని సన్నిదిలో అనగ దేవాలయములో ప్రతిమ ముందర నాకు ఈ జగతిలో కావలసినవి ఏమి లేవు అను అర్థముతో గోవిందా..... అనియు అట్లే శరీరములోపల అంటుకొను కర్మయు ఏమి లేదు అని అర్థమొచ్చునట్లు గో.....విందా అనెడివారు. అనగ బాహ్యముగ నున్న వాటి మీద ఆశ మొదలగు ఏ గుణముల పని లేదనియు, అట్లే శరీరాంతర్గతమున అంటుచున్న కర్మ ఏది లేదనియు రెండు గోవిందలు కొంత తేడాతో పెట్టెడివారు. ఇంకా అర్థము కావాలంటే బయటి సంబంధము లేకుండ బ్రహ్మయోగము, లోపలి సంబంధము లేకుండ కర్మ యోగము కల్గియున్నానను అర్థముతో బాహ్యముగ ఒక గోవింద, అంతరముగ ఒక గోవింద అనెడివారు.

రెండు యోగములే అయిన వాటియందు కొంత తేడా ఉండుటవలన గోవింద అనుమాటలో కూడ కొంత తేడా చూపవలెనని ఆనాటి పెద్దలే చెప్పారు. రెండు పద్దతులు కర్మ ఇక లేదని తెలియజేయునవియే అయినప్పటికి అవి వేరు వేరని తెలియునట్లు ఒక దానికి చివరిలో దీర్ఘము మరియొక దానికి మొదటిలో దీర్ఘము పెట్టినారు. రెండు మార్లు ఉచ్చరించడములో అదియు కొంత తేడాతో అనడము అందరికి తెలిసిన విషయముగ ఆనాడు ఉండెడిది. నేటి కాలానికది అర్థహీనమై పోయినది. అనే వారికి దాని విషయము పూర్తి

తెలియకపోవడముతో దానిలోని జ్ఞాన సందేశము ప్రబోధితము కాక పోయినది. ఆనాడు ఇందూ ధర్మములలో ముఖ్యమైన ధర్మముగ ఉన్న గోవిందా నేడు దాని విలువను కోల్పోయినది. అర్థము లేకున్నప్పటికి, ఆచరణరూపములో గోవింద మిగిలి ఉన్నప్పటికి గురువు వద్ద సర్వము తెలుసుకొన్నామనుకొను వారికి, మా గురువు గొప్పవాడని చెప్పుకొను వారికి, చాలా సంవత్సరములు గురువు తెల్పిన విషయములన్నియు జీర్ణించుకొన్నామను వారికి, గోవింద అను పదము రెండు మార్లు అనడము గాని పలకడములో వాటి వ్యత్యాసము తెలియకపోవడముగాని చూస్తే మీరింకా సంపూర్ణ జ్ఞానులే కాలేదను చురక వేసినట్లున్నది. పూర్తి జ్ఞానము యొక్క ఆచరణలేక పోయినప్పటికి కనీసము పూర్తిగ జ్ఞానమయిన తెలుసుకోవాలని కోరుచున్నాము. అర్థములో ఒక్క మారు గోవిందా గోవింద అనడము మంచిది.



# 32. కోనేరు

దేవాలయములు సాధ్యమున్నంతవరకు నదీ ఒడ్డున నిర్మించెడివారు. కొన్ని దేవాలయములకు నదులు సమీపమున లేనందు వలన ఆలయ సమీపములో కోనేరును నిర్మించెడివారు. మొత్తము మీద దేవాలయములు ఏటి సమీపముగ గాని కోనేటి సమీపమునగాని ఉండెడివి. సంవత్సరమున కొకమారు జరుగు తిరునాల సమయములో చిన్న పాటి పడవలాంటిది తయారు చేసి ఏరుమీదగాని కోనేరు మీద గాని ఆ పడవ మీద ఆయా దేవున్ని దాటించెడివారు. దానినే తెప్ప ఉత్సవము అనెడివారు. దేవాలయములు వాటిలోని పూజలు

పరమార్థముతో భావించి చేసెడివారు. కావున తెప్ప ఉత్సవములోని పరమార్థమును కూడ మనము తెలుసుకోవాలి. తెప్ప ఉత్సవములు లింగమునకు చేయకూడదు. రూపమున్న దేవుల్లకే చేయాలి. ఎందుకనగ పరమాత్మ భగవంతునిగ పుట్టినపుడు గుణములచేత అనేక మంచి చెడు కార్యములు చేయుచు ఆ కార్యములవలన సంభవించు పాప పుణ్యములనెడి కర్మలను అంటకుండెడి వాడు. నేను ఈ విధముగ నున్నాను. మీరు కూడ గత జన్మల కర్మ వలన సంభవించు సర్వ కార్యములు చేయుచు నావలెనే క్రొత్త కర్మ పొందకుండ ఉండమని గీతలో కూడ చెప్పాడు. ఆ సందేశమే తెప్ప ఉత్సవము యొక్క భావము. కలుష జలదిని చిన్న పడవచే దాటవచ్చును. అలాగే కర్మలనెడి సముద్రమును జ్ఞానమను చిన్న పడవచే దాట వచ్చునను విషయమును తెప్ప ఉత్సవములో చూపించారు. గుణములు కల్గిన వాడు భగవంతుడు. ఆయన గుణములచే సంభవించు కర్మను తన జ్ఞానముచే దాటి పోతున్నాడని చూపడమే తెప్ప ఉత్సవమని తెలియాలి. అలాగే మనము కూడ నిజ జీవితములో జ్ఞానముచేత కర్మను దాటగలమను భావమునకు వచ్చి కర్మను అంటకుండ చేయు పరికరమైన జ్ఞానమును సంపాదించుకోవాలి. తెప్ప ఉత్సవ సాంప్రదాయమునకు అర్థమిలా ఉండగ కొన్ని దేవాలయములకు ఏరు కోనేరు లేవు. కొన్ని దేవాలయములకు ఏరు కోనేరు ఉండిన తెప్ప ఉత్సవములు జరుపడములేదు. దేవాలయములను ఏరు గాని కోనేరు గాని లేకుండ కట్టడము మరియు ఉన్న దేవాలయములలో తెప్ప ఉత్సవము జరుపక పోవడము సాంప్రదాయ విరుద్ధము, అర్థహీనము. అన్ని ఉండిన తిరుపతి విజయవాడ దేవ స్థానములలో తెప్ప ఉత్సవములు జరుగుచున్నప్పటికి వాటి భావము తెలుసుకోలేక పోవడము మరి విడ్డూరము.

# 33. ఊరేగింపు

నిత్యము దేవాలయములోనున్న దేవున్ని సంవత్సరమున కొకమారు ఊరేగించడము జరుగుచున్నది. ఊరులోని దేవాలయములోనికి ప్రజలందరికి పోయే అలవాటు అవకాశముండదు. అటువంటి వారందరు దేవున్ని తెలుసుకొను నిమిత్తము ఆలయ దేవున్ని ప్రతి బింభమును ఊరు లోని వీదులన్నిటియందు త్రిప్పి ఊరేగించెడివారు. ఊరులోని వారందరు తెలుసుకొను నిమిత్తము ఆలయదేవున్ని వీదులలోనికి తేవడమును పూర్వము ఊరు ఎరిగింపు అనెడివారు. ఆ ఊరు ఎరిగింపు అను పదము కాలక్రమమున ఊరేగింపుగ మారి పోయినది. ఊరేగింపులో ఎదో ఒక ప్రతిమను ఎదో ఒక వాహనము మీద ఊరేగించడము జరుగుచున్నది. దేవున్ని వాహనము మీద ఊరు ఎరిగింపు చేయడములో దేవునికి తప్పని సరిగ వాహనమున్నది అను అర్థము నిచ్చుచు, ఆ వాహనము మన శరీరమే అని తెల్పుచు మనిషి శరీరము మీద మరియు ఇతర జంతువుల శరీరముల మీద ఎక్కిన దేవున్ని ఊరేగించడము జరుగుచున్నది. అలా అన్ని వాహనముల మీద దేవున్ని ఊరేగించడములో అన్ని శరీరములను నడిపించు సారథిగ దేవుడున్నాడని తెలియ బరచడమే అని తెలియాలి. అన్ని శరీరములు వాహనములుగ దేవునకున్నాయని, అంతేకాక ఆ శరీరములలోని ఆత్మగనున్న దేవున్ని తెలుసుకొనుటకు ప్రయత్నిస్తే ఆ దేవుడు మనకు అభయముగ ఉండి మన కర్మలను ఖండించుకొను జ్ఞాన ఖడ్గములను ప్రసాదించునను అర్థముతోనే ఊరేగించు దేవునికి ఆయుధములు ధరింపజేసియుందురు. అందరిలో దేవుడొకడున్నాడని, అదియే తనలోని ఆత్మయని, ఆ ఆత్మయే శరీరములను నడిపించునదిగ ఉన్నదని, అన్ని శరీరములు ఆ

శరీరములోని ఆత్మకు వాహనములుగ నున్నాయని, దేహమను రథమును నడుపువాడు దేవుడని, వానిని తెలియుటచే దేవుని చేతిలోని జ్ఞానాయుధములు మన కర్మలను కాల్చగలవని తెలుపు నిమిత్తమే పూర్వపు పెద్దలు ఊరేగింపు కార్యమును పెట్టారు. ఈ ఊరేగింపు ద్వార ఊరిలోని చిన్నలు పెద్దలు అందరు దేవుని మీద ద్యాస కల్గి ఆయన ఊరుకు ఏమి ఎరిగించుటకొచ్చాడో కొంతకు కొంత తెలుసుకొనెడివారు. ఆనాటి పెద్దలు ఊరేగింపు సమయములో అలా చేయుటలో తమ ఉద్దేశమేమో ప్రజలకు తెలియజెప్పెడివారు. ఈనాడు ఊరేగింపులున్నాయి కాని వాటి అర్థములు లేకుండపోయాయి. ఇప్పటికయిన దేవుని వాహనమును గూర్చి, దేవుని ఆయుధముల గూర్చి ఎరిగింపును తెలుసుకొందాము.



# 34. తిరునాల

సంవత్సరమున కొకమారు తిరునామ అనెడి పేరుతో ఒక పెద్ద ఉత్సవము చేసెడి వారు. ఆనాటి తిరునామ అను ఉత్సవము కాల క్రమములో ఈనాడు తిరునాల అనెడి పేరుగా మారిపోయినది. తిరునామ అనగా నామములో మద్యన గలది. వెంకటేశ్వర నామము మూడు నామములుగ ఉన్నది కదా! అందులో రెండు నామములు ప్రక్కవి తెల్లవిగను మద్యలోది మాత్రము ఎర్రదిగ ప్రక్కరెండు నామముల కంటె పొడవుగ ఉండును. రెండు తెల్ల నామముల కంటె రంగులో ఎర్రగ సైజులో పొడవుగ మద్యనగల నామము ప్రత్యేకత కల్గించుకొన్నది. ఈ నామము భౌతికముగ అభౌతికముగ రెండు అర్థములు కల్గియున్నది. భౌతికముగ శరీరములో గల మూడున్నర లక్షల నాడులలో ముఖ్యమైన

వాటిలో అతి ముఖ్యమైనవి మూడు మాత్రము గలవు. వాటినే ఇడా, పింగళ, సుషుమ్నా నాడులనియు లేక సూర్య, చంద్ర, బ్రహ్మ నాడులనియు పిలువడము జరుగుచున్నది. వాటినే ముఖము మీద నామముగ గుర్తించడము జరుగుచున్నది. ఇడా పింగళ నాడులను రెండు తెల్లని నామములుగ గుర్తించి మద్యన బ్రహ్మనాడియను దానిని ఎర్రని పొడవైన నామముగ గుర్తించాము. ఈ పొడవైన ఎర్రని నామము శరీరములో అన్నిటికంటె ముఖ్యమైన ఆత్మగ తెలియవలసి ఉన్నది. ప్రక్కన గల సూర్య చంద్రనాడులు మనస్సుకు స్థానమై ఉండగ మద్యన గల బ్రహ్మనాడి ఆత్మకు నివాసస్థలమై ఉన్నది. బ్రహ్మ నాడిని ఆత్మగ గుర్తించినవారు దానిని తెలియడమే జీవిత సారాంశమని గుర్తించారు. శరీరములో గల ఆత్మ స్థానమైన బ్రహ్మనాడినే తిరునామము అనెడివారు. ఆ తిరునామమును అనగ ఆత్మను తెలుసుకొనుటకు సంవత్సరమున కొకమారు ప్రజలనందరిని దేవాలయము వద్ద కలిపి ఆత్మ బోధ చేసెడివారు. అలా ప్రజలనందరిని ఆత్మ పట్ల జాగృతపరిచెడివారు. ఆ విధముగ జరుగు దానినే జాతరని అనెడివారు మరియు ఆత్మను తెలిపెడి కలయిక కావున దానిని తిరునామ అని కూడ అనెడివారు. ఆ తిరునామ ఈనాటికి ఉన్నను ఉద్దేశము పూర్తి మారి పోయినది. తిరునామ లేక తిరునాల అనెడిది దేవుని ఎడల భక్తికేగాదు అనేక విధముల అనేక ఉద్దేశములతో పోతున్నారు. ఏది ఎట్లున్న శరీరాంతర్గత ఆత్మను తెలియు ఆధ్యాత్మిక రహస్యమే తిరునామ అని తెలియాలి. ఇది భౌతిక పరమైన అర్థము కాగ అభౌతిక పరమైన అర్థము మరొకటి గలదు.

శరీరములో నివశించు ఆత్మలు మొత్తము మూడున్నాయి. అందులో శరీరమంతా వ్యాపించి ఉన్నది ఆత్మకాగ శరీరములో అదియు

శిరస్సులో రవ్వంతగ ఉన్నవాడు జీవాత్మ మూడవదయిన పరమాత్మ శరీరమంతా ఉంటూ శరీరము బయట కూడ ప్రతి వస్తువులోపల బయట వ్యాపించి ఉన్నది. క్షరాక్షరులని పేరు గాంచిన జీవాత్మ ఆత్మలు రెండు ఎల్లపుడు జోడిగా ఉంటాయి. జీవాత్మ ఆత్మల కంటే అతీతుడు పరమాత్మ కావున మద్యనామమునకు ఎర్రరంగు నుంచారు. రెంటికంటె పెద్దది కావున మద్య నామమును పెద్దగ ఉంచారు. జీవునకు ఆత్మకు గమ్య స్థానము అదియే కావున రెండిటికి మద్యలో ఉంచారు. జీవాత్మ ఆత్మ ఒక దానితో ఒకటి కలసి పోయినపుడే పరమాత్మగ మారవచ్చునని తెల్ల నామములు రెండు కలియుచోటునుంచి మద్య నామమును పెట్టారు. ఈ విధముగ స్థూలములో నామమును సూర్య చంద్ర బ్రహ్మానాడులని, సూక్ష్మముగ జీవాత్మ ఆత్మ పరమాత్మ అని గుర్తించి చూపారు. ముఖ్యమైన విషయము గావున ముఖము మీద నుదిటి భాగములో తీర్చిదిద్దారు. మూడు నామములలో తిరునామ అని పిలువబడునది శరీరమందు బ్రహ్మానాడిలోని ఆత్మను, శరీరము వదలిన తర్వాత పరమాత్మను సూచించుచున్నది. పూర్వము గల తిరునామ పదము నేడు తిరునాల పదముగ మారి స్థూలమైన బ్రహ్మానాడియని, సూక్ష్మమైన పరమాత్మ అనిగాని తెలియకుండపోవడము మన దురదృష్టకరము.



# 35. బట్ట బయలు

కలియుగములో తయారయిన అనేక దేవాలయములలో శ్రీరంగపట్టనములోని శ్రీరంగని ఆలయమునందు చిదంబర

రహస్యమనునది కలదట. అక్కడకు పోయినవారు శ్రీరంగని దేవాలయము దర్శించిన తరువాత చిదంబర రహస్యమును చూచుట పరిపాటి. కాని ఇది రహస్యమని అది ఎవరికి చెప్పకూడదని అక్కడి పెద్దలు చెప్పి మిగత వారికి చూపడము జరుగుచున్నది. రహస్యమనునది చెప్పకూడనిది చూపకూడనిది ఐనప్పటికి చెప్పకూడదని చూపడములో ఏమి రహస్యము గలదో. అక్కడ ఎవరికి తెలియని ఎదో ఒక విషయముండి తీరాలి అందువలననే దానిని రహస్యమంటున్నాము. చిదంబర రహస్యము చెప్పిన బోధపడనిది చూచిన అర్థము కాని విషయము కావున దానిని చిదంబర రహస్యమన్నారు. చాలా మందికి చిదంబర మను పేరు వివరము తెలియదు. చిద అనగ వస్త్రము, అంబరము అనగ ఆకాశము. ఈ విధముగ చిదంబరము అను పదములో వస్త్ర ఆకాశము లేక బట్ట బయలు అని అర్థము గలదు. "చిదంబర రహస్యము బట్ట బయలు" అను వాక్యము కూడ కలదు. శ్రీరంగ పట్టనములోని చిదంబర మేమిటో కొంత తెలుసుకొందాము.

భగవద్గీత సాంఖ్య యోగమను అధ్యాయములో 22 వ శ్లోకము నందు భగవంతుడు వాసాంసి అను పదమునుపయోగించి శ్లోకము చెప్పాడు. "వాసాంసి జీర్ణాని యథా విహాయ నవాని గృహ్ణాతి నరోపరాణి తథా శరీరాణి విహాయ జీర్ణా నన్యాని సంయాతి నవాని దేహీ" ఇందులో పాత వస్త్రము వదలి కొత్త వస్త్రము ధరించినట్లు పాత శరీరమును వదలి క్రొత్త శరీరమును జీవుడు ధరిస్తున్నాడని చెప్పాడు. ఇక్కడ శరీరమును గుడ్డతో పోల్చి చెప్పాడు. వస్త్రము అనిన బట్ట అనిన చేలము అనిన ఒకటే అర్థము. అలాగే అంబరము అనిన ఆకాశము అనిన బయలు అనిన ఒకే అర్థము. శ్రీరంగ దేవాలయములో ఉన్న

చిదంబర రహస్యమనునది ఏమిటని పరికించి చూచిన అక్కడ ఒక ద్వారమునకు అడ్డముగ వస్త్రమును వేలాడ దీసి ఉందురు. ద్వారములోపల ఏమున్నది కనిపించనట్లు ఆ వస్త్రము కట్టబడి ఉండును. లోపల ఏమున్నది తెలియదు కావున అదియే రహస్యము. లోపల ఎమున్నదో చూడాలనుకొన్నవారు అక్కడున్న వారిని అడిగి అనుమతి తీసుకోవలసి ఉంటుంది. చూడాలనుకొనువారికి చూపించు వారుందురు. వారు చూచువారికి ఇక్కడ చూచినది రహస్యము కావున ఎవరికి చెప్పకూడదని చెప్పి చూపించుచుందురు.

ఎందరో చిదంబర రహస్యమును చూచినప్పటికి చూడకమునుపు ఉన్న ఆత్రుత చూచిన తర్వాత లేదు. ఎందుకనగ చూడవలెననుకొనువారు చూడకముందు రహస్యమును అనగ చూడదగిన దానిని గురించి ఎదో ఊహించుకొని ఉందురు. ఎవరేమి ఊహించుకొన్నప్పటికి గుడ్డ తొలగించుతానే ఎవరికి ఏమి కనిపించకపోవడమే ఆశ్చర్యము. అక్కడ ఒక ద్వారము దానికి అడ్డముగ ఒక గుడ్డ ఉండుననుకొన్నాము కదా! చూడవలసిన వారికి ద్వారము ముందర నిలబెట్టి గుడ్డ తీసి చూపుదురు. గుడ్డతీసి చూడగనే అక్కడ ఏ వస్తువుగాని ఆకారము గాని లేక పోవడము ఆశ్చర్యమే అగును. పై కప్పులేని ఆకాశము మాత్రము కనిపించును. గుడ్డ తీసి అక్కడ ఏమి లేదే అన్నట్లు చూపించువారినడగగ ఆకాశము వైపు చూపించి ఇక్కడ మీరు చూడవలసింది కనిపించునది ఇదేనని చెప్పుదురు. ఏమి లేనిదే చిదంబర రహస్యము. ఇక్కడ ఏమి లేనట్లు చెప్పితే ఎవరురారు కనుక మీరు దీనిని రహస్యముగ ఎవరికి చెప్ప కూడదని చెప్పుదురు. చెప్పితే ఏమగునో ఏ చెడు జరుగునోయని చూచి వచ్చినవారు కూడ చెప్పకుండుట జరుగుచున్నది. ఆచారమున్న

అర్థము లేకుండ పోయినది. ఆధ్యాత్మిక పరమైన పరమార్థికమైన అర్థము చెప్పుకోక ఇక్కడ చూచినది ఎవరికి చెప్పవద్దనడము పొరపాటు. ఎవరు ఎవరికి చెప్పిన చిదంబరము అనునది రహస్యమను అర్థముతోనే ఉండును. ఇటువంటి రహస్యముందని చూపు విధానమే చిద అంబరము.

జీవుడు శరీరములో నున్నంత వరకు మోక్షము చెందలేడు. కర్మలేకుండ చేసుకొని శరీరము పొందకుండ పోయినపుడు పరమాత్మ లోనికి ఐక్యమైపోవును. ఇటు శరీరము అటు మోక్షము రెండే గమ్యములు జీవునికి గలవు అనునది సత్యము. శరీరమున్నంత వరకు దేవుడు తెలియడు. చావు పుట్టుకలుగల శరీరము దేవునికి నీకు మద్యలో అడ్డముగ నున్నది. పుట్టుకతో మొదలై చావులో అంత్యమై తిరిగి వెంటనే పుట్టుకతో శరీరము జీవునకు తగులుకొనుచున్నది. శరీరము గుడ్డలాంటిదని పాత గుడ్డ పోతూనే క్రొత్త గుడ్డ తగులుకొను చున్నదని గీతలో దేవుడు చెప్పాడు. అందువలన ఆ గుడ్డ లేక పోతే నీవు దేవుని వద్దకు చేరవచ్చని శరీరమును గుడ్డగ పరమాత్మను బయలుగ చూపించారు. శరీరము బట్ట అని పరమాత్మను బయలుయని శరీరమును పరమాత్మను బట్ట బయలుగ పోల్చారు. బట్ట తీసినపుడే బయలు కనిపించునని శరీరము లేనపుడే దేవుడు తెలియునని తెలుపునదే చిదంబర రహస్యము. బాహ్యార్థముగ బట్టను బయలును చూచినప్పటికి శరీరధారులైన జీవులు పరమాత్మను తెలియకున్నారని చెప్పుటకే తెలియనిది రహస్యమని చిదంబరమునకు రహస్యమను పదము చేర్చినారు. ఆ వివరము తెలియక ఇది రహస్యము ఎవరికి చెప్పకూడదనుటలో అర్థము లేదు. చేలము అనగ సమత శరీరము అనుకొన్నాము కదా! చావుతో పోవు శరీరము ఆ క్షణమే పుట్టుకతో జీవునికి తగులుకొనుచున్నది. కావున ఎల్లపుడు బయలుగ పోల్చబడిన పరమాత్మకు చేలముగ పోల్చబడిన శరీరము

అడ్డముగ నున్నదని తెల్పుటకే శ్రీరంగములోని చిదంబరమని తెలియాలి. గుడ్డ అడ్డముండగ అవతలనున్న బయలు ఎప్పటికి కనిపించదని తెలుపుచు మీకు శరీరమను చేలము అడ్డమునున్నందున బయలను పరమాత్మ తెలియడని తెల్పు నిమిత్తము రహస్యమనడములో అర్థముగలదు.

బట్ట తీసితే బయలు, బట్టతీయకపోతే బయలు లేదు. అలాగే శరీరము పోతేనే మోక్షమని తెల్పుచు బట్టలేని స్థితియైన దానిని అచేలము అన్నారు. చేలము అనగ గుడ్డ, అచేలము అనగ శరీరము లేని మోక్షమని చెప్పారు. అజ్ఞానములో ఉండి శరీరముతో జన్మలెత్తుచున్న వారిని చేలురని, జ్ఞానము కల్గి జన్మలేని స్థితిని కోరుచున్నవారిని అచేలురని పూర్వము పెద్దలనెడి వారు. శరీరమును చేలమని మోక్షమును అచేలమని పూర్వము అనెడివారు. మోక్షమార్గమును అచేలమని అజ్ఞానమును చేలమని కూడ పిలిచెడివారు. జ్ఞాన మార్గమైన అచేలమను పదము కాలక్రమమున అచలముగ మారినది. జ్ఞాన మార్గమనుసరించు వారు నేటికి ఉన్నారు. కాని వారు మాది అచలము అనడము అర్థములేని మాట. వారు మాది అచేలము అని చెప్పవచ్చును కాని అచలమని చెప్పకూడదు. సరియైన అర్థము ప్రకారము చిద అంబరమును చేల అచేలమనవచ్చును. దేవాలయములో చూపినట్లు మీరు బట్ట పార్టినో బయలు పార్టినో యోచించుకోండి. చేలముగాని అచేలమును పొందండి. బట్ట బయలు రహస్యమును చేదించి బట్టను వదలి బయలులో చేరుదాము.



# 36. దేవదాసీలు

ఇంతవరకు దేవాలయ నిర్మాణముల గురించి, అందు పూజావిధానముల గురించి తెలుసుకొన్నాము. ఇంకయు కొద్దిగ తెలుసుకోవలసి ఉన్నది. అది ఏమనగా! మానవులలో స్త్రీ పురుష జాతులు రెండే రెండు ఉన్నవి. ద్విజాతులైన మానవులలో స్త్రీల కంటె బిన్నులు మరియు పురుషుల కంటె బిన్నులు కూడ ఉన్నారు. స్త్రీ జాతిలో ఉద్భవించిన స్త్రీ కుండవలసిన మనో భావము, శరీర అనుకూలము లేక శృంగారమంటే ఏమిటో తెలియక, తెలిసిన ఏ మాత్రమాసక్తి లేక ఉండెడివారు. వారు మాచకమ్మలని పిలువ బడుచున్నారు. శృంగార మనో భావము లేనట్లే వీరికి మాసమాసమునకు రుతుస్రావము (బహిష్ఠ) జరుగదు. ఎంత వయస్సు వచ్చిన బాల్యములో మాదిరే వీరి శరీరముండును. శృంగార మనో భావము కూడ బాల్యములో తెలియనట్లే పెద్దయిన ఆసక్తి లేనివారై ఉందురు. ఇటువంటి స్త్రీలు సంసార జీవితమునకు పనికిరారు. అందువలన మానవ సంఘమునకు దూరముగ ఉండవలయుననెడి కోర్కె వీరియందుండును. అటువంటి వారు. సంసార జీవితములతో కూడుకొన్న మనుషుల మధ్య గృహములలో ఉండక ఆత్మ జ్ఞానమే నిలయములైన దేవాలయములలో నివసించెడివారు.

దేవాలయములలో నివసిస్తు దేవునికి ఏదో ఒక రకముగ సేవ చేయుచుందురు. దేవాలయములో కసువు ఊడ్చుట మొదలుకొని పూజా విధానము వరకు నిత్యము పనులు చేసెడి వారు. ఇంక కొందరు నాట్యము నేర్చి దేవుని ముంగిట నాట్యము చేసి దేవాలయమునకు

వచ్చు భక్తుల నాకర్షించి భక్తుల సంఖ్య పెంచుటకు ప్రయత్నించుచుందురు. మరి కొంత మంది సంగీతము నేర్చి గానాలాపన ఉదయము సాయంత్రము చేయుచు వచ్చు భక్తులకింపగునట్లు చేయుచుందురు. ఈ విధముగ సంసార జీవితమునకు పనికిరాని మాచకమ్మలు దేవాలయములలో నివాస మేర్పరచుకొని ఏదో ఒక విధముగ సేవ చేయుచుండుట పూర్వమాచారముండెడిది. అటువంటి మాచకమ్మలను దేవాదాసీలనుట జరిగెడిది.

కాలము జరుగు కొలది దేవదాసీలంటే వేశ్యల క్రిందికి జమకట్టు కోవసిన కాలమాసన్నమైనది. నేటి దేవదాసీలలో మాచకమ్మలు లేరు. వారి స్థానములో సాధారణ స్త్రీలే ప్రవేశించారు. నేటి దేవదాసీలు దేవాలయములలో నివాసముండక గృహములలోనే ఉంటూ వేశ్యావృత్తి సాగించుచున్నారు. గ్రామ దేవతకు దున్న పోతును వదలివేసి కట్టి వేయనట్లు, ఏ చేనిలో మేసిన అడ్డము లేనట్లు ఒక దేవత పేరుమీద ఒక స్త్రీకి వివాహము చేయకుండ వదలి వేయడము దేవదాసిని (బసువురాలు) చేసినట్లు. ఆమె వద్దకు ఏ పురుషులైన పోవచ్చును. ఈ పద్ధతి కొన్ని కులములలో చోటు చేసుకొని ఉన్నది. దేవదాసిగ మారు స్త్రీ ఇష్టమున్న లేకుండిన పెద్దలు చెప్పినట్లు విని మారవలసిన పరిస్థితి ఉన్నది.

పూర్వ దేవదాసీలు నివాసమునకు యోగ్యము కాని వారైతే, నేటివారు యోగ్యులై కూడ దేవదాసి తనము చేయుచున్నారు. పూర్వ కాలములో మాచకమ్మలు నిస్వార్థముగ దైవ సేవ చేసి దేవ దాసీలని పేరు తెచ్చుకుంటే నేటి కాలములో స్వార్థముతో వేశ్యావృత్తి సాగించు చున్నారు. పూర్వకాలమున్న దేవదాసీలను పవిత్ర భావముతో అందరు

గౌరవించెడివారు. ఈ కాల దేవదాసీలను అందరు నీచ భావముతో చూచుచుందురు. పూర్వకాల దేవదాసీలందు భక్తి జ్ఞాన ప్రవృత్తులెన్నో ఉండెడివి. నేడు ఏ మాత్రము భక్తి జ్ఞానము లేని వారు దేవదాసీలైనారు. ప్రస్తుత కాలములో దేవదాసీలను "బసువురాలని" పిలువడము కూడ జరుగుచున్నది. నాగరికత పెరుగుకొలది ఈ బసువురాళ్ల సంఖ్య తగ్గిపోవుచున్నది. అయినప్పటికి కొన్ని కులములలో స్త్రీలను బసువురాళ్లగ చేయడము నేటికిని అక్కడక్కడ జరుగుచున్నది.



# 37. దేవదాసులు

స్త్రీ జాతిలో మాచకమ్మలున్నట్లే పురుష జాతిలో కూడ నపుంసకులు కలరు. వారు కూడ మాచకమ్మలవలె సంసార జీవితమునకు పనికిరాని పురుషత్వము లేని శరీరము కల్గి ఉందురు. వీరు కూడ పూర్వము దేవాలయములందే స్థాన మేర్పరచుకొని, అచ్చట దైవసేవలు చేసెడివారు. అటువంటి నపుంసకులు నాట్యవృత్తి, సంగీతము మొదలైన వాటియందు కూడ ప్రవీణులై దేవాలయములకు శోభను చేకూర్చెడివారు. నిస్వార్థముగ దైవ సేవలు చేయు ఆ నపుంసకులను దేవదాసులనుట జరిగెడిది. నేటి కాలములో ఏ గుడిలోను దేవదాసీలు కనిపించరు, దేవదాసులు కనిపించరు. నేటి నపుంసకులు స్త్రీలవలె వారొక యాచక వృత్తిని చేయుచు కాలము గడుపుచున్నారు. వీరిని ఉలిగమ్మలనుట జరుగుచున్నది. పురుషాకారులైన వీరు ఇప్పటికి కర్ణాటకలో సాంప్రదాయ సిద్ధముగ కొన్ని స్త్రీ దేవతా దేవాలయములలో సంవత్సరమునకొక మారైన నాట్యము చేయుట పాటలు పాడుట జరుగుచున్నది.

గమనించదగ్గ విషయమేమనగ! స్త్రీ జాతిలోని మాచకమ్మలైన దేవదాసీలు పురుష దేవాలయములలోనె నివసించెడివారు. అట్లే నపుంసకులైన దేవదాసులు స్త్రీ దేవతల యొక్క గుళ్లలోనే నివాసము ఉండెడివారు. అందువలన నేటికిని దేవదాసులు స్త్రీ దేవాలయములలో నాట్యము చేయుట, పాటలు పాడుట కలదు. అట్లే నేడు వేశ్యా వృత్తి చేయుచున్నవారు కూడ పురుష దేవాలయములలో నాట్యము చేయుట జరుగుచున్నది. స్త్రీ దేవాలయములలో నపుంసకులు సాంప్రదాయ సిద్ధముగా డబ్బు తీసుకోకుండ వారె పూజలు జరిపి నాట్యము చేసి పాటలు పాడుట కర్ణాటక మొదలైన ప్రాంతములలో నేటికిని గలదు. వేశ్యావృత్తి చేపట్టిన స్త్రీలు పండుగ సమయములో కూడ డబ్బు తీసుకొని నాట్యము చేయుచుండుట నేటికిని చూస్తున్నాము. బోగమోల్ల నాట్యమని పురుష దేవాలయములలో పండుగ దినములలో జరుగుట అందరికి తెలిసిన విషయమే. పూర్వకాల దేవదాసీలకు, దేవదాసులకు నేటి కాలములోని దేవదాసీలకు, దేవదాసులకు ఎంత తేడా ఉన్నదో మీరే యోచించండి.



# 38. నక్షత్రము

ప్రపంచము కొంత కాలముండి మరి కొంత కాలము లేకుండ పోవును. ప్రపంచమున్నపుడే ఈ జీవరాసులు చస్తూ పుట్టుచూ కష్ట సుఖములనుభవించుచు ఉన్నవి. ప్రపంచము లేనపుడు ఏ జీవరాసి లేదు. ఏమి తెలియని పంచభూతములే లేని అగమ్యగోచరముగ ఉన్న స్థితియే ప్రపంచములేని స్థితి. జగత్తంతయు నాశనమైన నాశనము

కానిదంటు ఒకటుంది అదియే పరమాత్మ. దాని యందైక్యమైన జీవులు తాము కూడ పరమాత్మగ మారి నాశనములేని వారై ఉందురు. ప్రపంచమున్నపుడు మరియు లేనపుడు స్థిరస్థాయిగ మార్పు లేని వాడుగ ఉన్నవాడె పరమాత్మ. మనకు 12 గంటల కాలము పగలు 12 గంటల కాలము రాత్రియైనట్లు పరమాత్మకు వేయి యుగములు పగలు, వేయి యుగములు రాత్రిగ ఉన్నది. పరమాత్మ యొక్క పగలు వేయి యుగములలో జీవరాసులున్నవి. పరమాత్మ రాత్రికాల వేయి యుగములలో జీవరాసులు లేవు మరియు ప్రపంచము లేదు. ప్రపంచమున్నపుడు ప్రపంచము లేనపుడు ఏక స్థాయిగ పరమాత్మ ఉన్నది.

నక్షత్రము రాత్రి పూట కనిపించును. పగలు పూట కనిపించదు. పగలు కనిపించనప్పటికి నక్షత్రములు ఎల్లవేళల ఉండును. శాశ్వితముగ ఉన్న నక్షత్రము రాత్రికాలము కనిపించి పగలు కాలము కనిపించకున్నది. ప్రపంచమున్నపుడు లేనపుడు నాశనము లేకుండ ఉండు పరమాత్మను పగలు కాని రేయి కాని స్థిర స్థాయిగా ఉండు నక్షత్రముతో పూర్వము పెద్దలు పోల్చారు. మోక్షము యొక్క గుర్తుగ నక్షత్రమునుంచారు. అందువలన దేవునియందు ఐక్యము కమ్మని, దేవుడిటువంటి వాడని నక్షత్రమును చూపుట ఇందూమతములో మొదటి ఆచారమై ఉండెడిది. కాలక్రమేపి హిందువులు దానిని మరచి పోయారు. క్రైస్తవ మతమునందు, మహమ్మదీయ మతమునందు నక్షత్రమునకు విలువ నిచ్చుట నేటికి కలదు. నక్షత్రము పరమాత్మ చిహ్నామైనపుడు దానినెట్లు చేరవలయునను సంశయము ఏర్పడక మానదు. దానికి సమాధానమేమనగ! పరమాత్మను తెలియుటకు ఆత్మ జ్ఞానమవసరము. ఆత్మ జ్ఞానము నెరిగిన తర్వాత పరమాత్మ తెలియబడును.



# 39. చంద్రుడు

బ్రహ్మ విద్యలో జ్ఞాన చిహ్నముగ చంద్రుని పోల్చుట సహజము. "చాంద్ర మసం జ్యోతి ర్యోగీ ప్రాప్య నివర్తతే" కర్మ శేషము వల్ల తిరిగి జన్మించు యోగి చంద్ర తేజస్సు కల్గి పుట్టునన్నారు. ఇక్కడ చంద్ర తేజస్సనగ జ్ఞానశక్తని అర్థము. అందువలన జ్ఞానశక్తికి బదులుగా చంద్రుని చూపించుట జరుగుచున్నది. దేవుని యందైక్యమగుటకు జ్ఞానశక్తి అవసరమని తెల్పుటకు నక్షత్రముంచి దాని క్రింద చంద్రవంకను ఉంచారు.



నక్షత్రము చంద్రుడు

పూర్ణ చంద్రుడు కాకుండ పెరుగుచున్న చంద్రుడైన నెలవంకను చూపారు. దీనికి అర్థము జ్ఞానశక్తి పెరిగిన మోక్షము లభించునని తెలియవలయును. మోక్ష సంబంధమైన నక్షత్రము జ్ఞాన సంబంధమైన చంద్రున్ని పూర్వము అందరు గౌరవించి విలువగ చూచెడివారు. ఇపుడది ఒక మహమ్మదీయ మతమునకే పరిమితమైనది. అయిన నక్షత్రము యొక్క అంతరార్థము వారికి ఎంత మాత్రము తెలియునో మనకు తెలియదు.



# 40. రెక్కల గుఱ్ఱము

మోక్షము తెలియుటకు జ్ఞానశక్తి అవసరమన్నాము. జ్ఞానశక్తి లభించవలయునంటే యోగమాచరించవలెను. యోగ మనగ! మనస్సు చలించక నిలిచి పోవలయును. మనస్సు చంచలమైనది. అది ఎంతో వేగముగ చలించుచుండును. వాయు వేగమైన, చంచలమైన మనస్సు నిల్పుటకు సాధన అవసరము. ఈ విధముగ జేసిన మోక్షము దొరుకునని నక్షత్రమును చంద్రవంకను చూపిన పెద్దలు రెక్కల గుఱ్ఱమును చూపారు. దీని కర్థమేమనగా! గుఱ్ఱము పరుగెత్తునది. అందులోను రెక్కల గుఱ్ఱమనగా వాయు వేగము కంటె ఎక్కువ వేగముగలదని అర్థము. నీలోని మనస్సు ఇలాంటిదని తెల్పు నిమిత్తము రెక్కల గుఱ్ఱమును చూపారు. సాంఖ్య సూత్రము ప్రకారము ఆకాశము ఒకటవ భాగము, గాలి ఒకటవ భాగము కలిసినపుడు తయారైనది మనస్సు. కావున ఆకాశమున గాలిలో ఎగురు రెక్కల గుఱ్ఱమును మనస్సుగ చూపారు. మనస్సు నిలువవలయునంటే శరీరములోని పంచ జ్ఞానేంద్రియాల యొక్క ఏ విషయము జ్ఞప్తికిరాక నిలిచి పోయినపుడు మనస్సు నిల్చిపోవును. జ్ఞానేంద్రియాల విషయాల మీదనే మనస్సు చలించు చుండును. కావున చంచలమైన మనస్సు నిల్పవలయునంటె ఐదు జ్ఞానేంద్రియాల ధ్యాసలు నిల్చి పోవలయును. కనుక మనస్సును రెక్కల గుఱ్ఱముగజూపి ఈ గుఱ్ఱము నిలిచి పోవలయునంటె ఐదు జ్ఞానేంద్రియాలు నిలిచి పోవలయునని ఐదు వ్రేళ్లు కల హస్తమును గుఱ్ఱమునకు పై భాగమున చూపారు.



రెక్కల గుఱ్ఱము

ఐదు వ్రేల్లు కల్పిన హస్తము నిలుపుమని హెచ్చరించునట్లు కన్పించుచున్నది. హస్తములోని జ్ఞానేంద్రియముల ద్యాసలు నిల్చిన చంచలమైన మనస్సనెడి రెక్కలగుఱ్ఱము నిలుచునని చూపారు. రెక్కల గుఱ్ఱమైన మనస్సు నిల్చుట వలన జ్ఞానశక్తి పెరుగునని పైన చంద్రవంకను చూపారు. జ్ఞానశక్తి పెరిగిన మోక్షము లభించునని నక్షత్రమును కూడ చూపారు. నక్షత్రము, చంద్రవంక, హస్తము, రెక్కల గుఱ్ఱము అన్ని గుర్తులు ఒక్క చిత్రమునందే చూడవచ్చును. కొన్ని చోట్ల రెక్కల గుఱ్ఱము హస్తము ఒక చిత్రముగ, నక్షత్రము చంద్రవంకలు ఒక చిత్రముగ నున్నవి. అంతరార్థముగ ఎంతో జ్ఞానమిమిడి ఉన్న ఈ చిత్రముల విషయము చాలామందికి తెలియదనే చెప్పవచ్చును. ఆత్మ జ్ఞానమిమిడి ఉన్న చిహ్నాములైన ఈ గుర్తులను అందరు గౌరవించవలెను.

# 41. పీర్లు

ఇందువుల పండుగలలో పీర్ల పండుగ కూడ మిలితమై ఉన్నది. ఇందూ దేశము హిందూ దేశముగా పిలువబడినట్లు ఇందువుల ఆరాధనలు కూడ కొన్ని పరమతములలోనికి కలిసిపోయినవి. ఇతర మతమే లేని ఇందూ దేశములో పరమాత్మ ఆరాధనలు చాలా ఉండెడివి. అటువంటివి కొన్ని కాలగర్భములో కలిసి పోగా కొన్ని మాత్రము మిగిలి ఉన్నాయి. అటువంటి వాటిలో కొన్ని అర్థము తెలియని ఆచారముగ ఉండగ కొన్ని పరమతములలో చిక్కుకొన్నాయి. అటువంటి వాటిలో రెక్కల గుజ్జము, నక్షత్రము చంద్రుడు, పీర్లు కాగా పీర్లు మాత్రము అటుకాక ఇటుకాక హిందువులలో సగము ముస్లీమ్‌లలో సగముగ చిక్కుకొని ఉన్నాయి. అతి ముఖ్యమైన చంద్రుడు నక్షత్రము, రెక్కల గుజ్జము మొదటినుంచి హిందువులలో ఉన్నవే అను ఆధారములు పైకి కనిపించకున్నా పీర్లు మాత్రము హిందువులతో ఇప్పటికి సంబంధపడి ఉండి ఎక్కువగ హిందువులే పాల్గొనుచుండుట గమనార్హము. ఎవరికి తెలిసిన తెలియకుండిన చంద్రుడు నక్షత్రమును గూర్చి రెక్కల గుజ్జమును గూర్చి మనము తెలుసుకొన్నాము. ఇపుడు పీర్లను గురించి తెలుసుకొందాము.

ఇందూ మతములో శాస్త్రములుకాక పురాణములు కూడ ఉన్నట్లు ముస్లిమ్ మతములో కూడ చంద్రుడు నక్షత్రమును గూర్చి రెక్కల గుజ్జమును గూర్చి పీర్లను గూర్చి కొన్ని కథలుండవచ్చును. అయినప్పటికి దేవునికి సన్నిహితముగ మనము వాటి అర్థములు చెప్పుకోవడములో తప్పులేదు. రేకుతో తయారు చేయబడిన గుండ్రని భాగము పీరుగ నుండును. ఆ గుండ్రని భాగమునకు పైన మూడు కొమ్ములుగ

రేకులనమర్చి ఉందురు. ముక్కు నోరు ఆకారము లేని గుండ్రని ఆకారమునకు ముఖ్య అలంకారములుగ పైన మూడు రేఖలు నామములవలె తయారు చేసి ఉందురు. ముక్కు ముఖము అను గుర్తింపులేని ఆకారమును ఆత్మ స్వరూపముగ అర్థము చేసుకోవాలి. అలా చూపడములో ముఖ్య ఉద్దేశము దేవునికి ఆకారము లేదని తెలియజేయడమే. ఆకారములేని దేవుడు ప్రపంచములో జీవాత్మ ఆత్మ పరమాత్మలుగ మూడు భాగములై నిలచి ఉన్నదని తెలుపడమే పై మూడు నిలువు రేఖల గుర్తింపు. ముఖ్యముగ కనిపించు మూడు రేఖలలో ప్రక్కల రెండు చిన్నవిగ మద్యలోనిది పెద్దదిగ ఉండును. అలాగే ప్రక్కరేఖలు రెండు ప్రక్కలకు వంగి ఉన్నట్లు మద్యలోది వంగక నిటారుగ ఉన్నట్లు కనిపించుచుండును. ఎటు తిరిగి ఏ పీరుకయిన ప్రక్కవాటికంటె మద్యనున్నది ప్రత్యేకముగ ఉండునట్లు తయారు చేసి ఉందురు. చూచేవారికి కుడిప్రక్క కనిపించు రేఖ జీవాత్మయనియు ఎడమ ప్రక్క కనిపించు రేఖ ఆత్మ అనియు గుర్తించు కోవాలి. అట్లే మద్యలోనున్న రేఖ పరమాత్మగ గుర్తించుకోవాలి. భూమి మీద పరమాత్మ క్షరాక్షర పురుశోత్తములుగ ఉన్నాడని అంతటికి ఆదికర్తయి ఇందువుల చేత పరమాత్మగ, క్రైస్తవుల చేత ఎహోవాగ, ముస్లీమ్‌ల చేత అల్లాగ పిలువబడు వాని నుంచి ఒక ప్రక్క జీవుడు మరొక ప్రక్క ఆత్మ పుట్టి ప్రపంచములో జీవకోటి తయారయినదని చూచించు గుర్తుయే పీరు యొక్క ఆకారము.

దేవుడిటువంటివాడని తెలిసిన పెద్దలు ప్రజలకు తెలియబరుచుటకై ఎన్నో తతంగములు చేశారు. అటువంటి వారి ఉద్దేశములలో పీరు కూడ ఒక ముఖ్య ఉద్దేశమే. సంవత్సరమునకొక మారు పీర్లను ఊరేగించడము అలంకరించడము ఆరాధించడము ఉత్సవములు




పీరు

చేయడము జరుగుచున్నది. కాని పూర్వపు పెద్దలుంచిన భావము ఏ మాత్రము తెలియకుండ పోయినది. ఈనాడు పీర్ల ఊరేగింపు ఇందువులు ముస్లీమ్‌లు కలసి చేయుచున్నారు. ఇదొక తతంగముగ చేయుచున్నారు. పూర్వపు భావము ఏ మాత్రము కనిపించకపోగ పీర్లను కూడ కోర్కెలు కోరే మనుషులు తయారయినారు. పీర్ల దగ్గర భక్తి భావము కొద్ది మందికి ఉండగ ఎక్కువ మంది మత్తుతాగి ఎగిరేవాళ్లే ఎక్కువమంది కనిపిస్తున్నారు. పీర్లను దైవముగ తలచి వాటి ముందర మా కర్మయంతటిని లేకుండ చేసుకుంటామను భావముతో పూర్వపు పెద్దలు అగ్నిగుండమును కాయించి అందులో కట్టెలని వేసి కాల్చి చూపెడివారు. శరీరమను గుండములో జ్ఞానమను అగ్నిచేత కర్మలను కట్టెలను కాల్చి నీలోనికి ఐక్యమగుదుమని చూపిన ఆనాటి క్రియ ఈనాటికి ఉన్నను కట్టెలను కర్మలని అగ్నిని జ్ఞానమని గుండమును శరీరమని పీరును

దైవమని గుర్తించేవారే కరువైనారు. పీర్ల పండుగ సారా తాగేదానికి మాంసము తినే దానికి ప్రతీకగ ఉన్నది. ఈనాటి అల్లరి పద్దతిని వదలి పూర్వపు జ్ఞానుల పద్ధతిని అలవరించుకొంటె పీర్ల పండుగకు పవిత్రత చేకూర గలదు.

అజ్ఞానములో ఉన్న మనుజులకు ఆత్మ జ్ఞానము తెల్పు నిమిత్తము పూర్వము పెద్దలు ఎంతో కృషి చేశారు. అయిన వారి కృషికి ఈ కాలములో విలువ లేకుండ పోయినది. మానవుల కుల మత వ్యవస్థలు ఆత్మ జ్ఞానమును అడవికి పారద్రోలినవి. అజ్ఞానము మనుజులలో చీలిక లేర్పరచి కుల మతమను పేర్లతో వాదించుకొను స్థితికి దిగ జార్చినది. సర్వ మానవులకు దేవుడొక్కడే అను విషయము నేటి మానవులు పూర్తిగా మరచిపోయినారు. అటువంటి వారికి ఒక కుదుపునిచ్చి అజ్ఞాన నిద్ర నుండి లేపవలయునను తలంపే ఈ చిన్ని గ్రంథ ప్రయత్నము. మానవ జాతియందు మతచీలికలు లేకుండ చేయవలయునను ఉద్దేశమే ఈ గ్రంథ ప్రయత్నము. అన్ని మతముల కాధారమైన రూపము పేరు లేని వానిని గూర్చి తెల్పడమే మా ఉద్దేశము. నాకేమి తెలియకున్నను యోచనకందించి శరీరము ద్వార వ్రాయించిన దేవదేవుడైన పరమాత్మకే ఈ గ్రంథ కీర్తి అపకీర్తులు చెందవలయునని తెల్పుచున్నాము.

## సమాప్తం



# దేవాలయముల పట్ల స్వాముల విధానములు

దేవాలయములు మానవునికి దైవత్వము గూర్చి సమాచారమును అందించు జ్ఞాన వారధిలాంటివి కాగ, అందులోని పూజలు దేవునికి మానవత్వపు విశ్వాసమును గూర్చి సమాచారమునిచ్చు సూచనలై ఉన్నవని తెలుసుకొన్నాము. దేవాలయములు బ్రహ్మవిద్యాశాస్త్రమైన భగవత్ గీతను దాటకుండ దాని హద్దులోనే తయారుచేయబడినవి. ఆదిలో పరమాత్మ సూర్యునికి చెప్పిన జ్ఞానము ప్రకారము దేవాలయములు కృత యుగములోనే నిర్మించారు. అప్పుడు ఏ ఆగమశాస్త్రము లేదు. 1) గణితశాస్త్రము 2) జ్యోతిష్యశాస్త్రము 3) ఖగోళశాస్త్రము 4) భౌతిక శాస్త్రము 5) రసాయనిక శాస్త్రములు ప్రపంచమునకు సంబంధించినవి కాగ, ఆరవశాస్త్రమైన యోగశాస్త్రము లేక బ్రహ్మవిద్యాశాస్త్రము దేవునికి సంబంధించిన శాస్త్రము. వేదములు కూడ శాస్త్రములు కావు. దేవుడు, దేవాలయములు వేదములకు అతీతమైనవి. అటువంటి దేవాలయములలో ధర్మబద్ధము లేని కట్టడము గాని, ధర్మయుతము గాని ఆరాధనలు గాని అర్థరహితమగును. ఎపుడు నిర్మించిన దేవాలయములైన పూర్వపు సాంప్రదాయమునే కల్గియుండవలెను. ఈ మధ్యకాలమున కలియుగములో అవతరించిన స్వామిజీలు దేవాలయముల మీద తమ ఆదిపత్యమును చాటుకొనుటకై వైష్ణవ దేవాలయములని, శైవ దేవాలయములని విభజించారు. గృహములకు వాస్తు శాస్త్రమును కొందరు సృష్ఠించినట్లు, దేవాలయములకు ఆగమ శాస్త్రమును కొందరు సృష్ఠించి, దేవున్ని కూడ మనిషివలె లెక్కించి ఆయనకు నిద్రగలదని పవలింపు సేవ చేయవలెనని చెప్పుచున్నారు. ఈ విధముగ ఎన్నో నియమములను కల్పించి పరమతముల ముందర దేవున్ని చౌకచేశారు.

ఈ సందర్భములో వైష్ణవుడైన చినజియార్ స్వామి తిరుమలలో హెలిక్యాప్టర్లు తిరుగరాదని, గ్యాస్ పొయ్యి మీద లడ్డులు చేయకూడదని, పైపు నీల్లు వాడకూడదని చెప్పడము, కొత్త ప్రాంగనము కట్టడము సాంప్రదాయ విరుద్ధమనడము, ధర్మప్రచారమునకు దేవస్థాన డబ్బు కావలెనని కోరడము

జరిగినది. ఈ విషయములలో శైవులయిన జయేంద్రసరస్వతి స్వాముల వారు విభేదించడము, పత్రికా ముఖముగ విమర్శించుకోవడము జరిగినది. జయేంద్రసరస్వతి వ్యాఖ్యలకు చినజియార్ స్వామి స్పందించి శాస్త్రావగాహన లేనివారు మాట్లాడకూడదని, తాను సర్వజ్ఞుడనని, సాంప్రదాయములు తెలియనివారు ప్రకటను చేయవద్దనడము జరిగినది. అంతే కాక పీఠము వేసుకొని కూర్చున్నవారందరు పీఠాధిపతులౌతారా అని పీఠాధిపతులను హేళనగ మాట్లాడము జరిగినది.

ఈ మాటలన్ని విన్న తర్వాత ధర్మ వివరమునకై మేము నోరు విప్పాల్సి వచ్చినది. దేవాలయములలో పూర్వమున్న సాంప్రదాయములు లేకుండ పోయి, భక్తులలో ఆరాధన విధానము మారిపోవుటకు ఇటువంటి స్వామిజీలే కారణమని చెప్పక తప్పలేదు. ధర్మమంటే ఏమిటో తెలియక పోయినప్పటికి మేమే సర్వజ్ఞులమనుకొని ఆలయసాంప్రదాయములను మంటగలిపి, దేవున్ని కూడ సంకుచితము చేసి, మనవలె ఆయనకు నిద్రకావలెననడము, ఆగమ శాస్త్రము అంటగట్టడము సమంజసమేనా అని అడుగుచున్నాము.

ఆలయములో ఎన్నో అర్థములు నిండియుండగ ఒక వివరమును గాని ప్రజలకు తెలియజేయక మేము ధర్మప్రచారకులంటే సరిపోతుందా? భగవంతుని నామముగాని, హస్తముగాని, శఠగోపమునుగాని ప్రస్తావనకు తీసుకరాక, దాని విషయమిదని తెలుపక, దేవునికి సంబంధము లేని విషయములను సాంప్రదాయములనవచ్చునా? దేవాలయముల రహస్యములు తెలియనివారు దేవాలయ సాంప్రదాయములను గూర్చి మాట్లాడడము విడ్డూరము కాదా! తమకు నచ్చిన వ్రాతలను శాస్త్రములని చెప్పి ఆలయములలోని దైవధర్మములను విస్మరించవచ్చునా! ధర్మములు సాంప్రదాయములు ఇటు ప్రజలకు, అటు ప్రభుత్వమునకు తెలియదు కావున ఎవరు సంస్కృత పాండిత్యము కనబరిస్తే వారిదే నిజ

సాంప్రదాయమనుకొనగలరు. సంస్కృతము ఒక బాషయని, అందులో చెప్పినవన్ని సత్యము కాదని తెలియక చెప్పినదంతా నిజమను కొనుచున్నారు. విన్న విషయములో శాస్త్రబద్దత హేతుబద్దత కలదా లేదా అని యోచించు స్థితిలో లేరు. ఏ పుక్కిడి పురాణము చెప్పిన వినే స్థితిలో గలరు. కావున ఏమిచెప్పిన సరిపోవునని శాస్త్ర పొంతన లేని విషయములను పత్రికాముఖముగ ఏ విధముగ చెప్పారో చూస్తాము.

ఈనాడు హైదరాబాద్ 4-2-2004

## శివారాధకులపై చినజీయరు స్వామి వ్యాఖ్యలు అనుచితం

### శైవ మహాసభలో స్వరూపానందేంద్ర సరస్వతి

సికింద్రాబాద్, ఫిబ్రవరి 3 (న్యూస్‌టుడే): సృష్టికి మూల పురుషుడు పరమ శివుడేనని, శివారాధన జరిగే ప్రదేశంలోనే సర్వ సుఖాలు సిద్ధిస్తాయని విశాఖ శారదా పీఠాధిపతి స్వరూపానందేంద్ర సరస్వతి స్వామి అన్నారు. శివారాధకులైన వారికి తిరుమలలో పూజా విధానంపై వ్యాఖ్యానించే హక్కు లేదని చినజీయర్ స్వామి పేర్కొనడం సరికాదని, హరిహారాదులు ఏకస్వరూపలనే హైందవ సిద్ధాంతాన్ని విస్మరించడం శోచనీయమని ఆయన విమర్శించారు. శైవ మహాపీఠం ఆధ్వర్యంలో సికింద్రాబాద్‌లోని జింఖానా గ్రౌండ్స్‌లో కొనసాగుతున్న శైవ మహాసభల్లో భాగంగా మంగళవారం ఏర్పాటైన ఆధ్యాత్మిక ప్రవచన సభలో స్వరూపానందేంద్ర సరస్వతి పాల్గొన్నారు. ఈ సందర్భంగా మాట్లాడుతూ హిందూమతాన్ని ఆది శంకాచార్యుడే పునరుజ్జీవింపజేశారన్నారు. పరమ శివుని ఆరాధన ద్వారానే లోకానికి క్షేమం కలుగుతుందన్నారు. అత్యున్నత స్థానంలో కొనసాగుతూ పరిపూర్ణ పాండిత్యాన్ని అలవర్చుకున్న చినజీయర్ స్వామి శివారాధకులను కించపరచేలా వ్యాఖ్యానించారని ఆయన ఆవేదన వ్యక్తం చేశారు. మహాసభల్లో భాగంగా మంగళవారం సామూహిక శివ యజ్ఞాన్ని నిర్వహించారు. శివతత్వం, శివారాధన ప్రాముఖ్యత, ఉపనిషత్తుల సారం, ఆగమ శాస్త్ర ప్రాధాన్యంపై పలువరు వేద పండితులు ఉపన్యసించారు. శైవ మహాపీఠం పీఠాధిపతి నిర్మల శంకరశాస్త్రి, తాడికొండ నాగపుల్లయ్య, డాక్టర్ శివలంక ప్రకాశ్‌రావు తదితరులు రుద్రాక్షధారణ, లింగారాధనల పై ఉపన్యసించారు. సినీ నటుడు చంద్రమోహన్ నేతృత్వంలోని వివిధ సాంస్కృతిక కార్యక్రమాలు సభికులను అలరించాయి.



విశాఖ శారదా పీఠాధిపతి స్వరూపానందేంద్ర సరస్వతి సినీనటుడు చంద్రమోహన్‌కు ప్రసాదం అందిస్తున్న దృశ్యం

ఈనాడు 20-2-2004

# తితిదేను కలవరపరుస్తున్న ప్రభుత్వ జీవో

## నిధులు కేటాయించాలని పీఠాధిపతుల హెచ్చరికలు

(న్యూస్‌టుడే - తిరుపతి)

రాష్ట్రంలో ధర్మప్రచారానికి త్రిదండి రామానుజ చినజీయర్ స్వామికి రూ.2.50 కోట్లు అందచేయాలని ప్రభుత్వం జారీ చేసిన జీవో తితిదే అధికారులను కలవరపరుస్తోంది. చినజీయర్‌కు రూ.2.50 కోట్లు అందచేస్తే తమకూ కేటాయించాలని కొందరు మఠాధిపతులు, పీఠాధిపతులు గురువారం తితిదే అధికారులకు ఫోన్ల ద్వారా హెచ్చరికలు చేసినట్లు తెలిసింది. మూడేళ్ళ కిందట చినజీయర్ స్వామి రాష్ట్రంలో గీతాజ్యోతి కార్యక్రమానికి రూ.5 కోట్లు కేటాయించాలని తితిదేను కోరారు. అయితే అప్పటి స్పెసిఫైడ్ అథారిటీ ఈ విషయాన్ని ప్రభుత్వ పరిశీలనకు పంపింది. చినజీయర్ కోరిన విధంగా కాకుండా రూ.2.50 కోట్లు కేటాయించడానికి సుముఖత వ్యక్తం చేసింది. ఈ అంశాన్ని ప్రభుత్వం కూడా తేల్చకుండా పక్కన పెట్టింది. జిల్లాల్లో ధర్మప్రచారానికి ప్రత్యేక వాహనం తితిదే సమకూర్చాలని, డి.పి.పి. కళాకారులతో పాటు జీయర్ శిష్యులు కూడా ఆ వాహనం ద్వారా ప్రచారాన్ని నిర్వహించాలని తలపెట్టారు. చినజీయర్ కోరిన విధంగా నిధులు కేటాయించినట్లయితే రాష్ట్రం, దేశంలోని మిగిలిన మఠాధిపతులు, పీఠాధిపతుల నుంచి తీవ్ర ఒత్తిడి ఎదుర్కోవాల్సి వస్తుందని ప్రభుత్వం భావించి ఈ అంశాన్ని వదిలేసింది. ముందస్తు ఎన్నికల నేపథ్యంలో ప్రభుత్వం తాజాగా చినజీయర్‌కు రూ.2.50 కోట్లు కేటాయించాలని తితిదేకు ఆదేశాలు జారీచేసింది. దీంతో గురువారం దీనిపై తితిదే అధికారులకు ఇతర మఠాధిపతులు, పీఠాధిపతుల నుంచి హెచ్చరికలువచ్చాయి. చినజీయర్‌కు రూ.2.50 కోట్లు అందచేసినట్లయితే తమకు అదేవిధంగా కేటాయించాలని డిమాండ్ చేస్తున్నారు. రాష్ట్రంలో జీయర్ ఒక్కరే హిందూ ధర్మప్రచారం చేయడంలేదని, తామంతా అదే కార్యక్రమం నిర్వహిస్తున్నామని ఆ మఠాధిపతులు వివరించినట్లు తెలిసింది. దీంతో ఈనెల 24న తితిదే పాలక మండలి సమావేశంలో ప్రభుత్వ జీవో అనుసరించిన జీయర్ రూ.2.50 కోట్లు కేటాయించేందుకు నిర్ణయం తీసుకోనున్నట్లు తెలిసింది. అదే జరిగితే మిగిలిన పీఠాధిపతుల నుంచి వచ్చే ఒత్తిడిని ఏవిధంగా ఎదుర్కోవాలోనని తితిదే అధికారులు ఆందోళనచెందుతున్నారు. ప్రస్తుతం తితిదే పరిస్థితి ముందు నుయ్యి వెనుక గొయ్యిలా తయారైంది. ప్రభుత్వ జీవోను అనుసరించి జీయర్‌కు నిధులు మంజూరు చేయకపోతే ప్రభుత్వ ఆగ్రహానికి గురికావాల్సి వస్తుంది. అదే జరిగితే మిగిలిన పీఠాధిపతులనుంచి ఎదురయ్యే ఒత్తిడి నుంచి ఏరకంగా బయటపడాలో అర్థంకాక అయోమయ పరిస్థితిలో ఉన్నారు. ఇప్పటికే తితిదే ప్రభుత్వ సూచనలు కొన్నింటిని తిరస్కరించింది. గోదావరి పుష్కరాల సందర్భంగా శ్రేయోనిధి కింద ముందస్తుగా నిధులు అందచేయాలని చేసిన విజ్ఞప్తిని తిరస్కరించింది. తిరుపతిలో ఫ్యాషన్ టెక్నాలజీ కేంద్రానికి వృద్ధాశ్రమ భవనాలతో పాటు రూ.10 కోట్లు కేటాయించాలని సూచించింది. ఈ అంశం ప్రస్తుతం పెండింగ్‌లో ఉంది. తాజాగా చినజీయర్‌కు రూ.2.50 కోట్లు అందచేయాలని ఏకంగా జీవో జారీచేసింది. ముందస్తు ఎన్నికల నేపథ్యంలో ఈ సమస్యను జటిలం చేయకుండా పాలకమండలికూడా ఆమోదం తెలిపేఅవకాశాలు కన్పిస్తున్నాయి. కాని ఆ తరువాత పరిణామాలను ఏవిధంగా ఎదుర్కోవాలోనని అధికారులుసతమతమవుతున్నారు.

# జీయర్ వ్యవహార శైలి వల్ల ప్రమాదం

27-2-2004

## విశాఖ పీఠాధిపతి ధ్వజం

ప్రభాతవార్త సిటీబ్యూరో
హైదరాబాద్, ఫిబ్రవరి 26:

తిరుమల సాంప్రదాయాలు, ఇతర అంశాలను అడ్డుపెట్టుకుని ముఖ్యమంత్రి చంద్రబాబు నాయుడును త్రిదండి చినజీయర్‌స్వామి బ్లాక్ మెయిల్ చేస్తున్నారని విశాఖ పీఠాధిపతి స్వరూపానందేంద్ర సరస్వతీ మహాస్వామి బుధవారం ఒక ప్రకటనలో ఆరోపించారు. ఆలయ వ్యవహారాలలో విపరీత జోక్యాన్ని ప్రదర్శిస్తున్న ఆయన వ్యవహార శైలి వల్ల సంప్రదాయల మధ్య నిర్హేతుక ఘర్షణ, ఉద్రిక్తత చోటుచేసుకుంటున్నాయన్నారు. తిరుమల దేవస్థానం ఆదాయంతో లబ్ధి పొందిన జీయర్ తిరిగి ఆ దేవస్థానంపైనే ధ్వజమెత్తడం ఎంతవరకు సమంజసమని ఆయన ప్రశ్నించారు. హైటెక్ పద్ధతుల్లో ధర్మప్రచారం చేస్తున్న ఆయన, సాంప్రదాయాలు సక్రమంగా లేవన్న సాకుతో తిరుమల అర్చకసంఘాన్ని తీవ్రంగా వేధించడం తగదని పేర్కొంటూ సరస్వతీ మహాస్వామి హితవు పలికారు.

అవైదిక పద్ధతులను తిరుమలలో ప్రవేశపెట్టాలని చూస్తున్న చినజీయర్ వైఖరి చారిత్రక సంక్షోభానికి దారి తీస్తుందని ఆయన ఆందోళన వ్యక్తం చేశారు. శ్రీవేంకటేశ్వరస్వామి ప్రజలందరి దైవమని, అక్కడి పూజావిధానం దైవానుసారంగా కొనసాగాలని సరస్వతీ మహాస్వామి అన్నారు. సమన్వయ దృక్పథంతో జీయర్‌స్వామి వ్యవహరించేలా ముఖ్యమంత్రి చంద్రబాబు నాయుడు జోక్యం చేసుకోవాలని, జీయర్ ఆర్థిక ప్రయోజనాలతో చేసే పనుల వల్ల రాష్ట్రానికే ప్రమాదం వాటిల్లుతుందని సరస్వతీ మహాస్వామి ఆందోళన వ్యక్తం చేశారు.

### అర్హత లేదు

చినజీయర్ స్వామికి తిరుమల తిరుపతి దేవస్థానంలో పూజావిధానాల గురించి, నిర్మాణాల గురించి సూచనలిచ్చే అర్హత లేదని పుష్పగిరి శంకరాచార్య మహాసంస్థానం పీఠాధిపతి జగద్గురు విద్యానృసింహ భారతి అన్నారు. తిరుమల తిరుపతి వ్యవహారాలపై నిర్ణయం తీసుకునే ముందు పీఠాధిపతులందరినీ సంప్రదించి, బహిరంగ నిర్ణయం తీసుకోవాలని, టిటిడి దేవస్థానం, పాలకవర్గాలు ఈ అంశాన్ని దృష్టిలో ఉంచుకోవాలని ఆయన కోరారు.

ఈనాడు 24-2-2004 మంగళవారము

# తితిదే ఆగమ సలహామండలి రద్దు!

తిరుపతి, ఫిబ్రవరి 23 (న్యూస్‌టుడే): తిరుమల తిరుపతి దేవస్థానానికి సంబంధించిన ఆగమ సలహామండలిని రద్దుచేయనున్నట్లు విశ్వసనీయంగా తెలిసింది. ఇటీవల తిరుమలలో చేపడుతున్న వివిధ అభివృద్ధి కార్యక్రమాలపై ముఖ్యమంత్రి చంద్రబాబు సమక్షంలో ప్రత్యేక సమావేశం జరిగింది. ఈ సమావేశంలో తిరుమల మాస్టర్‌ప్లాన్ అభివృద్ధి పనులపై చర్చించారు. ఈ సందర్భంగా అక్కడ చేపడుతున్న పనులకు త్రిదండి రామానుజ చినజీయర్ స్వామి సూచనలు తీసుకోవాలని చంద్రబాబు ఆదేశించారు. చినజీయర్‌తో పాటు ఆగమపండితులు మరికొందరు స్థపతుల సలహాలను కూడా తీసుకోవాలని తితిదే భావిస్తోంది. ప్రస్తుతం కొనసాగుతున్న తితిదే ఆగమ సలహామండలిని రద్దు చేయాలనే సూచనలు ఆ సమావేశంలో చేయనున్నట్లు తెలుస్తోంది. ఆగమ సలహా మండలి స్థానంలో సంప్రదాయ వాదులతో ప్రత్యేక కమిటీని వేయాలని చినజీయర్ సూచించినట్లు సమాచారం. దీనిపై విస్పష్టమైన ప్రకటనలో వెలువడనప్పటికీ ఆగమ సలహామండలిలోని ఓ సభ్యుడు తీవ్ర అభ్యంతరం వ్యక్తం చేస్తూ చంద్రబాబుకు ఓ లేఖను రాసినట్లు తెలిసింది. ప్రస్తుత ఆగమ సలహామండలిలో మాడంబాకం శ్రీనివాసాచార్యులు (తిరుపతి), ఎ.వి.రమణదీక్షితులు (తిరుమల), పి.వి.ఎస్.ఎస్.ఆర్. రామానుజాచార్యులు (ద్వారకా తిరుమల), వేదాంతం దేశికాచార్యులు (అప్పికట్ల), నల్లూరి సీతారామాచార్యులు (బాపట్ల), ఎస్.ఎ.కె.సుందర్‌వరదన్ (మహబూబ్‌నగర్), వెంకటకృష్ణ భట్టాచార్యులు (చెన్నై)లు ఉన్నారు. గత కొంతకాలంగా శ్రీవారి ఆలయంలో పూజా కార్యక్రమాలు సక్రమైన రీతిలో జరగడంలేదని చినజీయర్ స్వామి ఆరోపిస్తున్నారు. ఆగమ సలహామండలి మాత్రం సక్రమంగా జరుగుతున్నాయని వాదిస్తోంది. ఈ నేపథ్యంలో ముఖ్యమంత్రి వద్ద జరిగిన సమావేశంలో చినజీయర్ స్వామి ఆగమ సలహామండలిని రద్దు చేయాలని డిమాండ్ చేసినట్లు తెలిసింది. మరోవైపు దక్షిణభారతంలోని వివిధ మఠాలకు చెందిన పీఠాధిపతులు ధర్మప్రచారానికి తమకు నిధులు కేటాయించాలని తితిదేకు లేఖలు పంపారు. మంగళవారం సమావేశంలో చినజీయర్‌కు నిధుల మంజూరుతో పాటు ఇతర పీఠాధిపతుల విన్నపాలను పరిశీలించనున్నారు. అలాగే ఆగమ సలహామండలి రద్దు అంశం కూడా చర్చించే అవకాశం ఉంది.

### ఆలయ సంస్కృతిని ధ్వంసం చేసే చట్టంపై పోరాటం

హైదరాబాద్: ఆలయ సంస్కృతిని ఛిన్నాభిన్నం చేసే దేవాదాయ ధర్మాదాయ చట్టాని (30/87)కి వ్యతిరేకంగా పోరాటం చేయనున్నట్లు దేవాలయాల పరిరక్షణ ఉద్యమ సంస్థ ప్రకటించింది. సోమవారం నగరంలో ఏర్పాటు చేసిన విలేకరుల సమావేశంలో సంస్థ జాయింట్ కన్వీనర్ సి.ఎస్.రంగరాజన్ మాట్లాడారు. ఈ చట్టాన్ని వ్యతిరేకిస్తూ చినజీయర్‌స్వామి ప్రభుత్వానికి తన నిరసన గళంతో ఎదురునిల్వారని తెలిపారు. నిజానికి మత గురువులు, పీఠాధిపతులు ఐక్యంగా దీన్ని వ్యతిరేకించి ఉంటే, ఈ చట్టానికి పురిట్లోనే సంధి కొట్టేదన్నారు. ఈ చట్టాన్ని తి.తి.దే. పరిస్థితుల్ని దృష్టిలో ఉంచుకుని రూపొందించారని ఆరోపించారు.

# శాంతి, సౌభాగ్యాల స్థాపనకు ఆలయాల్లో ఆగమ సంస్కృతి

## చినజీయర్ స్వామి సూచన

హైదరాబాద్, ఫిబ్రవరి 26 (న్యూస్‌టుడే): సమాజంలో శాంతి, సౌభాగ్యాల స్థాపనకు అన్ని దేవాలయాల్లో ఆగమ సంస్కృతి, సంప్రదాయం, ఇతర విధానాలను అవలంబించాలని శ్రీ త్రిదండి చినజీయర్ స్వామి పేర్కొన్నారు. రాష్ట్రంలోని అన్ని దేవాలయాల్లో ఆగమ సంస్కృతిని ప్రవేశపెట్టేందుకు అధికారులు కృషి చేయాలని కోరారు. ఆగమ శాస్త్రం ప్రాముఖ్యాన్ని గుర్తించి దేవాలయ వ్యవస్థలో దాన్ని పాటించేందుకు పాలకులు సహకరించాలని ఆయన పేర్కొన్నారు. గురువారం ఇక్కడి మర్రిచెన్నారెడ్డి మానవ వనరుల అభివృద్ధి సంస్థలో దేవాలయాల ధర్మకర్తలు, కార్యనిర్వాహక అధికారులు, అర్చకుల శిక్షణ కార్యక్రమంలో చినజీయర్ స్వామి పాల్గొన్నారు. దేవుడికి, భక్తులకు సేవలందించే సమయంలో అర్చకులు తరాలుగా వస్తున్న సంప్రదాయాన్ని తు.చ తప్పకుండా పాటించాలని సూచించారు. రాష్ట్రంలోని ఆలయాలను సేవా కేంద్రాలుగా తీర్చిదిద్దేందుకు ప్రభుత్వం ప్రయత్నిస్తోందని మర్రిచెన్నారెడ్డి మానవ వనరుల సంస్థ డైరెక్టర్ జనరల్ పి.వి.ఆర్.కె. ప్రసాద్ తెలిపారు. ఇందులో భాగంగా ధర్మకర్తలు, ఈఓలు, అర్చకులు పోషించాల్సిన పాత్రపై వివరించేందుకు ఈ కార్యక్రమాన్ని ఏర్పాటు చేసినట్లు చెప్పారు. ఆలయాల్లో ఆగమ శాస్త్రాన్ని ప్రవేశపెట్టేందుకు శిక్షణ కార్యక్రమం ఉపయోగపడుతుందని దేవాదాయ కమిషనర్ కె.వి.రామాచారి పేర్కొన్నారు.

27-2-2004 ఈనాడు

# ఓట్ల కోసమే చినజీయర్ స్వామికి నిధుల కేటాయింపు

1-3-04 - వార్త

హైదరాబాద్, ఫిబ్రవరి 29 (ప్రభాతవార్త) రానున్న ఎన్నికలను దృష్టిలో పెట్టుకొని ఓట్లకోసమే ముఖ్యమంత్రి ఎన్. చంద్రబాబు నాయుడు త్రిదండి శ్రీమన్నారాయణ చినజీయర్ స్వామికి తిరుమల తిరుపతి దేవస్థానం నిధుల నుండి రెండు కోట్ల రూపాయలను మంజూరు చేసి ఉంటారని కంచి కామకోటిపీఠాధిపతి శ్రీ జయేంద్ర సరస్వతి స్వామీజీ వ్యాఖ్యానించారు. చినజీయర్ స్వామీజీ విశిష్టాద్వైత మతాన్ని వ్యాప్తం చేసే ప్రచారకుడు మాత్రమేనని ఆయన ఏ పీఠానికి అధిపతి కాదని కంచిపీఠాధిపతి స్పష్టం చేశారు. తిరుమల తిరుపతిలో జరుగుతున్న సంఘటనలపై, త్రిదండికి టిటిడి రెండు కోట్లు మంజూరుచేసిన విషయాలపై విలేకరులు ఆదివారం స్వామీజీని ప్రశ్నలతో ముంచెత్తారు. ఆ ప్రశ్నలపై స్పందిస్తూ స్వామీజీ పై విధంగా అభిప్రాయాలను వెల్లడించారు. తొలుత విలేకరుల సమావేశాన్ని ప్రారంభిస్తూ స్వామీజీ టిటిడిలో వేంకటేశ్వరస్వామి సన్నిధానంలో పరంపరగా వైఖానస ఆగమ సంప్రదాయం విరాజిల్లుతూ వస్తున్నదనీ, ఈ సంప్రదాయపద్ధతులు అనూచానంగా హాయిగా చక్కని విధానంలో కొనసాగుతూ వస్తున్నాయని ఇందులో ఎవరూ జోక్యం చేసుకోవాల్సిన అవసరం లేదని హితవు చెప్పారు. ఒకవేళ తిరుపతిలో ఆగమ సంప్రదాయాలలో సలహాలను ఇవ్వాల్సి వస్తే ఆ అర్హత వైఖానస ఆగమపండితలకు, వైఖానససంప్రదాయవిజ్ఞులకు మాత్రమే ఉన్నదని ఆయన చెప్పారు. తిరుపతిదేవుడిని ఆదిశంకరాచార్య, మధ్వాచార్య, రామానుజాచార్య దర్శనం చేసుకున్నారనీ, షణ్మత స్థాపకులైన ఆదిశంకరాచార్య తిరుపతిలో జనాకర్షణకు, ధనాకర్షణకు యంత్రాలను ప్రతిష్టించినవిషయం చరిత్ర తెలిసినవారందరికీ తెలుసునని స్వామీజీ అధిక్షేపణ పూర్వకంగా జ్ఞాపకం చేశారు. తిరుపతిలో తన పెత్తనాన్ని పెంచుకునేందుకు చినజీయర్‌స్వామీజీ ప్రయత్నిస్తున్నారనీ కంచిపీఠాధిపతి అన్నారు. బదరీనాథ్‌లోని వైష్ణవక్షేత్రాన్ని కూడా ఆదిశంకరాచార్యప్రతిష్ఠించారని స్వామీజీ ఉదహరించారు.

**దేవుడి దగ్గర రాజకీయం వద్దు**

తిరుపతి వంటి పవిత్ర క్షేత్రంలో రాజకీయం చేయవద్దనీ, ఇది తగిన పనికాదనీ జయేంద్రస్వామీజీ విశదపరిచారు. తిరుమల తిరుపతి క్షేత్రం నుండి వచ్చిన అర్చకులు, అధికారులు, నిర్వాహకులు చెప్పిన విషయాల ప్రకారం తాము తప్పని పరిస్థితులలో ఈ వ్యాఖ్యానాలను చేస్తున్నామని చెప్పారు. ' మీరు కూడా త్రిదండిని" ఆక్షేపిస్తూ రాజకీయాల అగ్నికి ఆజ్యం పోస్తున్నారుకదా? అంటూ ప్రశ్నించగానే ఆయన ప్రత్యుత్తరమిస్తూ తాము ప్రపంచసత్యాన్ని చెప్తున్నామనీ, త్రిదండి విశిష్టాద్వైత మత సంప్రదాయాన్ని చెప్తున్నారనీ అన్నారు. చినజీయర్ ఈ విషయాలన్నీ తెలిసి కూడా ఎందుకు జోక్యం చేసుకుంటున్నారని అడిగినప్పుడు స్వామీజీ అక్కడ డబ్బు దండిగా ఉన్నదికదా అందుకని అంటూ ప్రత్యుత్తరమిచ్చారు. విశ్వహిందూపరిషత్తు త్రిదండి విధానాన్ని సమర్థించికదా అంటూ ప్రశ్నించినప్పుడూ కూడా జయేంద్ర స్వామీజీ వాళ్లుకూడా ధర్మ ప్రచారానికి నిధులు కోరుకుంటున్నారో?ఏమో? అంటూ చమత్కరించారు. ఒకవేళ మీకుకూడా ధార్మిక ప్రచారానికి నిధులు ఇస్తే స్వీకరిస్తారా? అని ప్రశ్నించినప్పుడు ఆయన అప్పుడు ఆలోచిస్తామని దాటవేశారు.

**మేము వైష్ణవ ద్వేషులం కాదు**

తాము వైష్ణవ ద్వేషులం కాదనీ, విష్ణుమూర్తి తమకు ఆరాధ్యదైవమనీ, విష్ణుమూర్తి నరసింహావతారంపై ఆదిశంకరాచార్య గొప్పస్తవాన్ని రచించారనీ కంచిపీఠాధిపతి ఉదహరించారు. టిటిడి సంప్రదాయ పద్ధతులలో ప్రభుత్వం కాని మరే ఇతర సంస్థలు కాని జోక్యం చేసుకోవడం మంచిదికాదనీ చెప్పారు. అక్కడ సేవలు, ఇతర పూజావిధానాలు, ఉత్సవాలు వైఖానస ఆగమ సంప్రదాయపద్ధతులలో చక్కగా జరుగుతున్నాయన్నారు.

## చినజీయర్ స్వామికి నిధుల చెల్లింపు ఆపండి

అందుకు టిటిడి నిరాకరించడంతో దేవాలయంలో చేస్తు న్న పూజా విధానాలలో లోపాలు ఉన్నాయని.. ఆగమ శాస్త్రాల ప్రకారం పూజా విధానాలు జరగడం లేదంటూ బ్లాక్ మెయిలింగ్‌కు దిగారని తెలిపారు. దీంతో టిటిడి దిగి వచ్చి చిన జీయర్ స్వామి కోరినట్లు 5 కోట్ల రూపాయలు కాకుండా 2.5 కోట్ల రూపాయలు చెల్లించాలని ఫిబ్రవరి 24, 25 తేదీల్లో జరిగిన కార్యవర్గ సమావేశాల్లో నిర్ణయిం చిందని చెప్పారు. టిటిడి తీసుకొన్న నిర్ణయం చట్ట విరుద్ధమే కాకుండా రాజ్యాంగ విరుద్ధమని ఆయన అన్నారు. దేవాదాయ చట్టం సెక్షన్ 111 ప్రకారం నిధులను ఇష్టానుసారం కేటాయించే హక్కు టిటిడికి లేదని రామచంద్రరావు తన వాదనలో పేర్కొన్నారు. దేశాన్ని పాలించిన బ్రిటిష్ వారు సైతం వెంకటేశ్వరస్వామి నిధుల జోలికి వెళ్లలేదని తెలిపారు. ఇప్పుడు చిన జీయర్ స్వామికి నిధులు కేటాయిస్తే రేపు మిగిలిన పీఠాధిపతులు.. మఠాధిపతులు తమ కు కూడా నిధులు కేటాయించాలని డిమాండ్ చేస్తారని తన వాదనలో పేర్కొన్నారు. ప్రభుత్వం తరపున న్యాయవాదులు తన వాదనలను వినిపిస్తూ దేవాదాయ చట్టం 111 ప్రకారం నిధులను ఎవరికైనా కేటాయించే హక్కు..అధికారం టీటీడీకి ఉన్నాయని అన్నారు. చిన జీయర్ స్వామికి టిటిడి కేటాయిస్తున్న నిధులు ధర్మ ప్రచారం కోసం తప్ప వ్యక్తిగత పనుల కోసం కాదని తెలిపారు. ఇరుపక్షాల వాదనలు విన్న హైకోర్టు ధర్మాసనం రిట్‌ను విచారణకు స్వీకరిస్తూ.. జీయర్ స్వామికి నిధుల చెల్లింపును ఆపాలని మధ్యంతర ఉత్తర్వులు జారీ చేసింది. అంతేకాక చిన జీయర్ స్వామికి వ్యక్తిగతంగా నోటీసులు జారీ చేయాలని కూడా ఆదేశించింది. కేసును తదుపరి విచారణ నిమిత్తం కేసును నాలుగు వారాలకు వాయిదా వేసింది.

సోమవారం మార్చి 1, 2004 – ఈనాడు

## దేవుడిపై రాజకీయాలొద్దు

### చినజియ్యర్‌కు శంకరాచార్య హితవు

హైదరాబాద్, ఫిబ్రవరి 29 (న్యూస్‌టుడే): తిరుమలలో కలియుగం ప్రారంభం నుంచి జరుగుతున్న పూజా విధానాలను మార్చాలని త్రిదండి చినజియ్యర్ స్వామీజీ డిమాండ్ చేయడం సమంజసం కాదని కంచి కామకోటి పీఠాధిపతి జయేంద్ర సరస్వతి స్వామీజీ అన్నారు. ఇలాంటి విషయాల్లో రాజకీయం చేయడం భావ్యం కాదన్నారు. చినజియ్యర్ స్వామి విశిష్టాద్వైతానికి చెందిన ఒక మత ప్రచారకుడే తప్ప పీఠాధిపతి కాదని ఆయన స్పష్టం చేశారు. తిరుమల పూజలపై చినజియ్యర్ చేస్తున్న వ్యాఖ్యలు భక్తుల్లో గందరగోళాన్ని, ఆయోమయాన్ని సృష్టిస్తున్నాయన్నారు. విశ్వ హిందూ పరిషత్, మరికొన్ని సంస్థలు ఆయనను సమర్థించడం భావ్యం కాదన్నారు.

కాకినాడ, మార్చి 9, ప్రభాతవార్త

వేదపుంగవులు నెలకొల్పిన సనాతన ధర్మ సంస్కృతిని పరిరక్షించదానికి రాద్ధాంతమా అని శ్రీ త్రిదండి శ్రీమన్నారాయణ రామానుజ చినజీయ్యర్‌స్వామి ఆశ్చర్యాన్ని వ్యక్తం చేశారు. స్థానిక

## చిన జీయర్ ఆవేదన

లేడీస్‌క్లబ్ ఆవరణలో మంగళవారం నిర్వహించిన గీతాజ్యోతి ధర్మ క్షేత్ర ఆధ్యాత్మిక సదస్సులో స్వామి పాల్గొని ప్రవచించారు. సమాజ క్షేమం తప్ప స్వలాభాపేక్ష స్వాములకు లేదన్నారు. గీతజ్యోతి ధర్మప్రచారం నిమిత్తం టిటిడి ఐదు కోట్ల రూపాయలు ఆర్థిక సహకారం అందిస్తామన్నారు. కాకినాడలో నిర్వహిస్తున్నది 55వ ధర్మక్షేత్ర, ధార్మిక సదస్సని తెలిపారు. ఈ నేపథ్యంలో తమ ధార్మిక ప్రచారానికి టిటిడి రెండున్నర కోట్లు ఆర్థికసహాయం అందిస్తున్నట్లు ప్రకటించారు. దీనిమీద రగడ జరగడం శోచనీయమని పేర్కొన్నారు. బృహత్తర ఆధ్యాత్మిక కార్యక్రమాలపై అలజడి సృష్టించడం తగునా అని

నేపథ్యంలో తమ ధార్మిక ప్రచారానికి టిటిడి రెండున్నర కోట్లు ఆర్థికసహాయం అందిస్తున్నట్లు ప్రకటించారు. దీనిమీద రగడ జరగడం శోచనీయమని పేర్కొన్నారు. బృహత్తర ఆధ్యాత్మిక కార్యక్రమాలపై అలజడి సృష్టించడం తగునా అని

ప్రశ్నించారు. ధార్మిక సేవ చేస్తూ ధర్మం కోసం బతుకుతున్నాం. ఒకర్ని విమర్శించడం తమ పనికాదన్నారు.

# 'గీతాజ్యోతి'ని వక్రీకరించొద్దు

## చినజీయరు స్వామి హితవు

శ్రీకాకుళం కల్చరల్, మార్చి7ప్రభాతవార్త

స్వీయ ఆరాధన, సర్వ ఆదరణ లక్ష్యంతో చేస్తున్న గీతాజ్యోతి కార్యక్రమాన్ని వక్రీకరించడం తగదని త్రిదండి రామానుజ చినజీయరుస్వామి అన్నారు. ఆదివారం ఉదయం నారాయణ తిరుమల క్షేత్రంలో ఆయన విలేకరుల సమావేశంలో మాట్లాడారు. అవగాహన లోపంతో చేస్తున్న మార్పులు సంప్రదాయ విరుద్ధంగా వున్నప్పుడు వాటిని నిలువరించాల్సిన బాధ్యత ధర్మ ప్రచారకుల మీద ఉందన్నారు. స్వీయ ఆరాధన, సర్వ ఆదరణతో గీతాజ్యోతి కార్యక్రమాన్ని నిర్వహిస్తున్నట్లు తెలిపారు. దీనికి మౌలిక సదుపాయాలు కల్పించమని తిరుమల తిరుపతి దేవస్థానాన్ని కల్పించమని కోరామన్నారు. 23 జిల్లాల్లో ప్రచారం కోసం 23 వాహనాలను టివి, ఆడియో సదుపాయాలతో అందించమని కోరామన్నారు. కొంత మంది ప్రచారకులకు గౌరవభృతిని కూడా కల్పించమని కోరామని, 25 కోట్లతో కూడిన పథకం ఇదన్నారు. ఆంధ్రప్రదేశ్ వికాస తరంగిణి దాతలు, భక్తుల హార్దిక, ఆర్థిక సహకారంతోచేస్తున్న కార్యక్రమమన్నారు. 53 గీతాజ్యోతి కార్యక్రమాలు నిర్వహించడం జరిగిందన్నారు. 54వ కార్యక్రమంగా దీనిని శ్రీకాకుళంలో నిర్వహించి 55 కార్యక్రమంగా కాకినాడలో నిర్వహించడానికి వెళ్తున్నట్లు చెప్పారు.

### దేవుని ధనంతో నిర్వహిస్తే తప్పేముంది?

సమాజంలోని భక్తుల కానుకలతో నిండిన దైవనిధిని అదే సమాజశ్రేయస్సు కోసం కార్యక్రమాల నిర్వహణకు ఖర్చు చేయడంలో తప్పేముందని ఒక ప్రశ్నకు సమాధానంగా చినజీయరు స్వామి చెప్పారు. తిరుమలలో అమలు చేస్తున్న మాస్టర్ ప్లాన్‌లో లోపాలను తెలియజేశాన్నారు. దీనిని సరిచేసి ప్రతిపాదనలతో మరికొద్ది రోజుల్లో కలవనున్నట్లు తెలిపారు. క్షేత్రంలో చోటు చేసుకుంటున్న అనాచారాలను నిరోధించడానికి ఒక ప్రత్యేక యంత్రాంగం అవసర మన్నారు. ఆచార్యపురుషులు, జీయర్‌స్వాములు ఈ కార్యక్రమాన్ని చేపట్టేవారని, వారికి పూర్వపు గౌరవాన్ని ఇచ్చి నిలబెట్టాలన్నారు. దేవాలయాన్ని వాటి వాటి సంప్రదాయ రీతుల్లో కొనసాగనీయాలని, అది చేతకానప్పుడు వాటి ప్రసక్తిని మనం ఎత్తకూడదన్నారు. సమావేశంలో శ్రీకాకుళం వికాస తరంగిణి సభ్యులు విశాలగుప్తా, సనపల జగన్నాథరావు, బేబి, తల్లాప్రగడ అరుణ, గుమ్మా నగేష్, గుమ్మా నాగరాజు, టి.పి.శ్రీనివాస్, రామానుజం పాల్గొన్నారు.

8-3-04 - సోమవారము - వార్త

1-3-04 - వార్త

హైదరాబాద్ 5

# తొలగించినచోటే వేయికాళ్ళ మండపం

తిరుమల, ఫిబ్రవరి29(ప్రభాతవార్త)

తిరుమలలో శ్రీవెంకటేశ్వర స్వామి వారి ఆలయం ఎదురుగా తొలగించిన వేయికాళ్ళ మండపాన్ని అదే ప్రాంతంలోపునర్నిర్మించాలని శ్రీ త్రిదండి రామానుజ చిన్నజీయర్ స్వామి కోరారు. తిరుమలలోని చిన్నజీయర్‌మఠంలో ఆదివారం ఏర్పాటు చేసిన విలేకరుల సమావేశంలో స్వామి మాట్లాడుతూ వేయికాళ్ళ మండపాన్ని అదే ప్రాంతంలో నిర్మించడంతోపాటు పూర్వ వైభవాన్ని తీసుకురావడానికి టిటిడి అధికారులు తగిన చర్యలు తీసుకోవాలని సూచించారు. ఈ మండపాన్ని వేరొక ప్రాంతంలో పునర్నిర్మించినట్టయితే చారిత్రకత, పూర్వవైభవం దెబ్బతింటుందనే అభిప్రాయాన్ని ఆయన వ్యక్తం చేశారు. చారిత్రాత్మక స్థలాలను మార్పు చేయకుండా వాటి గొప్పదనాన్ని ప్రజలు గుర్తించగలిగే విధంగా టిటిడి తగిన చర్యలు తీసుకోవాల్సి వుందన్నారు. ఇక వేయికాళ్ళ మండపంలోనే ఉత్సవాలను నిర్వహించే విధంగా ప్రణాళికను సిద్ధం చేయాలన్నారు. అంతేకాకుండా మండపంలో భక్తులు ఉత్సవాలను తిలకించడానికి అవకాశం కల్పించాలని కూడా సూచించారు. దీనికి సంబంధించి ఇప్పటికే నమూనాలను పరిశీలిస్తున్నట్టు చెప్పారు. గతంలో పెరుమాళ్‌కు అధ్యయనోత్సవాన్ని వేయికాళ్ళ మండపంలోనే నిర్వహించేవారని తెలిపారు. ఈ మండపం పునర్నిర్మాణం కోసం నిపుణులు శ్రీరంగం తదితర ప్రాంతాలకు వెళ్ళి అక్కడ వున్న ఆలయాలను పరిశీలించాలని కోరారు. దీనికోసం నిపుణులతో కూడిన బృందాన్ని ఏర్పాటు చేస్తున్నట్టు వివరించారు. ఈ బృందం దక్షిణ భారతదేశంలోని వివిధ ఆలయాలను పరిశీలించి వేయికాళ్ళ మండపం పునర్నిర్మాణంపై నివేదికను తయారుచేయనున్నదని వివరించారు. ఈ నివేదిక ఆధారంగా 10-15 రోజుల్లో వేయికాళ్ళ మండపం పునర్నిర్మాణ అంశానికి సంబంధించి తగిన నిర్ణయం తీసుకోనున్నట్టు తెలిపారు. శ్రీవెంకటేశ్వర స్వామి వారి ఆలయం ఎదురుగా వున్న గొల్లమండపాన్ని అక్కడ నుంచి తొలగించరాదని చిన్నజీయర్ స్వామి టిటిడి అధికారులకు సూచించారు. చారిత్రాత్మకమైన గొల్లమండపాన్ని అక్కడే వుంచడంతో పాటు దాని చరిత్రను తెలిపే శిలాశాసనాన్ని ఆ ప్రాంతంలో ఏర్పాటు చేయాలని టిటిడిని కోరారు. తిరుమలలో ఉత్సవాల సందర్భంగా స్వామివారి వాహనాలు తిరిగేందుకు వీలుగా ప్రత్యామ్నాయ ఏర్పాట్లు చేపట్టాలని సూచించారు.



చినజీయర్ స్వామి

[illegible]-04 - ఈనాడు

## సౌకర్యాల కోసం సంప్రదాయాన్ని విస్మరించరాదు

### తితిదేకు చిన్నజియ్యర్ హితవు

తిరుమల, ఫిబ్రవరి 29 (న్యూస్‌టుడే): భక్తులకు సదుపాయాలను కల్పించడం కోసం సంప్రదాయాలను విస్మరించడం సరైన విధానం కాదని త్రిదండి శ్రీమన్నారాయణ రామానుజ చిన్నజియ్యర్ స్వామి తితిదేకు హితవు చెప్పారు. శని, ఆదివారాలలో తితిదే పాలక మండలి ఛైర్మన్ డి.కె.ఆదికేశవులు, ఈవో అజేయ కల్లం, జేఈవో పి.బాలసుబ్రహ్మణ్యంలతో సమీక్షించిన తర్వాత ఆదివారం మధ్యాహ్నం ఏర్పాటుచేసిన విలేకరుల సమావేశంలో ఆయన మాట్లాడారు. భక్తుల సదుపాయాలు, విస్తరణ పనులు రెండు అవసరమని అయితే ఈ రెండింటికన్నా సంప్రదాయానికి ఎంతో ప్రాధాన్యం ఉందని ఆయన చెప్పారు.

# 'టి.టి.డి.లో ఆదిశంకరాచార్యుడు సూచించినట్లుగానే నైవేద్యాలు'

హైదరాబాద్, మార్చి 14 (కె.ఎన్.ఎన్): తిరుమల తిరుపతి దేవస్థానంలోశ్రీ వేంకటేశ్వరస్వామికి ఆది శంకరాచార్యులు సూచించిన విధంగా అర్చన, నైవేద్యాదులు ఘనంగా జరుగుతున్నాయని విశాఖ శారదా పీఠాధిపతి స్వరూపానందేంద్ర స్వామి తెలిపారు. అక్కడ జరుగుతున్న వైఖానస పూజావిధానాన్ని తప్పుపట్టడం ద్వారా శాస్త్ర సంబంధ విషయాలలో చినజీయర్‌స్వామి పరిపక్వత, పరిజ్ఞాన లోపాలను చాటుకుంటున్నారని విమర్శించారు. ప్రముఖ పారిశ్రామికవేత్త అల్లూరి సుబ్బారావు ఇంట్లో ఆదివారం యజ్ఞాన్ని నిర్వహించిన ఆయన విలేకరుల సమావేశంలో మాట్లాడుతూ హిందూ ధర్మాన్ని జీర్ణోద్ధరణ స్థితి నుంచి కాపాడిన ఆదిశంకరాచార్యులు సూచించిన వైఖానస పూజా విధానాలపై చినజీయర్ స్వామి అసందర్భ వ్యాఖ్యలు చేస్తున్నారని తెలిపారు. హిందూమతంలో తప్పుడు విధానాలను చొప్పించే ప్రయత్నాలను మానుకోవాలని ఆయన సూచించారు. తిరుమలలో ఆదినుంచీ ధర్మసమ్మతం, శాస్త్రసమ్మతం అయిన వైఖానస విధానంలోనే పూజాధికాలు జరుగుతున్నాయని స్వరూపానందేంద్రస్వామి పేర్కొన్నారు. సనాతన హిందూధర్మ పరిరక్షణ, భవిష్యత్తరాల భక్తజనకోటి కోసం ఈ విధానాన్నే కొనసాగించాలని సూచించారు. జరుగుతున్న అర్చనలు, నైవేద్యాలు స్వామివారిని సంతోష పరుస్తున్నందునే భక్తుల కోరికలు నెరవేరుతున్నాయన్నారు. ఆది శంకరాచార్యులను, ఆయన స్థాపించిన పీఠాలను వేలెత్తి చూపించే ప్రయత్నం చేయడం హిందూమతాన్ని అగౌరవ పరచినట్లేనని స్వామి తెలిపారు. లడ్డుల తయారీ, నివేదన, హారతి తదితరాలు పద్ధతి ప్రకారమే జరుగుతుండగా వాటి విషయంలోనూ చినజీయర్ స్వామి అనవసరంగా జోక్యం చేసుకుంటున్నారని, ఇది ధర్మవిరుద్ధం, శాస్త్ర విరుద్ధం అవుతుందని అన్నారు. షణ్మతాలను స్థాపించిన ఆది శంకరాచార్యుల విధానాలు సర్వజన సమ్మతమై లోకకల్యాణానికి, హిందూధర్మ పరిరక్షణకు బాటలు వేశాయని స్వామి తెలిపారు.దేవాలయాల నిర్మాణంలో ఆగమ శాస్త్రాన్నే ప్రమాణంగా తీసుకోవాలన్నారు.

**తిరుమలలో**
**శ్రీ వైఖానస ఆగమ సదస్సు:**

తిరుమలలో అనుసరిస్తున్న వైఖానస పూజావిధానంపై రెండురోజుల పాటు చర్చాగోష్ఠిని నిర్వహించనున్నట్లు శారదా పీఠాధిపతి వెల్లడించారు. శ్రీ వైఖానస ఆగమ సదస్సు పేరిట తిరుమలలోని శ్రీవారి ఆస్థాన మండపంలో నిర్వహించే ఈ కార్యక్రమంలో దేశంలోని వివిధ ప్రాంతాలకు చెందిన వేదపండితులు పాల్గొంటారని తెలిపారు. ఈ నెల 22, 23 తేదీలలో జరిగే సదస్సులో వైఖానస పూజా విధాన ప్రాశస్త్యాన్ని భక్తులకు వివరిస్తామని చెప్పారు. ఈ సదస్సులో పాల్గొని చర్చించేందుకు గాను చినజీయర్‌స్వామిని పత్రికా ముఖంగా ఆహ్వానిస్తున్నామన్నారు. గృహవాస్తుకు, ఆగమ శాస్త్రానికి ఎటువంటి సంబంధం లేదని ఆయన అన్నారు. ఏకాంత పూజకు ఖచ్చితంగా ఇంత సమయాన్ని కేటాయించాలని వైఖానస పూజా విధానంలో పేర్కొనలేదని పేర్కొన్నారు.

15-3-04 - సోమవారము - ఆంధ్రప్రభ

# చినజీయర్ స్వామికి నిధుల చెల్లింపు ఆపండి

## టిటిడికి హైకోర్టు ఉత్తర్వులు

హైదరాబాద్, మార్చి 5 (ఆన్‌లైన్) : చిన జీయర్ స్వామికి 2.5 కోట్ల రూపాయల చెల్లింపును నిలిపివేయాలంటూ రాష్ట్ర హైకోర్టు ధర్మాసనం మధ్యంతర ఉత్తర్వులు జారీ చేసింది. అంతేకాక జీయర్ స్వామికి వ్యక్తిగతంగా నోటీసులు జారీ చేయాలని కూడా హైకోర్టు ప్రధాన న్యాయమూర్తి జస్టిస్ దేవీందర్‌గుప్తా, జస్టిస్ రోహిణిలతో కూడిన ధర్మాసనం ఆదేశించింది. చిన జీయర్ స్వామికి 2.5 కోట్ల రూపాయలు చెల్లించాలన్న టిటిడి, రాష్ట్ర ప్రభుత్వాల నిర్ణయాన్ని సవాలు చేస్తూ ప్రజాపార్టీ రాష్ట్ర అధ్యక్షుడు గిరి యాదవ్ దాఖలు చేసిన రిట్ పిటిషన్‌ను ధర్మాసనం విచారణకు స్వీకరించింది. కేసును తదుపరి విచారణ నిమిత్తం నాలుగు వారాలకు వాయిదా వేసింది. పిటిషనర్ తరపున కేసు వాదిస్తున్న సీనియర్ న్యాయవాది శ్రీరామగిరి రామచంద్రరావు శుక్రవారం నాడు ధర్మాసనం ముందు తన వాదనలను వినిపించారు. పేదలు, ధనిక వర్గాలు వారి వారి స్థాయిని బట్టి విరాళాలు ఇస్తుంటారని.. అటువంటి వాటిని ఆలయ అభివృద్ధికి ఖర్చు చేయాలే తప్ప ఇష్టానుసారంగా ఎవరికి పడితే వారికి కేటాయించడం తగదని ఆయన తన వాదనలో పేర్కొన్నారు. ధర్మ ప్రచార నిమిత్తం టిటిడిని 5 కోట్ల రూపాయలు చిన జీయర్ స్వామి డిమాండ్ చేశారని..

మిగతా 6వ పేజీలో

ఈ విధముగ వచ్చిన స్వాముల ప్రకటనలకు **ఆచార్య శ్రీ ప్రబోధానంద యోగీశ్వరులు** ఇచ్చిన పత్రికా ప్రకటనలు ఈ విధముగ ఉన్నవి.

# ఆగమశాస్త్రమంటే ఏమిటో పీఠాధిపతులు తెలపాలి

**ఆచార్య ప్రబోధానంద యోగీశ్వరులు**

**ధర్మవరం టౌన్, మార్చి 6 (ప్రభాతవార్త)**

మానవులను దైవత్వం వైపుకు తీసుకెళ్ళాల్సిన పీఠాధిపతులు తిరుమల తిరుపతి దేవరస్థానంలో నెలకొన్న ఆగమశాస్త్రవిభేదాలు తారాస్థాయికి చేరుకున్నాయని. అసలు ఆగమశాస్త్రమంటే ఏమిటో పీఠాధిపతులు, ప్రచారకులు తెలపాలని ఆచార్య ప్రబోధానంద యోగీశ్వరులు కోరారు. స్థానికంగా శనివారం జరిగిన విలేకరుల సమావేశంలో ఆయన మాట్లాడుతూ మనుషులకు దైవత్వాన్ని కల్గించాల్సిన పీఠాధిపతులు, ప్రచారకులు ఒకరిపై ఒకరు విమర్శలు చేసుకోవడంతో ఇతరమతాల్లో హిందూవులంటే ఏహ్యాభావం కలిగేలా చేస్తుందన్నారు. ఆగమశాస్త్రం అంటే ఏమిటో, వాటిని ఎవరు తయారుచేశారు, అది శాస్త్రమేనా, అది మానవునికి దైవారాధనలో ఉపయోగపడుతుందా అన్న అంశాలను అందరికీ తెలియచేయడానికి తాము న్యాయస్థానాన్ని ఆశ్రయించనున్నామన్నారు. ప్రపంచంలోవున్న ఆరుశాస్త్రాలతోపాటు వాస్తు, జ్యోతిష్యశాస్త్రాలున్నాయని చెప్పేవారి మాటలకు అర్థం లేదన్నారు. కృత, త్రేతాయుగాల్లో లేని శైశవులు, వైష్ణవులు కలియుగంలో తయారుకావడం శోచనీయమన్నారు. ఈ విషయంపై తాను హేతుబద్ధంగా వివరించగలనని, స్వాములు చేస్తున్న వాటిని హిందూ సాంప్రదాయాలతో వివరించగలనని, దీనిపై ఎక్కడైనా, ఏవేదికపైనైనా చర్చించడానికి సిద్ధమని స్పష్టం చేశారు. భారతదేశంలో అద్వైత, విశిష్టాద్వైత సిద్ధాంతాలున్నాయని, వీటికి బదులుగా తాను త్రైత సిద్ధాంతాన్ని నెలకొల్పాననన్నారు. కనీసం హేతువాది అడిగిన ప్రశ్నకు కూడా సరైన జవాబివ్వలేని పీఠాధిపతులు ఇటు ప్రజలను, అటు ప్రభుత్వాన్ని మభ్యపెట్టడం పాపంతో కూడిన పనిగా ఆయన అభివర్ణించారు.

# Prabodhananda too points finger at TTD

**FROM OUR BUREAU**

**Hyderabad, March 11:** Acharya Prabodhananda Yogeeswarulu, Thraitha Peethadipati, founder Prabodha Seva Samiti and president of Ghana Vignana Vedika says that the Tirumala Tirupati Devasthanam has failed to follow the traditions and rituals properly in the temple town of Tirumala.

Addressing mediapersons here on Thursday, the Peethadipati has invited all religious heads to an open discussion on this topic.

He said, contrary to what TTD claims, the temple will not suffer from any *Vaastu* problems if a new building is constructed in its vicinity. He cautioned people that they should not blindly believe everything the Tirumala Tirupati Devasthanams tells them.

"The Tirumala Tirupati Devasthanams have never followed any tradition. All the religious heads should come together and work for the betterment of the temple town. But instead they are busy criticising each other," he said.

He said religious heads should stop making wild allegations against each other and chalk out a solution to combat problems in Tirupati.

# 'దేవాలయాలు సందేశ వారధిలాంటివి

అనంతపురం ఓల్డ్‌టౌన్, మార్చి 14 (ఆన్‌లైన్): దేవాలయాలు మానవునికి, దేవునికి మధ్య సందేశ వారధిలాంటివని, దేవుడు ఇలాంటివాడు, ఆయనను తెలుసుకోవడానికి ఈ పద్ధతులు ఆచరించాలనే దైవ సందేశాన్ని సూచించే చిహ్నాలు దేవాలయాల్లో సంపూర్ణంగా ఉండేలా ఆనాటి పెద్దలచే నిర్మించబడ్డాయని త్రైత సిద్ధాంత ఆదికర్త, స్థాపకులు ఆచార్య ప్రబోధానంద యోగీశ్వరులు పేర్కొన్నారు. ఆదివారం ప్రెస్ క్లబ్ కాన్ఫరెన్స్ హాల్‌లో ప్రబోధ సేవా సమితి, జ్ఞాన విజ్ఞాన వేదిక ఏర్పాటు చేసిన సదస్సుకు ఆయన ముఖ్య అతిథిగా హాజరయ్యారు. ఈ సందర్భంగా ఆయన మాట్లాడుతూ పూర్వం బ్రహ్మవిద్యా శాస్త్రాన్ని అనుసరించి దేవాలయాలను నిర్మించారన్నారు. దేవాలయ నిర్మాణాలల్లో మొట్టమొదట నిర్మించిన ఆలయం ఈశ్వరాలయమని, తరువాత శ్రీరంగదేవాలయ నిర్మాణం జరిగిందన్నారు. ముఖ్యమైన దేవాలయాల్లో ఈ నాటికి అలాంటి సందేశాలతో కూడుకున్న నిర్మాణాలు ఉన్నాయని, కొన్ని కాలగర్భంలో కలిసిపోయాయన్నారు. దేవాలయాలు మానవునికి గొప్ప జ్ఞాన సందేశాన్ని ఇచ్చే జ్ఞాన చిహ్నాలై ఉండగా ఆలయంలో ఆరాధనా విధానం, జ్ఞానం తెలుసుకొని దేవునివైపు ప్రయాణిస్తున్నానని మనవుడు తెలసుకొనే ఉద్దేశ్యపూరిత కార్యక్రమాలై ఉన్నాయన్నారు. దేవాలయాల్లో ఆరాధకుడు తన భక్తిని వ్యక్త పరిచే విధానం పూర్వం ఉండేదన్నారు. కృత, త్రేతా, ద్వాపర యుగాలు గడిచి కలియుగంలో దేవాలయాల్లో దైవత్వ జ్ఞానమున్నదని తెలియకపోయిందన్నారు. ఆలయంలో దైవ సూచనయు తెలియనప్పుడు మానవుని భక్త భావం కూడా తప్పు మార్గంలో ఉంటుందన్నారు. ఆలయాల్లో పాటించాల్సిన విధానాలను, ఆచరించాల్సిన పద్ధతులను భక్తులకు తెలియజేయాల్సిన వారు బ్రహ్మవిద్యా శాస్త్రం తెలిసినవారన్నారు. బ్రహ్మవిద్యా శాస్త్రంలోని హేతుబద్ధతను తెలియజేయాల్సిన వారు కలియుగంలో లేకుండాపోయిన సందర్భంలో క్రీస్తుశకం 677 సంవత్సరం కేరళ రాష్ట్రంలో శంకరాచార్యులు ఉద్భవించి 'అద్వైత సిద్ధాంతాన్ని' ప్రతిపాదించి మానవులకు బోధించారని, అనంతరం 970 సంవత్సరంలో రామానుజాచార్యులు ఉద్భవించి 'విశిష్ట దైవత్వం'ను బోధించారన్నారు. వీరిరువురు తమ సిద్ధాంతాలను బోధించి మనుషులను శైవులని, వైష్ణవులని వర్గ బేధాలను కల్పించారు కాని దేవాలయాల్లో పూర్వార్థాలను తెలుపలేకపోయారన్నారు. దాంతో ఆలయాలు రెండు వర్గాలయిపోయి అక్కడ సూచనలే తెలియకుండా పోయాయన్నారు. అంతటితో ఆగకుండా ఆగమశాస్త్రమని కొత్త నియమాలను మనిషి దేవాలయాలకు కల్పించి అక్కడి సాంప్రదాయలకు అర్థం లేకుండా చేశారన్నారు. ఇటువంటి ఆలయ జ్ఞానరహిత కాలంలో శైవపీఠ ప్రచారకులైన జయేంద్రసరస్వతి, వైష్ణవ పీఠ ప్రచారకులైన చినజీయార్ తిరుమల దేవస్థానా విషయంలో విభేదించడం మనుషులను అయోమయంలో పడవేస్తుందన్నారు. శాస్త్రాలు ఆరుకాగా నేటి గృహాలకు అన్వయిస్తున్న వాస్తు శాస్త్రం ఆల యాలకు గల ఆగమశాస్త్రాలు ఎక్కడివని, అన్నింటికి అతీతుడైన దేవునికి నియమాలు కల్పించి తిరుమలలో వెంకటేశ్వరునికి ఆగమనియమాలను ఆచరింప చేయవచ్చునా అని ప్రశ్నించారు. తిరుమలలో మొదటి గాలిగోపురానికి, చివరి గర్భగుడికి ఉండవలసిన పద్ధతి తెలియకపోగా ఆలయ ప్రాంగణం గురించి వాధించుకోవడం ఎంత వరకు సమంజసమని ప్రశ్నించారు. శఠగోపం అర్థం తెలియక, ఆరాధనా పద్ధతులు తెలియక సాంప్రదాయ పద్ధతిగా ఉన్న ఆలయాలకు ధర్మపద్ధతి తెలుపని వారు ధర్మప్రచారకులవుతారా అని ప్రశ్నించారు. ఇటు ప్రజలకు అటు ప్రభుత్వానికి బ్రహ్మవిద్య శాస్త్ర నిర్దేశత తెలియదని దాంతో ఏది సత్యమో, ఏది అసత్యమో తెలియక పోరపాటు పడుతున్నారన్నారు.

ఆంధ్రజ్యోతి మార్చి 14 3 2004

ఈనాడు 12-3-2004

## లోక్‌సత్తా ఆధ్వర్యంలో పీఠాధిపతులను ఒక వేదికపైకి తేవాలి

కాచిగూడ, మార్చి 11 (న్యూస్‌టుడే): తిరుమల సాంప్రదాయాల విషయంలో శైవ పీఠ ప్రచారకులైన జయేంద్ర సరస్వతి, వైష్ణవ పీఠ ప్రచారకులైన చినజీయర్ స్వామిలు పరస్పరం విబేధించడం వల్ల ప్రజల్లో అయోమయం నెలకొందని శ్రీప్రబోధ సేవా సమితి- జ్ఞాన విజ్ఞాన వేదిక స్థాపకులు ఆచార్య ప్రబోధానంద అన్నారు. లోక్‌సత్తా ఆధ్వర్యంలో ఒక కమిటీని ఏర్పాటు చేసి పలు పీఠాధిపతులు, స్వామీజీలను ఒక వేదిక మీదికి తెచ్చి ఎవరి మాటలో హేతుబద్ధత, శాస్త్రీయత ఉందో తెలుసుకుని నిజాన్ని ప్రకటించాలని కోరారు. గురువారం నగరంలో ఏర్పాటు చేసిన విలేకరుల సమావేశంలో ఆయన మాట్లాడారు. ప్రపంచంలో కేవలం 6 శాస్త్రాలే ఉన్నాయని, వాస్తుశాస్త్రం, ఆగమశాస్త్రం అసలు శాస్త్రాలే కావన్నారు. ఈ విషయంలో బహిరంగ చర్చకు వస్తే తాను నిరూపిస్తానని పేర్కొన్నారు. శివ పంచాక్షరి మంత్రంలో ఓం అనే అక్షరాన్ని లెక్కించకూడదని దాంతో 5 అక్షరాలు వస్తాయని జయేంద్ర సరస్వతి అంటుండగా, అష్టాక్షరి మంత్రంలో ఓం అనే అక్షరాన్ని కలిపి లెక్కిస్తేనే 8 అక్షరాలు వస్తాయని చినజీయర్ స్వామీ అంటున్నారని ఈ ఇద్దరిలో ఏది నిజమని ఆయన ప్రశ్నించారు.

## తిరుమలేశుని పూజలపై న్యాయనిపుణుల కమిటీ వేయాలి

శైవ, వైష్ణవ ఆచారం ప్రకారం తిరుమల తిరుపతిలో పూజలు జరిపించాలన్న అంశంపై నెలకొన్న సమస్యను శాస్త్రీయంగా, హేతుబద్ధంగా పరిష్కరించటానికి న్యాయశాస్త్ర నిపుణులు, లోక్‌సత్తా ప్రతినిధులతో ఒక కమిటీని వేసి పరిష్కరించాలని త్రైత సిద్ధాంత ఆదికర్త ఆచార్య ప్రబోదానంద విజ్ఞప్తి చేశారు. గురువారం నాడిక్కడ జరిగిన విలేకరుల సమావేశంలో ఆయన మాట్లాడుతూ వైష్ణవఆచారాల ప్రకారం పూజలు నిర్వహించాలని చిన జీయర్ స్వామి, శైవ ఆచార ప్రకారం తిరుపతిలో పూజలు నిర్వహించాలన్న అంశంపై తలెత్తిన సమస్యను పరిష్కరించాలని ఈ సమస్యను జటిలం కాకుండా ప్రభుత్వం చూడాలని కోరారు.

12 - 3 - 2004
సుప్రభాతము వార్త

## శాస్త్రీయంగా సమస్యను పరిష్కరించాలి

బషీర్‌బాగ్, మార్చి 11: శైవ, వైష్ణవ ఆచారాల ప్రకారం తిరుపతిలో పూజలు జరిపించాలన్న అంశంపై నెలకొన్న సమస్యను శాస్త్రీయంగా, హేతుబద్ధంగా పరిష్కరించడానికి న్యాయశాస్త్ర నిపుణులు, లోక్‌సత్తా ప్రతినిధులలో ఒక కమిటీని వేసి పరిష్కరించాలని త్రైత సిద్ధాంత ఆదికర్త ఆచార్య ప్రబోధానంద కోరారు. హైదర్‌గూడలోని న్యూస్ సెంటర్‌లో జరిగిన విలేకరుల సమావేశంలో ఆయన మాట్లాడుతూ వైష్ణవ ఆచారాల ప్రకారం పూజలు నిర్వహించాలని జీయర్ స్వామి, శైవ ఆచారాల ప్రకారం తిరుపతిలో పూజలు నిర్వహించాలన్న అంశంపై తలెత్తిన సమస్యను పరిష్కరించాలని, సమస్యను జటిలం చేయకూడదని ప్రభుత్వాన్ని కోరారు. వెంకటేశ్వర స్వామి నామాల గురించి, ఏడుకొండల ప్రాముఖ్యత గురించి భక్తులకు వివరించాలని ప్రబోధానంద విజ్ఞప్తి చేశారు.

ఆంధ్రభూమి : 12.3.2004 శుక్రవారము.

అనంతపురం, మార్చి 14 (ప్రభాతవార్త)

తిరుమల దేవస్థానంలో సాంప్రదాయాలు ఉన్నాయా? లేవా? అని ప్రబోధ సేవా సమితి జ్ఞాన విజ్ఞాన వేదిక అధ్యక్షులు, త్రైత సిద్ధాంత ఆది కర్త ఆచార్య ప్రబోధానంద యోగీశ్వరులు ఆదివారం ఇక్కడ జరిగిన విలేకరుల సమావేశంలో తిరుమల దేవాలయ నిర్వాహకులను ప్రశ్నించారు. ఆలయ జ్ఞాన రహిత కాలంలో శైవ పీఠ ప్రచారకులైన జయేంద్ర సరస్వతి, వైష్ణవ పీఠ ప్రచారకులైన చినజీయర్ స్వామి తిరుమల దేవస్థాన విషయంలో విభేదించడం అయోమయంలో పడేవేస్తోందన్నారు. పూర్వపు ధర్మం ప్రకారం తిరుమల వెంకటేశ్వరుని గుడిలో ధ్వజస్తంభానికి ఉండవలసిన సాంప్రదాయమున్నదా? గర్భగుడి ముందర గల ఏడు ద్వారమాలకు సాంప్రదాయబద్ధంగా పూజలు చేస్తున్నారా? అసలు శఠగోపం అంటేఏమిటో తెలుసా ? మంగళ హారతి కర్పూరంతో ఇస్తున్నారా? కర్పూరం ప్రాముఖ్యత తెలుసా? పూర్వపు ఆనవాయితీ

### తిరుమలలో సాంప్రదాయాలున్నాయా?

ప్రకారం గర్భగుడిలో ప్రతిమకున్న నామంను, హస్తంను చూపడం జరుగుచున్నదా? నామంకు హస్తంకున్న విశేషత తెలునునా? గర్భగుడిలోనికి పూజకొరకు నిర్దిష్టమైన వ్యక్తులు తప్ప ఎవరు ప్రవేశించకూడదను నియమం పాటిస్తున్నారా? గర్భగుడి అంటే అర్థం తెలుసా? గుడి ముందర కొట్టు కొబ్బరి కాయలు జుట్టు పైకిచూపి కొట్టుచున్నారా? అసలు కొబ్బరి కాయపై జుట్టు విషయం తెలుసా? అనే ప్రశ్నలకు జవాబు దొరకడం లేదన్నారు. అనంతపురం బైపాస్ రోడ్డులో నిర్మించిన 60 అడుగుల ఆంజనేయస్వామి ప్రతిమకు మధ్యలో తెల్లని నామం పక్కలలో ఎర్రని నామమాలు తీర్చిదిద్దారు, ఇవి వైష్ణవులకు సమ్మతమేనా అని ఆయన ప్రశ్నించారు. తిరుమలలో దేవునికి కొళాయి నీరు, గ్యాస్‌స్టౌ అగ్ని పవిత్రున్ని చేయగలదా అన్నారు. ఇటు ప్రజలకు అటు ప్రభుత్వానికి బ్రహ్మ విద్య శాస్త్రనిర్దేశత తెలియక పోవుట వలన ఏది సత్యమో ఏది అసత్యమో తెలియడం లేదన్నారు. న్యాయబద్ధమైన సమాజమేర్పడాలని భావించే లోక్‌సత్తా వారు ఒక కమిటీగా ఏర్పడి పెద్దలం అనుకొనే స్వాములను వేదిక మీదికి తెచ్చి ఎవరి మాటలలో హేతుబద్ధత, శాస్త్రబద్ధత ఉందో తెలుసుకొని ఇదియే నిజజ్ఞానమని ప్రకటించాలన్నారు.

15-3-04. సోమవారం [illegible]. వార్త

# చివరి మాట

మతములు మనుషులకే గాని దేవునికి లేవు. రాజకీయ పార్టీలు దేశములోని ప్రజలకేగాని దేశములోని పదవికి లేవు. పదవి ఒక్కటే ఉన్నా పార్టీలు అనేకమున్నట్లు దేవుడొక్కడే అయినా మతములు అనేకముండవచ్చును. అందరు పదవిని కాంక్షించినట్లు అందరు మోక్షమును కాంక్షించవచ్చును. పదవిని కోరువారు పదవియొక్క పవరేమిటి అని దానివివరము ముందే తెలిసినట్లు దేవుని పొందగోరువారు దేవుని యొక్క స్థితిగతుల జ్ఞానమును ముందే తెలిసి ఉండాలి. అన్ని మతముల వారు కోరుకొనునది దేవుని సన్నిధినే అందువలన వారి వారి మతముల ప్రకారము దేవున్ని గురించి వివరించి చెప్పుకొన్నారు. ఇందూ మతములో దేవున్ని గురించి తెలుసుకొనుటకు దేవాలయములను నిర్మించుకొన్నారు. ఇతర మతములవారు దేవాలయములను నిర్మించుకొనక వారి వారి మత గ్రంథముల మీదనే ఆధారపడుచున్నారు. ఇందూ మతములో పూర్వము నిర్ధిష్ట గ్రంథము లేకుండ ప్రత్యక్షప్రమాణములుగ దేవాలయములనే నిర్మించారు. సృష్టించిన వారి ఉద్దేశము గొప్పదే దేవాలయములలో ఉన్న అర్థములు గొప్పవే. దేవాలయములు దేవుని వివరమును తెలుపు ప్రమాణములుగ ఉండినప్పటికి కాలక్రమేపి అవి అంతరించి పోయాయి. దేవునికి మనకు మధ్యలో బేరసారాలు జరుపు కేంద్రములుగ దేవాలయములు మారిపోవడమువలన మనుషులలో కోర్కెలు ఆలయములలో హుండీలు పెరిగిపోయాయి. ఇటువంటి సంస్కృతి

మంచిది కాదని మేము తెల్పుచు ఆలయ రహస్యముల గురించి వ్రాసినది మీరు చూచారు కదా! దేవాలయములో దేవునికి సంబంధించిన వివరము తప్ప ఏమి ఉండకూడదనునది మావాదన. కావున ఆలయములలో దేవుని జ్ఞానమునకు సంబంధించిన వివరమునే ఈ గ్రంథములో మీరు చూచి ఉంటారు. దేవాలయములో భూతుబొమ్మలని తాపీధర్మారావు గారు వ్రాసిన పుస్తకము చూచాము. ఎవరి లోకము వారిదన్నట్లు ఆయనకు అంతా శృంగారమే కనిపించింది. మాకు మాత్రము అంతా జ్ఞానమే కనిపించింది. ఈ గ్రంథము చదివిన తర్వాత మీకు జ్ఞానమే కనిపించాలని కోరుకుంటున్నాము. తర్వాత మీ బుద్ధికేది అందుతుందో జాగ్రత్తగ చూచుకొండి.

**ఇట్లు**

## శ్రీ ఆచార్య ప్రబోధానంద యోగీశ్వరులు

• ● •

**ఒక విషయమును సమర్థించుటకు శాస్త్రము ఎంత అవసరమో, అట్లే ఒక విషయమును ఖండించుటకు శాస్త్రము అంతే అవసరమగును.**

• ● •

**అసత్యమును వేయిమంది చెప్పినా అది సత్యము కాదు,**
**సత్యమును వేయిమంది కాదనినా అది అసత్యము కాదు.**

# DEVAALAYA RAHASYAMULU

ప్రముఖుల లేఖ

సాక్షి న్యూస్ పేపరు 21-01-2014



## ఇందు దేశమే ఇండియా!

**హి**మాలయాలకు, వింధ్యపర్వతాలకు మధ్యగా అప్పటి ఆర్యావర్తనం (ఆర్యుల భూభాగం) ఎక్కడ ఉండేదో మన దేశ పటంలో నువ్వు చూశావు. అది బాల చంద్రాకారంగా ఉన్నట్లు కనిపిస్తుంది. అందుకే ఆర్యావర్తానికి ఇందుదేశమని పేరు వచ్చింది. ఇందు దేశమే హిందూదేశమయింది.

రామాయణం పుట్టిన చాలాకాలానికి మహాభారతం పుట్టింది. అది రామాయణం కంటే పెద్ద గ్రంథం. దానిలో చెప్పింది ఆర్యద్రావిడ యుద్ధం కాదు. ఆర్యుల మధ్య ఏర్పడిన కుటుంబకలహమే భారతకథ. భారతంలో చెప్పిన కథలు, ధర్మాలు ఇన్నీ అన్నీ కావు. అవి చాలా అందంగా, గంభీరంగా ఉంటాయి. వీటి అన్నిటికంటే గొప్పదైన భగవద్గీత అనే మహా గ్రంథం మహాభారతంలో ఉన్న కారణాన అది మనకందరికీ ప్రియతమమైనది అయింది. వేల సంవత్సరాల క్రితమే మన దేశంలో ఇలాంటి గొప్ప గ్రంథాలు పుట్టాయి. మహానుభావులే వీటిని రాసి ఉంటారు. ఈ గ్రంథాలు పుట్టి ఇంతకాలం గడిచినా వాటి గురించి తెలుసుకోని పిల్లలు, ప్రయోజనం పొందని పెద్దలు అంటూ ఉండరు.

* నెహ్రూ ఇందిరకు రాసిన లేఖలోనుంచి